నల్లగొండజిల్లా ఉరుమడ్ల గ్రామ వాస్తవ్యులయిన బ్రహ్మశ్రీ పంతంగి వెంకటేశ్వరరావు గారు నవయువకులై నవీనవిద్యాసంపన్నులయినను ప్రాచ్యవిద్యాసంప్రదాయములయం దాదరాభిమానానుభూతులు గల వివేకవంతులు. వారీ వివేకశిఖరాలను శ్రద్ధతో విని యానందించి దీనిని ముద్రింపించుట కుత్సాహసంతోషములతో బూనుకొని నిర్వర్తించినందులకు వారి సరసోదారమధుర సుకుమారభావసమంచితమనీషకు నేనెంతయు కృతజ్ఞుడను. యువకులలో వారి ఓజశ్శక్త్యుత్సాహములు ఆదర్శముగా నాటుకొనినచో భారతీయత చక్కగా పునర్నిర్మింపబడగలదని నే నాసించుచున్నట్లున్న వారి నిత్యవర్తనములు అభివందనీయములు.

# ఒక మాట

భాగ్యనగరమున జరిగిన రవీంద్రభారతీ ప్రారంభోత్సవదినమున శ్రీ శాస్త్రిగారును, నేనును వీధిలో నడచుచు జీర్ణగ్రంథములలో నొక చోట గాంచిన ఆంగ్లప్రతి నొకదానిని తెచ్చిననాడే వారు చదివి, నన్ను ను చదువుమనిరి. నే నిది ఆంధ్రీకరింపుమని అర్థించితిని. వారంగీకరించి అనతి కాలమున తదేకనిష్ఠతో పూర్తిజేసిరి. అట్లు పూర్తియగుటయే తడవుగ శ్రీ పంతంగి వెంకటేశ్వరరావు గారు విని ముద్రాకార్యమునకు బూను కొనుటయు పూర్తియగుటయు వెంటవెంట జరిగినవి.

శ్రీ ఆచార్యుల గ్రంథము లింతవరకు ఆంధ్రమున వచ్చినట్లు లేదు. అసమానములయిన వారి వాక్యములను శాస్త్రిగారు చదువుచు తన్మయులై నిద్రాహారముల మఱచిపోయి దీనిని రచించిరి. భారతీయులలో అంత వారు లేరని వారి భావన.

ఇట్టి గ్రంథమును మా సాహితీమేఖల ఈ నాడు వెల్వరచు చున్నందులకు మేమొందుచున్న సంతోషమును సోదరాంధ్రులు సయితము పొందిచదివి మాకిట్టి గ్రంథము లింకను ప్రకటించుట కుత్సాహమును గలి గింతురని యాసించుచున్నాము.

మా ప్రచురణములకు సహాయపడినవారి కెల్లరకును, మాకు చిత్ర ము బ వ్రాసియిచ్చిన చిత్రకళానిష్ణాతులు శ్రీ కొండపల్లి శేషగిరిరావు గారికిని, ముద్రణ చక్కగా శీఘ్రముగా జేసిపెట్టుచున్న శ్రీ నావల్ ప్రింటర్స్ వారికిని మా హృదయపూర్వకకృతజ్ఞతాభివందనములు.

సాహితీమేఖల
చండూరు.

పులిజాల హనుమంతరావు,
వ్యవహర్త.



# ఆచార్యులను గూర్చి కొన్ని వాక్యాలు

**More Tidend Aslesund 9-12-1919**

'Words of wisdom from ancient days uttered in a new age ... ... ... ... ...

The play of thought is brilliant and complex, yet at the same time so simple and chaste.'

**Indian Mirror Feb. 17-1920.**

'Much of Acharya's writing is after the manner of Rabindranath Tagore but he sometimes excels the great Bengali in beauty of language and imagery.'

**The Birmingham Post 23-12-1919.**

'Both Acharya and Tagore in their thoughts come into line with wordsworth Shelley Byron Tennyson and Carlyle in their most excited moods.'

**The Inquirer 24 April. 1920.**

'In his faith that one heart moves through the minds of men, as all travelling in the same divinely appointed end his love of beauty and his sense of spiritual interpretation of life is as marked as Tagore's.'

**Prof. Jaygopal Banerji in 'The Modern Review' for May, 1921—.**

'Utterances which evince an essentially broad and modern outlook on life and its problems, thoroughly imbued with whatever is highest and best in the democratic spirit of the west... inspiring in these days of a new 'storm and stress'.

**Social Demokraten.**

'We Europeons cannot fail to be impressed by the author's lofty view of the aim and meaning of life, humane teaching, his idealistic exhortation to the nations to unite together for the realisation of those ideals which have been the dream of all good men of all times.'

**Hawgesunds Avis 30-12-1919 (Norwegian).**

'Sree Ananda Charya looks through Nature as it were into a lofty serene universe of thought which lies above and beyond Nature... ... Sometimes he seems to be quite beyond this world - only hovering spirit and sailing thought—. He feels happiest, he lives his best life up there in the realms of pure thought, but the ideas which he finds up there he wants to bring down. Down to the heart of man's daily life he wants to send his words. They shall teach man to weave life's web after the heaven willed pattern.'

**Social Demokraten** (Sweden).

'An undercurrent of the rare true religion which we call universal love runs through the whole.'

**Illustretete Tridende** (Denmark)

'In Sri Ananda - we have a representative of that India which is more than the fragance of lotus and soft dreams of Nirvana.'

**The Glasgow Herald 29-1-1920.**

'With thoughts wise and beautiful the book is stored as to make it a real contribution to the cause of humanity helping us to walk safely on the razor-edge Path of Truth.'

# విషయానుక్రమణిక

పుట.


| | | |
|---|---|---|
| 1. | అన్వేషణ | 1 |
| 2. | విధ్యుక్తము | 9 |
| 3. | సమైక్యత | 21 |
| 4. | ధ్యానము | 34 |
| 5. | స్మృతి | 46 |
| 6. | స్వప్నము | 55 |
| 7. | భావన | 66 |
| 8. | సందేశము | 77 |
| 9. | త్యాగము | 86 |
| 10. | శాంతి | 96 |
| 11. | శక్తి | 108 |
| 12. | ఆశ | 120 |
| 13. | ప్రవర్తన | 130 |
| 14. | క్రమాభివృద్ధి | 139 |
| 15. | అర్పణము | 149 |
| 16. | సూర్యోపాసన | 156 |
| 7. | అమృతరహస్యము | 166 |
| 8. | సాక్షాత్కారము | 173 |

ప్రాచ్యపాశ్చాత్యసాహిత్యతత్త్వవిజ్ఞానశాస్త్రఖని, కవి, పండితుడు, యోగి అయిన శ్రీఆనందాచార్యస్వామి మహర్షి. అనుభవమూర్తి ఆదేశాలు 'వివేకశిఖరాలు'. హిమాలయాలలో నార్వే పర్వతాలలో వారి ఏకాంతవాసాలు బ్రహ్మానందానుసంధానసంపన్నాలు. వారి వాక్కులు ప్రాకృతికజీవితరుజాపీడితులకు సంజీవనీరసధారాశీకరాలు.

This is a series of eighteen lectures on the Reconstruction of the Humanity-Ideal together with a new Interpretation of the Laws of Real Living and their relation to a hitherto undiscovered Aspect of Nature, called Person-Nature and to God, delivered to a truthseeker, who having suffered an earthquake of the soul during the Great War, set out in quest of Yoga Peace and Truth and reached Mt. Kailas in 1919.

# అన్వేషణము

" ఆచార్యదేవా ! యోగజ్ఞానములు భక్తికర్మలతో సమన్వయము నొందు ఏ విధానమున మీ రానంద మొందుదురో దాని నుపదేశింతురని మిమ్ము ప్రార్థించుచున్నాను."

" శిష్యచూడామణీ ! ఏ వివేకము యోగజ్ఞాన భక్తికర్మల మూలమున ని న్నీశ్వరసన్నిధానమునకు జేర్పగలదో దాని నుపదేశింతు నాలకింపుము."

"ఈశ్వరతత్త్వముయొక్క స్వభావమును గూర్చి ప్రప్రథమమున విచారింతము. మన ఆత్మలో నివిష్టుడై యున్న పరమాత్ముని మన మెఱుంగుకొఱకే ఈ మన ఐహికజీవనము ఉద్దేశింపబడినది. ఆత్మ పరమాత్మల నెఱుగుటయే మానవజీవితలక్ష్యము. ఈ పృథివిపై ధన మార్జించి వివాహమాడి సౌధముల నిర్మించి మరణించుటకే మన మీ లోకమున అవతరించితి మనుకొనువారు పెక్కురు కలరు. వా రొక శ్రేణికి జెందినవారు, మఱియొక తెగకు జెందినవా రున్నారు. వా రిట్లను కొందురు—' ధనార్జనము, కర్మాచరణము, వివాహము, భోగానుభవము, చేయవలసి యున్నను ఇవియే చాలవు. వివేకము లేకున్నచో ఇవి అన్నియు వ్యర్థములు ' అని. ఉత్తమమైన వివేక మనగా ఉత్తమసత్యము నన్వేషించుటకు ఉద్యమించుట. ఆ మహోన్నతసత్యాన్వేషణ మొనర్చుటకే ఇహమునందు మన ఈ మనికి ఏర్పడినది. మఱి ఆ మహోన్నత సత్య మేమి ? దేవుడని చెప్పబడుచున్న బ్రహ్మపదార్థము. ఈ రీతి

లోకమున రెండు దృష్టు లున్నవి. ఒకటి పార్థివము. ఒకటి దివ్యము. మొదటిది అవిద్యామనస్కు లయిన ప్రాకృతులకును, విద్యాగంధ మున్నను, వర్తమానసుఖమునకు మించి చూడని వారికిని సంబంధించి నది. ఇక రెండవది విద్యాసంపన్నులై వివేకవంతులైన వారికి సంబం ధించినది. వారిలో ఒక జిజ్ఞాసానలజ్వాల ఈ జీవితమున కర్థ మేమి? అని కనుగొనుటకు జ్వలించుచుండును. మన ఈ ఏబది అరువది సంవత్సర ముల బ్రతుకునకు గల పరమార్థ మేమై ఉండునో ఎఱుగవలె నను వాంఛ ప్రజ్వలించుచుండును. కావున బ్రహ్మ నెఱుగగోరువారు మిగిలిన ప్రాకృతులవలె కాక ఒక విలక్షణమైన జీవితపథమున నడయాడవలసి యున్నది.

బహుదూరమునుండి వచ్చి, బహుకష్టములకు లోనై బహు విఘ్న ముల నెదుర్కొనిన వాడ వగుటచే నీవు జ్ఞానదాహమునకు పరిచితుడవు. మహోన్నతము మహోత్తమము అయిన జీవితము గడుపవలె నను వాంఛాక్షుధను అనుభవించువాడవు. కావున పరమసత్యము నెఱుంగగోరు రెండవ తెగకు జెందినవాడవు. ఆ పరమసత్యము నెఱుగ నీలగునా, దాని నెట్లెఱుగ వలయును, అని నీవు ప్రశ్నింపవచ్చును. దాని కొక విధాన మున్నది. నీ వాంఛ నిజమైనదే అగుచో నీవు దాని నందుకొనగలవు. దాని నందుకొనుటకు రెండు త్రోవ లున్నవి. ఒకటి ఏమనగా—లోతుగా ఆలోచించి నీ అంతరాత్మ శ్రేష్ఠమని చెప్పిన ప్రకారము జీవనపద్ధతిని నడపుచు జీవితసమస్యను నీకై నీవే పరిష్కరింప యత్నించుట. అయితే ఏకాంతముగా అన్యసహాయములేని ఈ యాత్ర కడు కఠినమైనది. ఇక రెండవది ఏమనగా—ఒక గురువును జేరి వానినుండి పరమసత్యము నెఱుగు బోధ లనుసరించుట, ఈ రెండవది శ్రేష్ఠమైనది. కేవలము గురు వాక్యములు వినుటవలన లాభము శూన్యము. శిష్యుడు వానిని ఆచరణ మున బెట్టవలయును. గురువు చెప్పిన ప్రకారము జీవితమును నడుప

వలయును. భారతదేశమున ఇదియే ఆచరింపబడును. ఒక గురువు చెంతకు బోయి ఆయన శ్రేష్ఠమని చెప్పిన బాటన నడతుము. వాని గృహమును జేరి, ఆ కుటుంబమున నివసించి, వాని సేవ జేయుదుము. నీకు పాఠము లారంభించుటకు ముందు నిన్ను కట్టెలమోపును గడ్డి మోపును తెమ్మంటిని. నీ కాశ్చర్యము కలిగియుండును, ఇవి చిహ్నాములు. శిష్యు డనును — "స్వామీ ! నేను పరమసత్య మెఱుగుటకు మీ చెంత కరుదెంతిచిని," అని. అప్పుడు గురు విట్లనును "ఓయీ ! నీకు విశ్వాస మున్నచో, నేను చెప్పినట్లు సరిగా ఆచరించుచో నీ కా పరమ సత్యము నందించెదను ' అని. అంత శిష్యుడు సర్వవిధముల గురువును వినయ విధేయతలతో సేవించుటకు వాగ్దానము చేయును. వాని కుటుంబములో తా నొకడుగా ఉండి యథాశక్తి గురుసేవ జేయుచుండును. కట్టెల మోపు సేవాచిహ్నము. వాని గోవుల గాయుటకు తా నంగీకరించినట్లు గడ్డి మోపు చిహ్నము. ఆ దినము మొదలు శిష్యునకు గురువు జ్ఞానబోధ చేయును. గృహకార్యములందు శిష్యుడు గురువునకు నొప్పి తగులనీయక పరిచర్య సేయుచుండును. గురువు తన గృహకార్యము లన్నియు తానే నిర్వర్తించు కొనుచుండినచో శిష్యున కుపదేశించుటకు అవకాశము లేక పోవును. కావున శిష్యుడు పార్థివక్రియలలో గురువునకు తోడ్పడును. గడ్డి మోపులో కట్టెలమోపులో ఉన్న అర్థ మిది. గురు వి ట్లనును — ' నీ సేవ నంగీకరించుచున్నాను, నీవు నాకు పరిచర్య చేయుచున్నావు. కనుక నీకు జీవిత పరమార్థ మందించుటకు నా శక్తికొలది యత్నింతును ' అని. హిమవత్పర్వతములలో వింధ్యగిరులలో దక్షిణాద్రులపై పాఠశాలలు కలవు. వానిలో విద్య నభ్యసించుటకు దేశము నలుమూలలనుండి విద్యార్థు లరుదెంతురు. అచట గురుసన్నిధిలో వారు మూడో ఎనిమిదో పండ్రెండో ఇరువదినాలుగో సంవత్సరములు విద్య నభ్యసించుచు వసింతురు. కొందఱు కొలదికాలమే వసించి విద్య ముగించుకొని గృహములకు

తిరిగివచ్చి వివాహమాడి గార్హస్థ్యమున బడుదురు. కాని మఱికొందఱు ఎక్కువ కాల ముండి విద్య లార్జించుచు ప్రకృతిపురుషుల తత్త్వముల రహస్యములు గ్రహించుటకు నిశ్చయము బూని యుందురు. కావున గురువునుండి జ్ఞానము నార్జించు ఈ రెండవత్రోవ మిగుల సులభమైనది. ఏల ననగా ఆగురువు సయితము తన గురువునుండియు, ఆ గురువు తన గురువునుండియు ఇట్లు పరంపరగా జరిగిన సత్యాన్వేషణమార్గ మిది. ఈ రీతి అనంతకాలమునుండి తరతరములుగా గురువునుండి శిష్యుడు తన వినయ విధేయతలకు భక్తికి సేవకు ఫలములుగా ఈ సత్యములను పొందు చున్నాడు. అత డేమియు ధనమును వెచ్చింప పనిలేదు. ఇది మన వింత గొల్పు విద్యావిధానము. ధనాసక్తితో గురువు విద్యను చెప్పుట కాదు. నామట్టుకు నేనును నా గురువునకు ధన మిచ్చి నేర్వలేదు. ఈ గురుశిష్య సంబంధము జీవము లున్నంతవఱకు ఉండును. గురువు మహాత్ముడని గౌరవింతుము. ఆయన మరణించినను విశ్వాసమును భక్తిని వీడము, పరలోకమునుండియు మన ఆత్మను జ్ఞానముతో నింపుచున్నట్లే మనకు బోధ చేయుచున్నట్లే భావింతుము.

ఐహికజీవితముయొక్క లక్ష్య మేమియో అర్థము చేసికొనుటకు ఇప్పుడు యత్నింతము. మన మేడనుండి వచ్చితిమి ? ఎందుకు వచ్చి తిమి ? కొంచెము కొంచెముగా నే జెప్పుదానిని నీ వర్థము చేసికొన శ్రమింతువేని వెలుగు చిక్కగలదు. ప్రప్రథమమున భాష కొంచెము ప్రతిబంధకముగా నున్నట్లు ఉండినను, కాలము వెంబడి ఆ ఆటంకము నతిక్రమించి సర్వమును గ్రహింపగలవు. శిష్యునకు మున్ముందట ఉండ వలసిన ముఖ్యలక్షణము విశ్వాసము. గురుబోధను గ్రహింపగల శక్తి మనస్సు ఆసక్తి అవకాశము తన కున్నవని అతడు నమ్మకముగలిగి యుండవలయును. గురువు శుద్ధసత్యము నార్జించి యెఱింగి తనకు విశ్వసనీయముగ ఇచ్చుచున్నా డను నమ్మకమును సయితము కలిగి

యుండవలయును. కావున గురువుయొక్క మాటలో గురుత్వములో జ్ఞానములో అట్లే తన భక్తిలో శక్తిలో శ్రద్ధలో, పూర్ణవిశ్వాసము కలవాడు కావలయును. ప్రథమాంశ మందుచే గురువులోనను తనలో నను నిండు నమ్మిక గలిగియుండుట. ఈ విధమైన చిత్తవృత్తి అనగా తనలోనను గురువులోనను పూర్ణవిశ్వాసము కలుగుటయే ఆధ్యాత్మికమైన ఆదర్శమైన జీవితమారంభమైన దనుటకు నిదర్శనము. విశ్వాసమున కింత ప్రాముఖ్య మేల అని నీ వడుగవచ్చును. కొంచెము సేపు నీ వాలోచించి చూతువేని సకలవివేకమునకు సకలవిద్యలకు విశ్వాసమే ఆరంభమని నీవు గుర్తింపగలవు. ఒక పసిబాలుని జూడుము. అతడు మాటలాడుట ఎట్లు నేర్చుకొనుచున్నాడు ? తన తల్లియు, తండ్రియు. అక్కలు, అన్నలు ఉచ్చరించిన శబ్దములను తిరిగి పలుకుచున్నాడు. అతడు సంశయించి 'నే నట్లు పలుకను' అని యనుచో అత డెన్నడును మాటలాడుటను నేర్వ జాలడు. తరువాత కాలక్రమమున బడికి పోవుచున్నాడు. ఉపాధ్యాయు డొక అక్షరమును జూపి "ఇది అ" అని చెప్పిన ఇతడు "కాదిది ఇ"అని చెప్పుట మొదలిడిన యెడల అత డెన్నడును వర్ణసమామ్నాయమును నేర్వ జాలడు. ఉపాధ్యాయుడు బోధించుచున్న దానియందు పూర్ణవిశ్వాసమును బొందియే అత డారంభము చేయవలయును. అట్లొనర్చునేని గురువు లను గ్రహించి యిచ్చు సర్వవిజ్ఞానమును అత డందుకొని ఒక శాస్త్రవేత్త కాగలడు. అప్పు డతడు తన విద్య నంతటిని ప్రశ్నింపగలడు. అందనుక తా నార్జించిన ప్రాథమికవిజ్ఞానముచే అతని మనసున రభ్యాస మలవడి అది వికసించును. ఈ వినిన దానిలో ఈ నేర్చిన దానిలో సత్య మెంతవఱ కున్న దని ఆ మనసు సంశయించి ప్రశ్నించును. ఎందులకు ? తా నార్జించిన విజ్ఞానముయొక్క సత్యమును పరీక్షించుటకు అట్టి ప్రశ్నల కతడే సమా ధానములు సిద్ధముచేయగలడు. ఇది లెక్కలుచేయు పిల్లవాని అనుభూతి వలె నుండును. నల్లబల్లపై ఉపాధ్యాయుడు లెక్కలు చేసిన పిమ్మట

కూర్చుగాక ! ఇప్పుడు జగమునకు యోగజ్యోతియొక్క వెలుగు మిక్కిలి ఆవశ్యకమై యున్నది.

నీవు మిగుల సహనమును బూనవలయును, అత్యంతసహనము ఆలోచనము ఆసక్తి లేనిది ఈ వీధి నేమాత్రము నేర్చుకొనలేవు. క్రమముగా నీకు ఆధ్యాత్మికజీవితముయొక్క ధర్మములనుగూర్చి చెప్పుదును. జాగరూకతతో వినుము. నేను చెప్పువానిని గూర్చి చక్కగా ఆలోచించుము. ప్రతిమాటను వ్రాసికొనుము. అది మున్ముందు నీ వేగెడి చోటుల నీకు మిగుల ఉపకరించును.

# విధ్యుక్తము

జీవితములో మానవుని విధి యేమి ? ఈ విశ్వమున మానవు డొక్కడే లేడు. వ్యష్టియైన మానవు డున్నాడు. సమష్టియైన మానవానీక మున్నది. మహాప్రకృతి ఉన్నది. కావున ప్రకృతిని మానవుని మానవానీకమును — ఈ మూటిని కూర్చి గ్రుచ్చిన దండలో మనము విశ్వ సూత్రమును గ్రహింపవచ్చును. మానవుని జీవితవిధి ఏమి ? అని మన మెఱుగగోరు నెడల, ముందు మానవానీక మనగా నేమి ? ప్రకృతి అనగా నేమి ? అని విచారింపవలయును. ఎందుకనగా ప్రపంచమున మానవు డొంటరిగా లేడు. అడుగడుగున జననము మొదలు మరణమువఱకు మానవునిపై వాని ప్రభావ మున్నది. అతని ప్రభావము కూడ వానిపై నున్నది, మానవానీకముతో ప్రకృతికి గల ఈ మానవుని సంబంధము లేక ప్రవర్తనమే వాని విధియై యున్నది. మానవ పరిణామచరిత్రను పఠించితిమేని అతడు వృద్ధి నొందుటకు మూడు కక్ష్యలను లేక దశలను గడచినట్లు కనుగొందువు. మానవు డిప్పు డున్న దశకు వచ్చుటకు ఆ మూడుదశలు మూడు శక్తులై వానిని దిద్ది తీర్చినవి. మొదటిదశ నిస్సహాయదశ, మానవుడు జన్మించినప్పుడు కేవల మసహాయుడు, పసివాడు, అతడు గాలిని పీల్చుకొనుట గూడ ఎఱుగడు, తినుట ఎఱుగడు, నిద్రించుట ఎఱుగడు. ఈ మూడు ప్రధాన విషయములు. ఇప్పుడు మన మెంత సహజముగా చేయుచున్నామో — ఇవి ఆ పసివానికి నేర్పవలసియుండెను. ఐహికజీవితములోని ఈ మూడు విషయములయందు ప్రావీణ్యము గడించినను అసహాయదశ గడచినట్లు కాదు. ఆ పసివానిని పది లేక ఇరువది సంవత్సరముల

వయస్సు వచ్చువరకు కాపాడవలయును. కాబట్టి వ్యష్టిమానవుని ప్రథమ దశ పూర్ణముగ నిస్సహాయదశ అయినట్లుగా చూచుచున్నాము. అదే ప్రకారము మానవానీకముయొక్క ప్రథమదశ నిస్సహాయము. మానవుడు తన మనికియొక్క మొదటిదశలో ఒంటరిగనే నిలబడి ప్రకృతి శక్తుల నెదుర్కొనవలసి యుండెను. అతనికి అగ్ని నెట్లు చేయుటయో తెలియలేదు. తన ఆహారము నెట్లు వండుకొనవలయునో ఎఱుగడు. అతడు దిగంబరుడై తిరిగినాడు. అత డెట్లు సుఖజీవనమును గడుపగలడో ఆ రహస్యములను ప్రకృతి బహిర్గతము చేయలేదు. ఎండ, వాన, గాలి అతని శరీరమును దయారహితముగా బాధించినవి. కనీసము తా నేమి తినవలయునో కూడ అత డెఱుగడు. ఫలములు కందమూలములు పుష్కలముగా ఉండినవి. కాని ఏది తినుటకు యోగ్యమైనదో తెలియక విషవస్తువులను తిని అనేకులు మరణించిరి. తుదకు తాను త్రాగవలసినది ఉప్పునీరా, మంచినీరా అనికూడ అతనికి తెలియకుండెను. అతనికి నివాసయోగ్య మైనవి గిరిప్రదేశములా గిరికందరములా ఎడారిసీమలా కడలి దీవులా పాప మతనికి ఎఱుకపడలేదు. క్లిష్టముగ నుండి అదియా, ఇదియా, ఏది యెన్నుకొనుట. ఏది విడనాడుట. అని తెలియని అయోమయావస్థను పొందెడివాడు. ఈ ప్రకారము మానవానీకముయొక్క ప్రథమదశ పూర్ణముగ నిస్సహాయమైనది. ఈ నిస్సహాయస్థితినుండి అతనికి బాధానుభవము ఉత్పన్న మైనది. ఎవరినుండి ఈ బాధ ? దయారహిత మైన ప్రకృతినుండి. ప్రకృతిరహస్యములతనికి మూతవడియున్నవి. నాగరకత అనగా నేమి ? సంస్కృతి అనగా నేమి ? ఖండఖండములుగా అసహాయస్థితిని జయించుట, కొంతకొంత నేర్చుకొని తన బాధను తగ్గించుకొనుట, ఇది మానవానీకవిషయము. వ్యష్టిమానవుని జీవితము స్వల్ప మైనది; ఏబదియో అరువదియో నూరో సంవత్సరములు. కాని, మానవానీకము జీవించుచునే యుండును. వ్యష్టిమానవుని బాధలు నివారణము

చేయు ఆవిష్కారములనుండి లాభములను బొందుచు అది సాగిపోవుచుండును.

ఇక రెండవదశ—మానవానీకమునకు వలెనే వ్యష్టిమానవునకును స్వయంసహాయదశ. ప్రకృతిరహస్యము లతడనేకములు కనుగొనినాడు. అగ్నిని రగుల్కొల్పుట, అన్నము వండుట, ఇల్లు కట్టుట, ఎండ వాన మంచు గాలి—వీనినుండి తనను రక్షించుకొనుట, శత్రువులనుండి తప్పించుకొనుట, వ్యాధులబారినుండి ఔషధముల సాయమున శరీరమును కాపాడుట ఇవి అన్నియు నేర్చినాడు. సంఘములు, రాజ్యములు, సామ్రాజ్యములు నిర్మించినాడు. మానవానీకముయొక్క ప్రస్తుతదశ ఇదియే. మానవున కింకను పెక్కు బాధ లున్నవి. అనేకములను శాస్త్రవిజ్ఞానమున అతిక్రమించినాడు. వ్యష్టిమానవునియొక్కయు మానవానీకముయొక్కయు ఈ రెండు దశలును వారికి ప్రకృతితోడి సంబంధమును తెలుపుచున్నవి. ప్రథమదశలో మానవునికి ప్రకృతితోడి సంబంధము, రెండవదశలో మానవునికి ప్రకృతితోడి సంఘర్షణము చూచుచున్నాము. ఇక మూడవ దశలో ప్రకృతివలన అతనికి సమకూడు సత్ఫలముకొఱకై ఎదురు చూచుచున్నాము. ప్రకృతి అతనికి సామగ్రిని సమకూర్చకున్న అతడభివృద్ధిపథమున ముందునకు సాగెడివాడు కాడు. ప్రకృతిలో అగ్నియే లేనున్న అతడు తన ఆహారమును వండుకొనుట నేర్చుకొనెడివాడుకాడు. అట్లే వస్త్రములు గృహములు మొదలయిన ఇతరవిషయములు. కాబట్టి వ్యష్టిమానవుడు ముఖ్యముగా ప్రకృతికి సంబంధించి యున్నాడు, అట్లే మానవానీకముకూడ. అందుచే మానవుని ప్రకృతితోడి వర్తనమే అతని విధి యగుచున్నది, అది అతని విధి యని ఎందు కనుచున్నాను? విధి అనునది ఒక సహజమైన ప్రక్రియ. దీనికి నిర్వచన మిట్లు చేయవచ్చును. దేనివలన తనకు మంచి సమకూడునో దానిని చేయుట విధి. ప్రకృతి

యెడ మానవుని ప్రవృత్తి సరియైన దగుచో అతని ఆత్మకు శరీరమునకు మంచియే ఒనగూడును.

మూడవదశ ఇంకను రానున్నది. ఆ దశలో మానవుడు, మానవానీకము ప్రకృతి మంచిగనే ఉందురు. మానవుడు క్షేమంకరములయిన ప్రకృతిరహశ్శక్తులను కనుగొనుటచే బాధ అనునది ఉండనేరదు. మానవుడు పూర్ణముగ నైతికజీవి కాగలడు. ఇప్పు డిట్లు లేదు. కాని ముందు ముందు ప్రకృతికి మానవునకు పూర్ణసామరస్యము కూడగలదని మనమూహింపవచ్చును. అభ్యుదయముయొక్క ఈ మహాపరిణామగతిలో మిక్కిలి ముఖ్యమయిన అంశ మేది? లోలోపల పనిచేయున్న నిజమయిన శక్తి లేక భావము ఏమై యుండవచ్చును? ప్రకృతిమానవుల వెనుక నున్న నిజమైన భావ మేదియో గ్రహించుట మిగుల కష్టము. మొదట మానవు డసహాయుడుగా నుండెనని చెప్పితిని. కాని కొన్ని విచిత్రములయిన పరిస్థితుల సంఘటనమున 'ఇట్లు వర్తించినచో నాకు క్షేమము కలుగగలదు' అను నొక భావము ఉద్భవించినది. పసివానికి ఊపి రాడకుండెను. ఆకలి యయ్యెను. అలసిపోయెను. అపుడు గుండెపై రాచినచో అతడు గాలిని బీల్చెను. పాలు బోయగా త్రాగెను. శయ్యపై పరుండబెట్టగా నిద్రించెను. కావున ఒకానొక మార్గము ననుసరించిన తాను సుఖము నొందగల నను భావరేఖ పసివాని హృదయమున మెఱసినట్లు కాననగును. అట్లే మానవానీకముపట్టున సైతము. మానవుడు ఎండను గాలిని మంచును వానను తట్టుకొనుటకు ఒక యిల్లు కావలె ననుకొనినాడు. ఆతనిలో ఏదియో ఇట్లు చెప్పినది. "ఆ చెట్టుక్రిందికి పొమ్ము. నీకు విశ్రాంతి లభించును" అని. అత డట్లే పోయినాడు. రక్షణము దొరికినది. అత డొక దావాగ్నిని కాననమున గాంచినాడు. అతని అంతర్వాణి ఇట్లు పలికినది "నీ వాహారమును సేకరించి ప్రేల్చుము. అది బాగుండును" అని. అత డట్లే చేసి వంట నేర్చినాడు. అత డాకులను గైకొని

శరీరమును కప్పుకొనినాడు. కొంచెము వేడిమి కలిగినది. కాలక్రమమున వస్త్రములు సిద్ధముచేయుట నేర్చుకొనినాడు. ఈ రీతి పసివానిలో, సమష్టి మానవునిలో వారివారి సుఖమునకై ఏదో ప్రేరణము, వారి హృదయములో అంతస్సులో ఎదో శక్తి ఇది చేయుము అది చేయకుము అని ప్రబోధించినట్లు కాంతుము. ఈ అంతర్వాణియే, అంతస్సులోని ఈ శక్తియే ఆత్మ. కాబట్టి జీవితములో మహాఘనమైన పరమసత్య మీ ఆత్మ. ఇది మాంసము కాదు, రక్తము కాదు, ఎముక కాదు, దేహము కాదు. ఇది ద్రవ్యము కానిది, రూపము లేనిది. కాని మానవుని క్షేమమునకై నిరంతరము ప్రేరణచేయునది. వికసించు మనఃకమలమునకు ఆత్మ సూర్యబింబము, ఇక్కడ తత్త్వశాస్త్రమున ప్రవేశింతుము. తాత్త్వికుడు ప్రాకృతికవిషయములను పరిశీలించినప్పుడు వానిని నిర్జీవములనుగా జూచును. అవి అతని కేమియు చెప్పవు. నదులు పర్వతములు అతనితో ఏ మాత్రమును భాషింపవు. కాని మానవుని దేహములో నున్న రహశ్శక్తి ఏమి చేయవలయునో అతని కనుక్షణము చెప్పుచుండును. నేను బాటపై నడచుచున్నా ననుకొనుడు. దప్పి కలిగినది. ఒక నది చేరువకు వచ్చితిని. నే నేమి చేయుదును ? నదిలోనికి చేరి నీరు త్రాగి దాహము నార్పుకొందును. చీకటిపడిన దనుకొనుడు. నాకు త్రోవ తెలియదు. ఒక మానవు డటు వచ్చును. నాకు త్రోవ జూపును. కాబట్టి మానవుని అంతస్సులో ఏమియో కలదు, మిక్కిలి వింత గొల్పునది. అత్యంతసుందరమైనది, రక్తమాంసములతో కూడిన బహిశ్శరీరమున కెప్పుడును మార్గదర్శక మైనది. ఇక్కడనే మనము మానవుని అభ్యుదయముయొక్క హేతువును కనుగొందుము. రూపముతో రక్తమాంసములతో అస్థులతో వర్ణముతో కూడుకొనిన బహిర్మానవు డొక పదార్థము, సద్భావసమంచితమైన చిత్సంపత్తి ఒక పదార్థము. ఇదియే ఆత్మ. రెండవది రక్తమాంసాస్థిమయము ప్రకృతిపదార్థము. ఆత్మ మానవుని

నడపును. ఆత్మ నిరంతరము మానవుని కేది సుఖదాయకమో క్షేమంకరమో చెప్పుచుండును. సమస్తకళలు, కవిత్వము, శిల్పము, గ్రంథజాలము, సంగీతము, విజ్ఞానశాస్త్రము – ఇట్టి దంతయు ఆత్మయొక్క సృష్టి. ఈ దేవాలయ మేమి ? అ దెట్లు లేచినది ? అది మనసుచే నిర్మింపబడినది. ఎందులకు ? ఒక మనస్సు పూజింప గోరినది. ఇంకొక మనస్సు అంగీకరించినది. పూజామందిరము నిర్మింపబడినది. ఒక గ్రంథమును జూడుడు. ఒకానొకని హృదయాంతరాళపు లోతులనుండి అది పైకుబికినది. ఒక లాంతరును గాంచుడు. చీకటిచే బాధపడిన ఒక చిత్తము దాని పనిలోనికి దిగుటచే లాంతరు అవతరించినది. బహిర్మానవు డేది కోరునో అంతర్మానవుడు దానిని అందించును. బహిర్మానవుడు భిక్షకుడు, అంతర్మానవుడు సంపన్నుడు. బహిర్మానవుడు వ్యాధిపీడితుడు కాగా అంతర్మానవుడు వైద్యుడై ' ఈ మందు త్రాగుము ' అనును.

ఈ రెండు విధములయిన దృష్టులనుండి రెండు రకములైన నాగరకత ఉత్పన్నములైనవి. ఒకటి ఇట్లనును— ' మనము లోని ఆత్మను కనలేము, కావున మనము దానిని గూర్చి ఆలోచింప పనిలేదు. మనము బహిర్మానవుని మాత్రమే ఎఱుగుదుము. ఈ బహిర్మానవునకు సుఖము సంతోషము భోగము కావలయును. కావున శరీరమునకు ప్రీతి గూర్చుటను గుఱించియే మన మాలోచింతము ' అని. దీనిని భౌతికనాగరకత అందురు. దీని సిద్ధాంత మిట్లుండును— ' శరీరమున కేది ప్రేయమో దానిని చేయుము; ఏది శ్రేయమో ఆ విచారణము చేయు శ్రమ వలదు ' అని. ఈ సిద్ధాంతమే యుద్ధమును దుఃఖమును విపత్తును తెచ్చిపెట్టును. కొందఱి ట్లందురు — ' దయ సత్యము సౌందర్యము— ఈ మొదలయిన వానిని గూర్చి ఆలోచింపకుము. శరీరమునకు నీ చేతనైనంత సేకరింపుము. దొంగిలింపుము. దోపిడి చేయుము. కొల్లగొట్టుము. నీ కొకసౌధము, ఐశ్వర్యము, యశము, నీ వాంఛ ఏది కావలయు నన్న దాని

నెల్ల సంతరింపుము' అని. వేలకొలది మనుజులు దొంగతనములు చేయు చున్నారు. హత్య లొనర్చుచున్నారు. ఎందులకు? వారి భార్యల శరీరము లపై ఆభరణము లలంకరింపజేయుటకు. ఇతరులకు నాయకులై స్నేహి తులలో విద్వేషములు రెచ్చగొట్టి హత్యాకాండకు పురికొల్పి తాము గొప్ప తనము నందుటకై ప్రాకులాడిన అసంఖ్యాకులను చరిత్ర ఉదాహరించు చున్నది. మానవానీకముయొక్క దురంతదుఃఖమునకు మూలకందము ఈ భావమే, పురాతనమానవుల చరిత్రలను జాగ్రత్తతో పఠించితిమేని ప్రతి కాలమునందును శరీరసౌఖ్యమునకు దేవులాడుచు మానవజాతి పెరుగుచు వచ్చినది. కాని ఈ జాతులన్నియు తుదకు దుఃఖమును పొంది ఆరిపోయి నవి. అవి అన్నియు ఇంచుమించు హతములైనవి, వారి పట్టణములు పాడుపడినవి, వారి పేర్లు విస్మరింపబడినవి, వారు పుడమిని వీడి పోయిరి.

మఱియొక విధమైన నాగరికత కలదు. అది యిట్లు చెప్పెను. " ఈ దేహము తాత్కాలికము మాత్రమే, అది ఏబదియో అరువదియో సంవత్సరములు మాత్రమే జీవించును. కాని మహోఘనమైనది, ఎన్న టికిని మరణించనిది. ఒకటి కలదు ' అని. అది ఏది? భవిష్యన్మానవజాతి. ఆ నాగరికత నిర్మించువారి ట్లందురు — ' రాబోవు మానవ జాతి లాభించు నట్టి జీవనమార్గమున మనము నడుపవలయును. మనకు పిమ్మట వేలకొలది లక్షలకొలది సంవత్సరములకు రాబోవు మానవులకు ఉప యోగపడు ఊహలను మన మూహింపవలెను. అట్టి కర్మలను మన మాచరింపవలెను. మంచి పనులనే చేయుటచే, సుందరభావములనే ఆలోచించుటచే, మన ఆత్మకు అనగా మన అంతర్మానవునకు ఆనంద మును సమకూర్తుము. ఈశ్వరుడు మననుండి వాంఛించిన కర్మలను ఆచరించిన వార మగుదుము' అని, అందుచే ఈ రెండు విధములయిన నాగరకతలు ఒక దానితో నొకటి సంతతము సంఘర్షణపడుచుండును.

అంతర్మానవుడు సమ్యగ్జీవితసౌందర్యానుభవముననే ఆనంద మొందును. శరీరమును తృప్తిపరచగోరు వారు సుఖపడుటకు దొంగతనము చేయవలెను, హింస లొనర్పవలెను. హత్య లాచరింపవలెను. ఆధ్యాత్మిక నాగరకతను నిర్మించువా రల్పసంఖ్యాకు లగుటచే అభిభూతు లగుదురు. మొదటి వారు ఆధ్యాత్మికజీవితమును శుద్ధసత్త్వమయజీవితమును గడుప నెన్నుకొని ఇట్లందురు. 'మేము సమ్యగ్జీవితములు కాని జీవితములను గడుప గోరము' అని. ఇక రెండవవా రిట్లందురు "మే మేదియు లెక్కచేయము. రేపు మరణింప నున్నాము గాన నేడు తిందుము త్రాగుదుము సంతోషముతో గంతులు వేతుము" అని. కాబట్టి స్పష్టముగా కన్పట్టున దేమనగా ఈ భౌతికనాగరకతయే క్రమముగా వృద్ధిబొందినచో సకలదుర్వృత్తులు రాక్షసరూపములు దాల్చి బలము కూర్చుకొని తమ కంతరాయముగ నున్న వారినే గాక సకలప్రపంచమును మ్రింగివేయ గలవు. పెద్ద పట్టణము లన్నింటిలో పందలకొలది లక్షాధికారులను అనేకగృహములు గుఱ్ఱములు వాహనములు కలవారిని, వేలకొలది అర్థైశ్వర్యము కలవారిని లక్షలకొలది గర్భదరిద్రులను నీవు చూడ గలవు. ప్రతిప్రదేశమున నీ వీ క్రింది తరగతుల వారిని చూతువు... ఐశ్వర్యసంపన్నులు, అర్థైశ్వర్యవంతులు, కొంచె మున్నవారు, తినటి అనునది ఇల్లు కాని వస్త్రము కాని ఆహారము కాని లేని దరిద్రులు. అనేకనగరములలో లక్షలకొలది జనులకు వంటచెఱకు లేదు. ప్రతి దినము తినుటకు తిండియే లేదు. ఇది యంతయు ఎందువలన? సంఘములో కొందఱు భాగ్యవంతులుగా బలవంతులుగా అధికారులుగా ఉండగోరి, మిగిలినవారు సగము చచ్చినను పూర్తిగా చచ్చినను లెక్కించుట లేదు. ఇది భౌతికనాగరకత. భాగ్యవంతులు తోడేళ్లు పెద్దపులుల వంటివారు. బీదలు గొఱ్ఱెపిల్లల వంటివారు. పెద్దపులులు గొఱ్ఱెపిల్లలను మ్రింగును. వస్త్రములు తయారుచేయు ఒక యంత్రాగారమును చూడుడు,

ధనబలసంపన్నుడొక్కడుండును. అతడు ధనసంపన్నుడగుటకు తోడ్పడుచు అతనిక్రింద వేలకొలది జను లుందురు. వారు దారిద్ర్యముతో నిండిన జీవితములలోనికి క్రుంగదీయబడుచున్నారు. వారికి నేయి ఉండదు. పా లుండవు. కూర లుండవు. దినదినము బీద లగుచుందురు. విద్య ఉండదు. గ్రంథములు చదువరు. వారు విశ్వవిద్యాలయోపన్యాసముల వినరు. వారు క్రమముగా దిగజారుదురే కాని, నాగరకజీవనప్రమాణము నందుకొనలేరు. సర్వప్రపంచమున ఈ నాడు అమలునందున్న పరిస్థితి ఇది. ఎందుకో తెలియునా? ప్రతిజాతియొక్క మూలమంత్ర మిట్లు పలుకును "ఒకరిని ఒత్తిడిచేయగలవాడే జీవించుగాక. ప్రక్కవాని క్షేమము నాలోచింపకుండుగాక. మిగిలిన ప్రపంచ మంతటిని కష్టపెట్టి నష్టపెట్టి మనజాతిని సంపన్న మగునట్లు వృద్ధిచేయుదుము గాక" అని. ప్రపంచము నందు కొన్నిదేశములలో నల్లని మేఘముల అంచులు వెండి వెలుగులు మెఱయుచుండును. ఇతర ప్రదేశములలో వసించు జనులపై చంద్ర తారకలు లేని కాటుకమొయిళ్లు అంధతమస్సుతో నడయాడుచుండును. అట్టి దేశములను నీవు చూచి యుండవు. కావున నీ వూహింపలేవు. కాని నా కండ్లతో నే నెల్ల ప్రదేశములు చూచితిని. ఆశాపూర్ణమై నా హృదయ మెంత దిటవు గొన్నను నా దృష్టి ఒక మిణుగురుపురువు వెలుతురు నైనను కాంచ లేక వ్యర్థప్రయత్న మైనది. కావున భౌతిక వాదము నారాధించు వారితో ఇట్లందుము "ఓయీ! మీ రింతటితో మీ యత్నముల నాపవలెను. ఆత్మ కేది సరిపడునో దానినిగూర్చి ఆలోచింప వలయును. జీవనమున కేది సర్వోత్తమమార్గమో దాని నెన్నుకొనవల యును. దాని మూలమున ఎల్లరు శాంతితో సామరస్యముతో విజ్ఞానము తో జీవింపవలయును" అని.

నీవు వసింపబోవు దివ్యప్రదేశములలో ఈ భయంకరోద్యమము ప్రవేశింపకుండు గాక. మీ కొక మంచి ప్రజాస్వామ్యప్రభుత్వ మున్నది.

ప్రజ లెల్లరు సమాన మనిషే అందురు. ప్రజాప్రతినిధియే ప్రజానాయకు డగుచున్నాడు. కాని ప్రస్తుతకార్మికవిధానమునకు రాబోవు ఫలము నూహించితివా ? ఆ ఫలితము రెండు ప్రవృత్తులు కలది. అది సంఘమందొక భాగమువారిని మోసగాండ్లనుగా దయారహితులనుగా హృదయము లేని వారినిగా సిద్ధముచేయును. మఱియొక భాగమువారిని చికాకు పొందు వారినిగా అసంతృప్తిగలవారినిగా తయారుచేయును. మనుష్యులను తక్కువచేసి యంత్రములను పెంపుచేయును. మానవమనఃప్రవృత్తిపై ఈ ద్వివిధఫలితము పడి, జరుగున దేమనగా — రాబోవుకాలమున పశువులకంటె హీనులగు మానవు లేర్పడుదురు. ఇప్పుడు నూతనమైన విషయములను కనిపెట్టు వారును యంత్రములను నడుపువారును నిస్సంశయముగా శక్తివంతములయిన మేధస్సులు కలవారే, గొప్ప విజ్ఞానము కలవారే, వైద్యునకు రోగిలో రక్తపిత్తమువలననో, క్షయజ్వరమువలననో, పొంగెడు రక్తమువలన నేర్పడిన శరీరస్థూలతను బోల్చినవారు వారు. ప్రతిమహానగరములో కారాగారము లెప్పుడును నిండి యుండును. ప్రభుత్వపు లెక్కలను పరిశీలింతురేని ఎల్ల చోటుల నెక్కువ ధనము చెఱసాలలపై పిచ్చివారి ఆసుపత్రులపై వెచ్చింపబడుచున్నట్లు చూతుము. ఇందులకు కారణ మేమి ? వేలకొలది మనుజులకు తినుట కేమియు లేక దొంగిలింపవలసివచ్చి చెఱసాలలు చేరిరి. వేలకొలది జనులు శక్తికి మించి శ్రమించి మేధశ్శక్తులు చెడిపోవ దుర్వృత్తుల దగిలి పిచ్చివారై ఆసుపత్రులు చేరిరి. ఇది యంతయు భౌతికనాగరకతాఫలితము.

ఇప్పు డాధ్యాత్మికనాగరకతను గమనింతము. దాని మూలసూత్ర మేమి ? 'నీ ఆత్మను నీవు చూచునట్లే సర్వభూతములను చూడుము. నీ జీవితమును నీ ఆత్మను నీవు ప్రేమింతువేని సకలమానవలోకమును ప్రేమింపవలయును. సకల ప్రపంచమునకు నీవలన సుఖమే ఒనగూడునట్లు బ్రతుకుము ' అని. ఇది పెక్కురకు వింతగా నుండును. నే ననేక

మహానగరములలో ఉపన్యసించితిని. ప్రజలు నన్నిట్లడిగిరి ' అవును, ప్రపంచమును సముద్ధరించుటకిది యొక్కటే మార్గమను మాట నిజమే. కాని, ఈ మాట లాలింతు రెవరు ?' అని. నేను ప్రపంచములో అనంత దుఃఖమును గాంచితిని. కాని, నా కాశ కలిగినది. ఏమనియో తెలియునా? రాబోవు తరములో జన్మించు స్త్రీపురుషులు తమ శరీరసౌఖ్యమును గూర్చి ఆలోచించువారు కాక సర్వప్రపంచములోని స్త్రీపురుషుల సౌఖ్యమును గూర్చి విని అర్థము చేసికొని అనుభవములోనికి తెచ్చుకొందు రని. త్వరలో ఈ క్రింది ప్రకారము వచించువారు పుట్ట నున్నారు. ' మేము సుఖపడుటకు ముందు ఇతరులను సుఖపెట్టవలయును. నేను తినుటకు ముందు నా ప్రక్కవాడు తినుటకు కలిగి యుండవలయును. నేను వస్త్ర ధారణము చేయుటకు ముందు నాతోడివాడు ధరించుటకు వస్త్రములు కలిగి యుండవలయును ' అని. హృదయముతో చైతన్యముతో కూడిన ఇట్టి మతమే భవిష్యన్మానవుల మతము కాగలదు. నీ వాసక్తితో ఈ సమస్యను గూర్చి ఆలోచింతువేని ఆ మార్గమున శ్రద్ధతో వర్తింపగలవు. దుఃఖము బాధ నివారింపబడగలవు. ఇది ఒక్క దినమున అగు పని కాదు. రేపే ఈ గోళము ప్రళయతమోగుహలో జారి పడిపోవుట లేదు. కాని, నీవు మహాసక్తితో పావనధర్మబుద్ధితో పనిచేయ నారంభింతువేని ఉత్తర ధృవము మొదలు దక్షిణధృవమువఱకు నేల నాలుగు దిక్కుల మన ధ్వనిని ప్రతిధ్వనింప జేసి విన్పింప గలవు. మానవులు విందురు. మన ఉద్యమమునకు సహాయపడుదురు.

ఈ పలుకునది ఆత్మ అనియు, బహిర్మానవునకు అంతర్మానవుడు మార్గదర్శకు డనియు, ఇది వరకు చెప్పియుంటిని. సర్వభూతములను నీ ఆత్మవలెనే పరిగణింపు మను భావము అంతర్మానవుని పెదవులనుండి బహిర్గతమైన వేదవాక్కు. కావున స్త్రీపురుషు లెల్లరలో ఆత్మ కల దనుటను అందఱు గ్రహింపగలరు. ఇక్కడ మన మనుకొనుచుండిన వాక్య

ములు సకల ప్రపంచమున ప్రతిధ్వనింప గలవు. దానంజేసి ప్రపంచమం దంతట శాంతిప్రేమమంత్రము పునశ్చరణ చేయబడగలదు. కావున నే జెప్పిన దేమనగా — న్యాయముగా ధర్మముగా భక్తియుతముగా పని చేయుము. దానివలన నీ ఆత్మలో ఒక శక్తి ప్రభవించును. ఆ శక్తితో నీవు ప్రపంచములోని ఊహాప్రవాహమును నడుపగలవు. మానవులు తమ జీవితములలోని దుర్భరస్థితిని గమనించునట్లు చేయబడరేని, వారి ప్రస్తుతస్థితికి గల మూలకారణములను పరిశీలించునట్లు చేయబడరేని, వారిని వారు సంస్కరించుకొనుటకు పురికొల్పబడనేరరు. నీ జీవితమును పరిశుద్ధమైన దానినిగా ఉత్తమమైన దానినిగా జ్యోతిర్మయముగా జేసికొనుము. నీ వుండు కావున నీ వొక ప్రదీపస్తంభమువంటి వాడవు కావలయును. రాత్రివేళన దారినబోవు నావలకు ఆ ప్రదీపస్తంభమునుండి ప్రసరించు కాంతికిరణములు దారి జూపగలవు. నీ వెడతెగక ధ్యానమగ్నుడవై ఈ విషయములు నిరంతరముగ తలచుచుందువేని నీ తలంపులను ఇతరులు వినగలరు. మన తలంపులను ఎల్లప్పుడు మాటలతో చెప్ప పనిలేదు. మనము తీక్ష్ణముగా తలచుచుందుమేని మనము ఒక్క పలుకైనను పలుకకయే మన హృదయాక్రందనములు ప్రజలకు రహస్యముగా వినిపించును. ఆధ్యాత్మికజీవితములోని రహస్య మిది యొకటి. మంచివా డేది తలచునో అది ఇతరులకు వినిపించును. అందుచే మంచి తలపులనే తలచుచుండుము.

# సమైక్యత

ఈ విశ్వము నిట్లు నిలుపుచున్న శక్తి యేమై యుండవచ్చును?
ఈ జగదంబరపు టల్లిక నిట్లు భూతభవిష్య ద్వర్తమానములయందు
నిల్పగలుగుచున్న దేదియో మన మూహింపగలమా? కడు పురాతన
కాలములనుండి తత్త్వవేత్తలు మేధావులు దీని కీలకమును దీని ఆధార
మును ఈ జగత్తు తన యథాస్థానమున నెట్లు నిలచియున్న దను అంశ
మును కనుగొని సంతృప్తి నొందుటకు మిక్కిలి యత్నించిరి. దేని
మూలమున మనము బ్రతుకుచున్నాము? దేనిమూలమున మరణానంత
రము మనము తిరిగి జీవించగలము? దేనిని చేరుటకు మన మాశించు
చున్నాము? దేని నీ జన్మలో చేర లేకున్నాము? అదియే ఏకత్వము.
భాషలో ఏకము అను మాట కడు వింతయైనది. ఏకత్వ మను స్తంభముపై
ఈ భూమి ఈ ఆకాశము ఈ జన్మ ఉత్తరజన్మ ఆధారపడి యున్నవి.
మన తత్త్వశాస్త్రము ననుసరించి ఆలోచించినచో రహస్యములకు మూల
కంద మీ ఏకత్వమే. "ఎవరక్కడ?" అని నేను ప్రశ్నించుచో "నేను"
అని నీవు సమాధానము చెప్పుదువు. ఈ "నేను" అను దాని కర్థమేమి?
నీవు ఏకమాత్రుడవు కాని, అనేకుడవు కా వని దాని అర్థము. ఒకడ వను
నీ భావమే నీ వర్తమానస్థితికిని భవిష్యత్ స్థితికిని హేతువు. నీవు బాలకు
డవుగా నున్నప్పుడు బడికి పోతివి. నీ విప్పుడు యువకుడవు. కాని నీ
వదే మానవుడ ననుచున్నావు. ఎందుచేత? అదే ఆత్మ వరుసగా నీలో
నున్నట్లు నీవు విశ్వసించుచున్నావు. ప్రతిమానవుడు ప్రతిజంతువు ప్రతి
వృక్షము ఈ ఏకత్వచైతన్యమునే కలిగియున్నది. వటవృక్షము వట
వృక్షమే, జంబుకము జంబుకమే, వ్యాఘ్రము వ్యాఘ్రమే. ఇదియే ఏక

త్వము. ఈ ఏకత్వభావ మున్నంతవరకు వ్యష్టి కలదు. ఇక ప్రకృతి యొక్క బాహిరమును గాంచుడు. గగన మొక్కటియే. దక్షిణ ధృవము చెంత చూచినను ఉత్తరధృవము చేరువ గాంచినను అమెరికాలో చూచినను ఆసియాలో చూచినను ఒకటే గగనము సర్వభూగోళము నావరించి యున్నది. దానిలో ఎన్ని తారకలు ఎన్ని గ్రహములు ఎన్ని ఉపగ్రహములు జీవించుచు సంచలించుచు ఉన్నను గగన మొక్కటియే. ఈ ప్రకారమే మన హృదయములో మన ఏకత్వమును మానవుని ఏకత్వమును. బహిఃప్రపంచమున విశ్వము ఏక గగనముచే ఎట్లు నిల్పబడినదో అట్లే భావింతుము. కావున మానవునిలో గాని భౌతిక జగత్తులోగాని ఉభయపార్శ్వముల ఏకత్వమునే కాంచుచున్నాము. ఈ ఏకత్వజ్ఞానమే తత్త్వమునకు మొదలు చివర అగుచున్నది. నీ విట్లనవచ్చును, "ఈ విశ్వములో అనంత పదార్థములను చూచుచున్నాము. అనేకులు మానవులు అనేక జంతువులు అనేక వృక్షములు అనేక తారకలు అనేక గ్రహములు చూచున్నాము కదా! అట్టచో ఈ అన్నింటికిని ఆ ఏకత్వ మెట్లాధార మగుచున్నది? బహుత్వముండగా ఏకత్వము నెట్లు చెప్పుట?" అని. ఇది మిగుల క్లిష్టమగు సమస్య. అనేకమై ఏకమగు సమస్య. పెక్కురు తాత్త్వికులు ఈ విషయము చర్చించిరి. నిజమైన తీర్మానము ఈ అనేకములు ఆ ఏకములో భాగము లని. అనేకులు మానవు లున్నారు. ప్రతిమానవుడును తా నొక్కడైనట్లు చెప్పుచున్నాడు. కాని నిజముగా చూచినచో మహాఘనమైన ఒక మొత్తములో అతడు భాగమాత్రుడు. ఒక చెట్టును గాంచుడు. దాని కనేకములు కొమ్మ లున్నవి, అనేకము లాకు లున్నవి, అనేకము వేళ్లున్నవి. అయినను అది ఒకే వృక్షము. అది ఒక వృక్ష మనుట చేతనే మనకు తెలియుచున్న దేమి? అనేకములు కొమ్మ లున్నను ఆకు లున్నను వేళ్లున్నను చెట్టునందున్న ఒకే జీవ మా వృక్షశబ్దముచే సూచింపబడుచున్నది. అట్లే మానవుడు నైతము. అతనికి రెండుచేతు లున్నను, రెండు కాళ్లు

న్నను, ఇరువది ప్రేళ్లున్నను, అనేకములు కేశము లున్నను, అతఁడొక్కడే. ఈ అనేకము లయిన అంగము లన్నియు ఒకే మొత్తములోని భాగములు. మనము ఒకర మను భావమును మనలో మనమే కలిగి యున్నాము. అదే విధముగా వ్యక్తు లనేకులు స్త్రీలు పురుషులు లోకము నం దున్నను మన మందఱము ఒకటియే. మానవానీక మంతయు జాతు లన్నియు నల్ల వారైనను తెల్ల వారైనను అందఱును కలిసి ఒకే మాన వాత్మ. ఈ విశ్వము ఈ సూర్య కుటుంబము ఆ సూర్యుని కేంద్రముగా గలిగియున్నవి. అట్లే ఆత్మ ఒక్కటియే కలదు. ఈ మానవజాతు లన్నియు ఆ ఆత్మలోని అంశములు. మానవానీకమునెడలను ప్రకృతి యెడలను మానవుని ప్రవర్తనమే అతని విధి అని ఇదివరకు చెప్పితిని. దాని అర్థ మేమి? అట్లేల కావలయును? ఎందు కనగా మానవుడు మానవానీకము ప్రకృతి మూడును ఒకటే. సహజముగా జూచినను తత్త్వవిచారణ చేసి చూచినను ఒక్కటియే. మఱి అనేకత్వముమాట యేమి అనిన ఏకమునుండి కలిగిన పెరుగుదల. ఏకమే అనేకమైనది. అందులకే మానవానీకము నెడలను ప్రకృతి యెడలను మానవుని ప్రవర్తనమే అతని విధి అంటిని. ఎందు కనగా తాను మానవానీకము ప్రకృతియు ఒకటే అని అతడు నిశ్చయించుకొనిన పిమ్మటనే సరియైన బాటపై ప్రవర్తింపగలడు. నీ అక్కయెడలను నీ అన్నయెడలను నీవు సరియైన మార్గమున ప్రవర్తింపవలయును. ఎందుచేత ? మీ రెల్లరు ఒకే తల్లిదండ్రులకు బిడ్డలు. అదే విధముగా ఒక మానవుడు ఆధ్యాత్మికముగా ఆదర్శప్రాయముగా వృద్ధి బొందినప్పుడు మన మెల్లరము ఒకటే అని గమనించుట కారంభించును. అంత మానవానీకమునెడలను ప్రకృతియెడలను అతని ప్రవర్తనము మధురముగా ఆశ్చర్యజనకముగా నుండును. మానవానీకమందలి భిన్న భిన్నజాతులు తెల్ల వారైనను నల్ల వారైనను తనకంటె వేరైనవారు కారను అనుభూతిని పొందును, ఒక పూర్ణ వస్తువులో తా నొక అంశ

మని తలచును. ఈ విషయము నీ వ్రేళ్లవలె నుండును. ఒక వ్రేలిని ద్వేషించవు, ఒక వ్రేలిని ప్రేమించవు. నీ వన్నిటియందును సమాన శ్రద్ధను గైకొందువు. అవి అన్నియు సమానముగా లేవని నీ వెఱుగుదువు. ఒకటి పొడవుగా, బలముగా నున్నది. అయినను ప్రతిదియు దాని స్థానమున అది యున్నది. ప్రతిదియు నీలోని భాగమే. అట్లే అధ్యాత్మికనేత్రము తెఱచుకొనినప్పుడు మానవుడు మానవానీకమందలి జాతులన్నియు ఒకటే అను నిశ్చయమునకు వచ్చును. నే నొక భాగమును మాత్రమే. మానవానీకము పరమాత్మనుండి పెరిగినదే. జీవవృక్షమునకు వేళ్ళు పరంధామునిలో నాటుకొని యున్నవి. ఇవి గూఢమైన సూక్తులు. యోగ మభ్యసించు వాని కివి సువ్యక్తములు కాగలవు.

ఇప్పుడు మన మొక ప్రధానమైన ప్రశ్నకు వత్తము. మన ప్రవర్తన మెట్లుండవలయును? మానవానీకముతో మన మెట్లు మెలగవలయును? దీనికి ప్రత్యుత్తర మే మనగా—సామరస్య సమైక్యభావములతో కూడిన సంబంధము. ఇది ఆ ప్రవర్తనలో నుండవలయును. మానవానీకము నెడల మన విధి యేమనగా—సమైక్యభావము, సౌభ్రాతృత్వము, వీనితో కూడిన జీవితము నెరపుట. మానవానీకమంతయు ఒకటే అనియు, సమస్తజాతులకు చెందిన సర్వమానవులతో సమైక్యభావముతో మెలగుట. ఇదియే ప్రథమకర్తవ్య మని బోధించు తత్త్వము బహుత్వమును జాతిభేదమును పాటించు జాత్యభిమానుల హృదయములలో స్థానమును పొందజాలదు. బహుత్వమందలి విశ్వాసమే సర్వదుఃఖములకు మూలము. ఏ జాతి కా జాతి తానే గొప్ప దైనట్లు, తన నాగరికతయే మహోన్నత మైనట్లు, భావించి దాని నితరులపై రుద్దవలయు ననియు, ఇతరములు నశింపవలయు ననియు, తనవి విస్తృతి నొందవలెననియు భావించును. ఇట్టి విశ్వాసములు జాతిహృదయమును అశాంతితో నింపి, ప్రతికక్షిపై బలప్రయోగమును జేయుటకు యుద్ధరంగమును

సిద్ధము జేయును. సమస్త జాతులలోని స్త్రీ పురుషులను పరిశీలించితిని. వా రెల్లరును ఇట్టి ఊహలనే కలిగియున్నారు. ప్రతిమానవుడును తానే పూర్ణు డైనట్లు తలచుచున్నాడు కాని అంశభూతు డైనట్లు తలచుటలేదు. నీ చిటికెనవ్రేలు 'శరీర మనగా నేనే. ఇతరాంగములు నశింపవలయును' అన్నట్లుండును. ఈ నూతనతత్త్వము జగము నావరించి కష్టమును దుఃఖమును యుద్ధమును తెచ్చిపెట్టుచున్నది. ఈ తత్త్వమునందే ధన వంతులు సంస్థానాధిపతులు విశ్వాసము గొందురు. ప్రతివా డిట్లనును 'ఈ లోకమున జీవించుటకు, ధనమును గలిగియుండుటకు, గృహములు వస్త్రములు పొందుటకు నాకే అధికార మున్నది. నా కివి కావలయును' అని. కొందఱి కివి యేవియు లేవని వా రూహింపరు. వ్యక్తిగతమైన ఈ బహుత్వతత్త్వము నవలంబించుట కొంత కాలముగ నాగరకత యైనది. దాని ప్రభావము దినదినము వృద్ధి యగుచున్నది. ఈలోన ఎన్ని భయంకరయుద్ధములు చేయబడినవో గమనించుడు. రాబోవు యుద్ధము సర్వప్రపంచమును నాశము చేయును. యుద్ధమును వాంఛించు జాతులు తామే జీవించుట కధికారము కలవార మనియు, తామే పరి పూర్ణుల మనియు విశ్వసించును. మన హృదయమునుండి సిద్ధమగు రక్తమును గ్రహించి మన సర్వావయవములు పోషింపబడుచున్నట్లే దివ్యకేంద్ర మయిన పరమాత్మహృద్రక్తమునుండి ప్రవహించు జీవ ప్రవాహము నందుకొని సకలమానవానీకము పోషింపబడుచున్నదని వా రెఱుగరు. ఆధ్యాత్మికత అనగా ఈ కేంద్రము నెఱుగుట. యోగము నభ్యసించుట అనగా ఈ దివ్యకేంద్రజ్ఞానమును ఆత్మలో భాసింప జేసి కొనుట. పరమాత్మ కేంద్ర మనియు మానవుడు పరిధి అనియు, పరమాత్మ పూర్ణు డనియు మానవు డంశమాత్రు డనియు, పరమాత్మ తల్లి యనియు, మానవుడు బిడ్డ యనియు, భావించు మహాభావమే యోగతత్త్వములోని కేంద్రభావము. ఈ విశ్వమానవానీకముతో సమ

వశముగా జీవించుటయే మన జీవితములోని విధి. నీ వడుగవచ్చును. 'నేను దీనిని అనుభూతిలోని కెట్లు తెచ్చుకొనగలను ? నేనొక అల్పాల్ప వ్యక్తిని మాత్రము. పూర్ణమైన దానితో నే నెట్లు సమైక్యతను సాధించ గలను ?' అని. కేవల మనుభూతి నొనర్చుకొనుటచేతను, ఒక మహా వేశమును పొందుటచేతను, హృదయమును మహోన్నతికి ఉద్ధరించుట చేతను, ప్రకృత్యంబర మంతటిని ఆలింగన మొనర్చుకొనుటచేతను, ప్రకృతియొక్క వైశాల్యమును ధ్యానించుటచేతను ఈ మహోద్భావమును నీ వందుకొనగలవు. ఒక వృక్షమును చూడుము. అది [illegible] పెరుగుచు సూర్యుని కిరణములవలన అది జీవించుచున్నది. పృథివీగర్భమునుండి ఆహారసారమును గ్రహించుచున్నది. సూర్యుడు పృథివీగర్భము ఈ రెండును కలిసి వృక్షముయొక్క మనికికై పనిచేయుచున్నవి. కావున పృథివీసూర్యుల వలన ఈ వృక్షము దాని జీవితము [illegible] నని ద్యోతక మగుచున్నది. ఈ పుడమిపై ప్రతివ్యక్తియు నీటిచే గాలిచే మిగిలిన మానవానీకము యొక్క ప్రేమచే పోషింపబడుచున్నాడు. ఈ భూలోకజీవితమునకు ఇవి అన్నియు కలిసి పనిచేయుచున్నవి. మన బిడ్డలయొక్క బాంధవ్యమును ఉచ్ఛేదనము చేయుట ప్రకృతి యొక్క ఉద్దేశ్యము కాదు. నీ విట్లనవచ్చును 'ప్రజ లందరు ఒకటి యెట్లు కాగలరు ? రంగులు వేఱు, భాషలు వేఱు, సంస్కృతులు వేఱు, చరిత్రలు వేఱు. సర్వవిషయములలో భిన్నులు కదా' అని. నా ప్రత్యు సమాధాన మేమనగా— రంగు భాష సంస్కృతి చరిత్ర – ఇవన్నియు యాదృచ్ఛికములు. ఇవి ప్రధానము కాదు. ప్రధానమైనది ఆత్మ. ఈ భేదములు మానవునిచే చేయబడినవి. ప్రకృతి వీని నెన్నడును ఉద్దేశింప లేదు. మన ఈ గోళమున మానవు లందఱును ఒకే కుటుంబమునకు చెందినవార మని భేద మెఱుగని కాల మొకటి ఉండెడిది. ఆ కాలపు చరిత్ర మన పురాతనసంస్కృతవాఙ్మయమున కాంతుము. దానికి సత్య

యుగ మని పేరు. ఆ యుగమున అంద తొకటిగా భావించు జ్ఞానమును శక్తిని అనుభూతిని కలిగియుండిరి. విభేదశక్తిని వా రెఱుగరు. ఇప్పుడు నీ వెవ్వ రని నిన్ను నే నడుగుచో- ఆంధ్రుడ ననియో, అరవ ననియో నీవు చెప్పుదువు. అది నీ తల్లిదండ్రులు నీకు చెప్పినమాట. నీకు భగవానుడు చెప్పినమాట కాదు. అట్లే ప్రథమయుగమున మానవుడు భగవానునికి సన్నిహితుడుగా ఉండెడివాడు. ఐక్యతను గ్రహించు దివ్యశక్తిని కలిగియుండినాడు. ఆ దినముల నెవ్వడును నే నాంధ్రుడ నని, నే నాంగ్లేయుడ నని, నేను జపానీయుడ నని చెప్పియుండలేదు. 'అందఱము మానవులే' మని, 'భగవంతుని బిడ్డల' మని, 'ఒకే కుటుంబములోని వార' మని మాత్రమే తలచెడివారు. వారికి మఱియొక శక్తి కూడ ఉండెడిది. సిద్ధాంతరీతిగా అందఱము ఒక కుటుంబమునకు చెందినవార మని గ్రహించుట కాక, ఒకరితో నొకరు బహుదూరమునం దుండియు సంభాషించుకొనగలిగి యుండిరి. ఇప్పుడు మనము టెలిఫోను టెలిగ్రాఫుల ద్వారమున సంభాషించుకొనుచున్నట్లు, ఆ సత్యయుగపు మానవులు ఆధ్యాత్మికమార్గముల పరస్పరభావముల గ్రహించుచుండెడివారు. అందుచే యుద్ధములు లేకుండెను. సంఘర్షణము లేకుండెను. భేదభావము లేకుండెను. ఆ దినములలో ప్రపంచ మంతయు ఒక గృహము. అనేకములు గదులు. ఎవరి గదిలో వారు సురక్షితముగ సుఖముగ నిద్రించిరి. క్రమక్రమముగ మానవుడు దివ్యమైన సమైక్యభావమును కోల్పోయినాడు. దూరభాషణశక్తిని కొంచెము కొంచెముగా పోగొట్టుకొనినాడు. ఈ శక్తి పోయినది మొదలు ఎడబాటు ఏర్పడినది. భేదము కలిగినది. జాతిభేదము ప్రపంచ మంతటిని ఆవరించినది. ఇదొక నూతనమైన భావము. ఒక నూతనమైన శక్తి. మన మీ జాతికో ఆ జాతికో చెందుదు మను భావము ఉత్పన్నమైనది. ఈ జాతీయతాభావమే ఒక పాపము, ప్రపంచములో ఇంతటి పాప మింకొకటి లేదు. మానవుని

పతన మనగా ఇదియే. మానవుడు స్వర్గమునకు సమీపముగా నున్నప్పుడు ఈ జాతీయత లేదు. మానవులను అతడు కేవలము దేహులుగా మాత్రమే తలచినాడు. ఆ సత్యయుగమును తిరిగి భూమికి తెచ్చుటకే మన యీ యత్నము. అందులకే యోగులు యత్నించుచున్నారు. ఈ బోధ జగమునం దంతట విస్తరించుచున్నది. ఎల్లెడల మనకు బోధకు లున్నారు. ఎల్లయెడల సమైక్యభావమును పెంపొందింప యత్నించుచున్నాము. ఈ భావనాశక్తినుండి ఒక సుహృద్భావము ఉత్పన్నము కాగలదు. అనేకుల సహాయసంపత్తులు సమకూడగలవు. నాకు పూర్ణమైన విశ్వాసమున్నది. ప్రపంచ మంతట ఆ యుగము తిరిగి రాగలదు. ఏకత్వమును సృజించుటయే మన లక్ష్యముగా నుండవలయును. మారము నందున్న గోళము లనేకములలో ముఖ్యముగా శుక్రగోళములో మఱి కొన్నిటిలోనను యుద్ధము లేదు, భేదభావము లేదు, సమైక్యభావమే కలదు. మన గోళమునకు ఈ భేదభావము ఇటీవలనే వచ్చినది. పూర్వయుగములలేకుండెను. ఈ మన గోళమునందు ఐక్యభావమును ప్రవేశపెట్టుటకు ఇతరగోళములనుండి వచ్చి జీవించియున్నవా రున్నారు. వారల్ప సంఖ్యాకులు. నిరంతరముగ కృషిచేయుచున్నారు. వారు మన అందఱితో సంబంధమును పొందియున్నారు. మనము ధ్యానమునకు గూర్చున్నవేళ మన ఊహలు ఆ గోళములపైపునకు పైకి పోవును. అప్పుడు మన ఊహలకు వారు బలమును సమకూర్చి మనకు సాయపడుదురు. ఈ ఏకభావమును గూర్చియే మొదట మనము ప్రేమపూర్ణులమై ధ్యానము చేయవలయును. ఆదర్శమైన ఈ ఐక్యభావముతో జీవించుటకే మనము జగమును వీడి వచ్చితిమి. మనబంధువులు మనలో భేదభావమును తిరిగి రేకెత్తించగల రనియే మనము మరల వారి చెంతకు బోకున్నాము. ఏకాంతముగ మన మీ కొండపై నున్నాము. క్రింది చరియల దిక్కునకైనను పోకున్నాము, ఎందులకు ? అచ్చట నున్నవారిలో భేదభావము

నిండి యున్నది. ప్రతివాని కొక ప్రత్యేకమైన మతము, ప్రత్యేకమైన రాజకీయము. ఒక డతివాది, ఒకడు మితవాది, ఒకడు సామ్యవాది. ఈ తీరుగ నున్నారు. కావుననే మన మేకాంతమున నున్నాము. వారెల్లరు భేదభావమును పెంచుటకు యత్నించుచున్నారు. ఈ భేదభావము యుద్ధమునకును వినాశమునకును దారితీయునని వా రెఱుగరు. దానిని వృద్ధిబొందనిచ్చినచో అది తుదకీ గోళమును సర్వనాశన మొనర్పగలదు. విజ్ఞానశాస్త్రము శతఘ్నులు సహస్రఘ్నులు నగు యంత్రములను కని పెట్టుచున్నది. దానిచే ఈ ప్రపంచము పూర్ణముగ నశింపగలదు. ఒక విచిత్రమైనసూత్ర మేమనగా, మనఊహలను ఫలవంతముల నొనర్చుట ప్రకృతి పని. నేటి భౌతికవాదులు ఊహించుచున్నట్లు మనము కూడ వర్తమానమున ఊహింతుమేని, ప్రకృతి మనకు వింతలైన లయశక్తుల నిచ్చును. మానసికము భౌతికమున ప్రతిధ్వనించును. మనసు కావలె ననుకొనిన దానిని ప్రకృతి అందించును కావున ఈ భేదభావము పూర్ణముగ ఓడింప బడవలెను, అణచబడవలెను. ఐక్యతను సృజించుటయే ప్రతి యోగికిని ధర్మము. యోగ మనగా నేమి ? యోగ మనగా ఐక్యతను సాధించుటకైన కర్మ. యోగ మనగా దేవుడే తేడుగా మానవానీక మంతటిని ఒక కుటుంబముగా నిర్మించుట. యోగ మనగా మాయ కాదు, మర్మము కాదు, ఇంద్రజాలము కాదు, మహేంద్రజాలము కాదు. ఐక్యతను భావించుటయే యోగము. నీవు యోగివి కాదలచుకొనినచో ఏమి చేయవలయునో తెలియునా ? భేదభావము నూహించువానిని ప్రతి వానిని నీవు విడువవలయును. నీ తండ్రికి భేదభావమున్నచో నీ వాతనిని వీడవలయును. నీ సోదరునకు భేదభావము కలిగినచో వానిని సైతము వీడుము. నీ దేశము భేదభావమును ఊహించెనా దాని నైనను వీడవలయును. అట్టి దాని నంతటిని వీడి ఒంటరిగా నిలుపుము. ఐక్యభావమును వృద్ధిచేసికొనుము. ప్రేమభావమును సమరసభావమును పెంపొం

దించుకొనుము. ఈ త్రివిధభావములు నీలో దార్ఢ్యత నొందెనా, భేద భావమును ఊహించువారు అట్టి భావమును మఱచి ఐక్యతవైపునకు మరలుదురు. మానవానీక మొక కుటుంబబంధమునకు రాగలదు. కావున ఒక ఐక్యప్రపంచమును సృష్టించుటయే నీ జీవితలక్ష్యముగా ఏర్పఱచు కొనుము. భేదభావమును నిర్మూలించుటయే ప్రతివ్యక్తియొక్క విధియై యున్నది. ఇది ఎట్లు నిర్వర్తించుట ? ఆ భావము కలుగునట్టి శక్తిని ఇతరుల మనసులలో లేకుండ నిర్మూలించుటయే మార్గము. ఈ ఐక్య భావమును దృఢతమముగా ఊహించుటయే ఒక జ్యోతిగానై భేదాంధ కారమున భావించువారలకు వెలుగు నిచ్చుటచే ఇక నట్టి భావములను వారు భావింపలేకపోదురు. బహుమనస్సులపై పనిచేయు ఒక మనస్సు యొక్క శక్తి అమోఘమైనది. ఈ రీతిగా నూహించుపద్ధతి నభ్యసింతు వేని, అట్లే కొన్ని సంవత్సరము లూహించుచుపోదువేని, ఇతరుల మనస్సులపై అది యెట్టి పని చేయునో నీకే అర్థము కాగలదు. ఇది భౌతికముగా జరుగునది కాదు. నీవు నీ స్నేహితుని చెంతకేగి 'ఈ భేదభావము లూహింపరాదు, నీ విట్లు తలచుట మానవలెను' అని చెప్ప లేవు. అది చాలదు. ఆ రీతి చేయుదువేని వారి సానుభూతినిగాని, సాయ మునుగాని పొందలేవు. నీవు కేవలము భావన చేయుము. వారు వశు లయ్యెదరు. ఐక్యతయొక్క శక్తి అదియే. ఐక్యతయే సామరస్యము. నీలో ఉత్పన్నమగు భావమే ఇతరులలో కూడ ఉత్పన్న మగును. స్నేహమునకు సూత్ర మిది. నీకు స్నేహితు డెవరు ? నీ వూహించు న ట్లెవ్వ డూహించునో, నీవు చూచున ట్లెవ్వడు చూచునో, నీ హృద యము గాయపఱచు నే పనిని గాని ఎవ్వడు చేయగోరడో, నీతో ఎవ్వడు సమన్వయము పొందునో ఆతడే నీకు స్నేహితుడు. స్నేహములో నిగూఢమై యున్న అంశము ఈ సమన్వయము. సమన్వయ మనగా నేమి ? సామరస్యమే సమన్వయము. ఒకడు నీకు స్నేహితు డెందుకగు

చున్నా డనగా అతనిలో నీ భావములవంటి భావములను నీవు సృజించి యుంటివి. స్త్రీ యొక్కగాని, పురుషుని యొక్కగాని ఎవరి భావములు నీ భావములకు విరుద్ధములుగా నుండునో వారి సాంగత్యమున నీకు సంతోష ముండదు. వారి నుండి నీవు దూరముగా పరుగెత్తెదవు. రెండు జాతులకు సంబంధించిన వారిలో ఒకరి కొకరి సాంగత్యము అనిష్టముతో కూడిన దగుచున్నది. ఎందువలన ? ఒక్క రొక్కరు ఒక మాయామయ జాత్యహంకారావేశమునకు వశులై హృదయమున భేదభావమును నింపు కొనిరి. ఒకడు మఱియొకనితో ఇట్లనును, 'నీ జాతి మూఢమైనది. దానిని మేము ప్రేమించలేము' అని. మఱియొక డిట్లనును, 'మీ ముఖ్య పట్టణమును మేము నేలమట్టము చేయనున్నాము' అని. ఇట్టి భావములు అంటువ్యాధికంటె మిక్కిలి వేగముతో వ్యాపించి, అనతికాలమున ఖండ ఖండాంతరముల నల్లుకొని ఒక భీకర ప్రళయమును తెచ్చిపెట్టును. గత కాలమున చారిత్రకయుగారంభకాలములో ఒకానొక వ్యక్తి యొక్క అజ్ఞానముచే మౌఢ్యముచే ఈ భేదభావము ఉపస్థితిలోనికి వచ్చినది. ఆ ఒక్క మానవుని అవివేకమును సర్వప్రపంచము అంగీకరించి ఈ పాపిష్ఠ భావపుంజమును ఆరాధించుచున్నది. కాని ఆ మొదటిభావము, అనగా సమైక్యభావము నారాయణునిచే నరుని హృదయములో నాటబడిన భావ మేది కలదో అది విస్మృతి నందినది. గణిత మను శిలాద్వీపమునకు పారద్రోలబడినది. అయితే, ఆ సమైక్యభావమే మున్మొదటి దని మన మెట్లెఱుగుట ? మనము మన మనోలోకమునకు పోవుటయే తడవుగ మన మందఱము ఒకటే అను భావమును గుర్తింతుము. మానవుడు తుది మొదళ్ళ నూహింపవలసినది ఈ సమైక్యభావ మనియే ఈశ్వరుని సంక ల్పము. కావుననే మానవునికి ఒక్కటే ఆత్మ ఏర్పడినది. ఈ భావము మన కతిసమీపమునందే కలదు. దీనిని మన మే గ్రంథభాండాగారము లోనను అన్వేషింప బనిలేదు. మానవు దవివేకమున బడి ఆత్మను దర్శింప

నాను. వారిమాటలు జీవజగతితో ఏకత్వమును, ఈశ్వరునితో ఏకత్వమును చాటునవిగా తోచినవి. శైశవములోని వైభవ మిట్టిది. ఈ శైశవతత్త్వము వయోదూషితులను సముద్ధరింపగలదు. మానవానీకము ముందు నిలబడి మన జీవితలక్ష్యము సామరస్యము, సమైక్యము, ప్రేమ భావము అని చాటవలసి యున్నది. ప్రతి ప్రాతఃకాలమునను నిద్రనుండి లేవగనే ఈ మూడు మాటలను పెక్కుమారులు పునశ్చరణ చేయుము. ప్రతిసాయంకాలము నీవు నీ శయ్యపై మేను వాల్చి నిద్ర కొనగుటకు ముందు 'సామరస్యమును, సమైక్యమును, ప్రేమభావమును పాలించు భగవానుడు నన్నును, ఈ జగమును రక్షించునుగాక' అని ప్రార్థింపుము. ఆ ప్రార్థనను ఆయన వినును. తత్ఫలితముగ ఒక క్రొత్తతరమువారు ఉద్భవించెదరు. వారిలో ప్రేమ పొంగి, జగమునం దెల్లయెడల ప్రవహించును. అది దక్షిణధ్రువము నుండి ఉత్తరధ్రువము వరకును, ఉష్ణమండలములలో శీతలమండలములలోనను, అడవులలో పట్టణములలో నిండిపోవును. సమస్తమానవానీకముయొక్క దారిద్ర్యము దుఃఖము పరాభవము శాశ్వతముగ అంతము కాగలవు.

# ధ్యానము

గానరూపముగ నభివ్యక్తమైన ఈశ్వర ప్రేమయే మన జీవితము. మన జీవితమునకు మూల మిచట లేదు. అది స్వర్గమున నున్నది. అచట దివ్యత్వముయొక్క పూర్ణసమృద్ధి. అందు మన పుట్టుక. మనకు భౌతిక ముగా పార్థివముగా మాంసబద్ధముగా కన్పట్టు ఈ జీవితము నిజముగా దివ్యము. నేటి దనుక మతము తత్త్వము సాధించిన ఫలితములను బట్టి చూడగా మన జీవితములకు మూలము అపార్థివ మనుటచే అవి దోహదము లగుచున్నవి. విజ్ఞానశాస్త్రజ్ఞులు జీవము మన గోళమున నారంభము కా దందురు. తాత్త్వికులు దాని మూలము విశ్వహేతువున నున్న దందురు. వేదాంతు లది ఈశ్వరదత్త మందురు. స్వభావము ననుసరించి చూచుచో మనము ఇక్కడ ఈ భూమిపైన ఈ మన గృహమున మన మిత్రులతో అనేక భౌతికపదార్థముల నడుమ నివసించుచున్నా మనుకొందుము. జీవితమును గూర్చిన ఇట్టి దృష్టి ప్రమాదము. దాని కాధారము లేదు. వైజ్ఞానికవాదమును బట్టి గాని గురూపదేశవాక్యసరణిని బట్టి గాని అది నిరాధారము. గురూపదేశము జీవ మతిసూక్ష్మ మని, ప్రతిభౌతిక విషయమునకు దూరమైనదని, ప్రకృతిద్రవ్యము దాని మూలము కాజాలదని, భూమిపై నున్న దేనితోడను దానికి బాంధవ్యము లేదని, చెప్పును. ఇక వైజ్ఞానికశాస్త్రజ్ఞానము జీవ మొక వింతయైన శక్తియని, ఒక మూర్ఛ దర్శక సిద్ధాంత మని, ఆ సిద్ధాంతము స్వయంచేతన మని, మిగిలిన దంతయు పరప్రత్యయనేయ మనియు తెల్పును. ఈ ప్రకార మెటు చూచినను, ఇతరభౌతికపదార్థములగు రాయి, రాగి మొదలయిన వాని మూల స్థానమువంటిది కాదు, జీవముయొక్క మూలస్థానమని మనము గమ

నించుచున్నాము. ఈ భావోద్యమమునుండియే కళ మతము తత్త్వము ఉద్భవిల్లినవి. మానవుడు తాను స్వర్గమున ఉత్పత్తి గొంటి నని ఊహింప నారంభించినప్పుడు అతని మనస్సు అదివ్యములయిన పదార్థములచే ఇక ఏ మాత్రమును భ్రాంతము కానేరదు. తమోదూషితములయిన ద్రవ్యములలో అతడు ప్రవేశింప గోరడు. అప్పుడు సుకుమారము లయిన ఆత్మ ష్ఫంజాతము లయిన కవిత్వము తత్త్వము మతము కళ ఆవిర్భవించును. కళాకోవిదులు తత్త్వవేత్తలు కవీశ్వరులు తాము స్వర్గసంభవులమని తలచు ఎఱుగరు. కాని, ఈ విషయము యోగికి తెలియును కారణ మేమనగా, సామాన్యులయిన కళావిదుని యొక్కయు, తాత్త్వికుని యొక్కయు కవీశునియొక్కయు వివేకమునకును, యోగియొక్క వివేకమునకును. విస్తారమైన భేదము కలదు. ఎందుకనగా యోగి తన ఆత్మలో మస్తిష్కములో ఒక గొప్ప శక్తిని టెలెస్కోప్‌తో పోల్చదగిన దానిని పెంచుకొనియుండును. ఒక గొప్ప ప్రతిబింబదర్పణము వంటిదైన టెలెస్కోప్ నిగూఢము లయిన శని మొదలయిన గ్రహముల యొక్క ధర్మములను సామాన్యనేత్రముల కందని వానిని వ్యక్తముచేయునట్లు, యోగి ఒక సూక్ష్మదృష్టిని ఒక విచిత్రమైన ఆధ్యాత్మికనేత్రమును వృద్ధిచేయును. దానిచే అతడు స్పష్టముగా మానవుని తుదిమొదళ్ళను దర్శించును. ఆతడు ధ్యాననిమగ్నుడైన వేళ పూర్ణముగా అతనికి తన శరీరమును గూర్చిన, భౌతికప్రపంచమును గూర్చిన, జ్ఞానమే ఉండదు. ప్రాకృతికకర్మ శృంఖలములనుండి విడివడిన వా డగును. బంధముక్తమైన అతని ఆత్మ అస్పష్టముగా గాక సుస్పష్టముగా మానవసంబంధమునకు మించిన లోకములలోని విషయములను చూడగలదు. నక్షత్రపరీక్షాయంత్రశాలలోని జ్యోతిశ్శాస్త్రజ్ఞుడు పెద్ద టెలెస్కోప్ ద్వారమున పెక్కు మైళ్ళ దూరమున నున్న వానిని చూడ గలిగినట్లు, యోగి తన గుహలో కూర్చుండి, సామాన్యమానవుని మన స్సెన్నడును కలలో నైనను ఊ

సూక్ష్మములయిన సత్యములను తన ధ్యానధారచే గ్రహింపగలడు. ఆ యోగి చూచిన దేమి ? సుదూరమునుండి వినబడుచున్న ఒక నిరంతర ఘంటానాద మనెడి ప్రేమమయవిశ్వములో మానవాత్మ ఒక అంశము అని అతడు గ్రహించినాడు. మన శబ్దములు మన భావములు ఆ మూల ధ్వనికి ప్రతిధ్వనులు మాత్రమే. ప్రతిమానవుడు ఆ దివ్యమహాగానములో ఒక కళవంటి వాడు. కాన, ఎవరు తమ జీవితమును, దాని దివ్యత్వమును గ్రహించు ఉన్నతస్థాయిని అందుకొనగలరో వారు నిజముగ సుఖము నందగల రనునది సత్యము. అట్టి వారప్పుడప్పుడు ఈ పుడమిపై పుట్టు చునే యున్నారు. వారు జీవితమహారహస్యములను బయట పెట్టుచునే యున్నారు. వారు లేకున్న మన నాగరకత వృద్ధి నొందెడిది కాదు. జాతుల పురాతనచరిత్రములను పఠింపుడు. ప్రతిజాతిలో ఒక మహాను భావుడు జన్మించి మానవుని జీవితము మానవాతీత మనియు దివ్యమనియు బోధించిపోయినాడు. కాని ప్రజ లాతని నర్థము చేసికొనినట్లు లేదు. దిన మంతయు గొడ్డుగోదలతో, ఆలుబిడ్డలతో, బేరసారములతో, తల మునక లుగా తమ తలపుల నింపుకొనిన వారు ఈ నేలకు బంధింపబడి సత్య మును గ్రహింపలేక పోయిరి. ప్రతి స్వల్పమైన వ్యతిక్రమము వారి మన స్థ్సాయిని కలత నొందించినది. ఒక పుత్రు డుదయించినచో వారి మోద మునకు మేర లేకుండెను. ఎందుకనగా పైనున్న ద్వారములోగుండ విశ్వసంభూతిలోనికి వారి దృష్టి ఎన్నడును ప్రసరించి యుండలేదు. అది యెల్లప్పుడును క్రింది గవాక్షముగుండ అధస్తమస్సులోనికే చూచెను. సామాన్యమానవునికి యోగికిని ఇదే భేదము. సామాన్యమానవు డెప్పు డును ఐహికదుఃఖాంధకారమునే చూచుచున్నాడు. కాని యోగి స్వర్గ సౌందర్యదీధితిని తిలకించుచున్నాడు. అతని శరీరము ఈ పృథివిపై నుండగా ఆ సౌందర్యము నతడెట్లు చూడగలడని నీ వడుగవచ్చును. దీనికి సమాధానము సులభము. ఒక జ్యోతిశ్శాస్త్రజ్ఞుని చూడుము. అతని

పాదములు ఈ నేల కంటుకొనియే యుండగా అతడు పెక్కు మైళ్ళ దూరమందున్న తారకలను చూచుచున్నాడు. అట్లే యోగిశరీరము ఇచటనే యున్నను, అతని ఆత్మకు స్వేచ్ఛ కలదు. దానిచే అది ఆవలి మహాసౌందర్యమును అవలోకింపగలదు. ఎవ్వ డాత్మను దర్శించునో, ఎవడు జీవముయొక్క నిజస్వరూపమును ఆలోకించునో, అతడు తన విధిని అవగత మొనర్చుకొనగలడు. మనలోని ఆత్మ ఎల్లప్పుడును అత్యుత్తమము అత్యున్నతము అత్యంతసుందరము ఆయిన లక్ష్యమువైపునకే మనకు త్రోవ జూపుచున్నది. అనేకులచే దైవసమానముగ ఆరాధింపబడుచున్న హేతువాద మనునది ఏది కలదో అది మనకు భౌతిక పదార్థములతో గల అనుభవమునుండి పుట్టినది. అది నిజముగా ఆత్మయొక్క ఒక శక్తిలేశము. మహానుభూతి కాదు. పరిమిత మైనది. సామాన్యజ్ఞాన మని దేని ననుచున్నామో అది ఇంకను పరిమిత మైనది. కాని ఆత్మ కొక మహాశక్తి కలదు. దానితో మన మీ విశ్వములో నున్న ఉత్తమోత్తమవిషయములను విలోకింపగలము. యోగాభ్యాసముయొక్క ధ్యేయ మే మనగా ఆ మహాశక్తిని పెంపొందించుట. దానితో మనము ప్రకృతిలోని ఉన్నతశక్తులను గాంచగలము. జీవితముయొక్క మూలమును విధిని తెలిసికొనగలము. అంతర్వాణిని వినగలవాడు సుఖజీవి. అంతర్వాణి ఎల్లప్పుడును మనకును మానవానీకమునకును ఏది క్షేమంకర మైనదో దానిని రహస్యముగా వినిపించును. సమరసభావమున సముద్భవించునట్టి ఆ వాణి ఎల్లప్పుడును సామరస్యమునే తప్ప సంఘర్షణమును గూర్చి పలుకదు. కావున నిరంతరమైన అ య్యంతర్వాణిని అనుసరించిననే మానవునికి సౌఖ్యము కలదు. విచారించినచో సమస్తతత్త్వము కవిత్వము అంతరాత్మయొక్క నినాదమే. అంతరాత్మ రెండు విధములుగా నినదించును— ప్రత్యక్షముగా, పరోక్షముగా. నీ యంతట నీవే వినినప్పుడు అది ప్రత్యక్షముగా పలుకుచున్న దని అర్థము. నీ వొక

దుర్మార్గమును లేక పాపకార్యమును చేయగోరుదువు. వెంటనే నీ ఆత్మ నిన్నా పనిని వలదని చెప్పుచున్నట్లు అనుభూతిని పొందెదవు. సంశయము లేక స్పష్టముగా నిన్నాపనిని చేయవలదని చెప్పుచున్నట్లు విందువు. ఇది ఆత్మయొక్క ప్రత్యక్షవాణి. ఇక అప్రత్యక్షముగా పలుకుట ఎట్లనగా — నీ వొక తప్పు పనిని చేయ గోరుదువు. అప్పుడు మఱి యొకరు వచ్చి ఆ పనిని చేయవల దందురు. లేక భౌతికానుభవ మేదో యేర్పడి నిన్ను నిరుత్సాహపఱచును. మొదట నీవు చేయ నూహించుచున్నది తప్పుపని అను విశ్వాస మేర్పడును. అయినను నీవు చేయ గోరుదువు. అప్పుడు స్నేహితు డొకడు వలదని చెప్పుటయో ఏదో విఘ్నము వచ్చుటయో సంభవించును. మఱి కొన్ని వేళల ఈ పరోక్ష వాణి పశుపక్షులనుండియో గిరితరునదీఝురులనుండియో వినిపించును. సహజముగా కొన్ని సంఘటన లేర్పడి మానవులను పాపకార్యములనుండి మరలించిన కథల నెన్నిటినో మనము విందుము. కాని, సహేతుకముగా వీనిని సమన్వయించుట ఎట్లో మానవు లెఱుగరు. ఉత్తమహేతువిధానమున దాని నన్వయించుట ఎట్లనగా — పాపకార్యమునుండి నిన్ను వారించుటకు అంతర్వాణి ఆ ఘటనల ద్వారమున ధ్వనించుచున్నది అని. అంతరాత్మ మనతో ప్రత్యక్షముగా గాని ఇతరుల మూలమున గాని కాక మఱియొక తీరునగూడ పలుకును. అది స్వప్నములయందు. కొన్ని వేళలయందు మనము స్వప్నమున ఏదో వింతయైన దానిని వినుటయో చూచుటయో అనుభవించుటయో కలుగును. మన ప్రకృతి ఉన్నతస్థాయికి పోవుచున్న కొలది మన స్వప్నములు స్పష్టములును భవిష్యత్సూచకములును కాగలవు. దుష్టముగా జీవించుట దుష్టముగా భుజించుట దుష్టముగా శ్వాసించుట దుష్టముగా శయనించుట దుష్టకార్యము లాచరించుట — వీనికి ఫలితములుగ పెక్కురకు స్వప్నములు వచ్చును. ఆప్తసఖుని ఉపదేశము వంటి స్వప్నోపదేశమునకు కొందఱు నోచుకొని యుండరు. కాని శుద్ధా

త్మలైన యోగులు సమ్యగ్జీవితముల నెరపుదురు గాన వారి స్వప్నములు సత్యవిషయములనే వినిపించును. అందుచే మనము సరిగా ఇట్లు తీర్మానింపవచ్చును — 'స్వప్నము మానవుని మిత్రము. అది ఆత్మయొక్క అంతర్వాణి' అని. మనలను ఈ భూమిపై ఎన్నడును విడనాడని మిత్రులు ముగ్గు రున్నారని తేలినది. ఒకటి ఆత్మయొక్క ప్రత్యక్షవాణి, రెండు ఆత్మయొక్క పరోక్షవాణి, మూడు స్వప్నముయొక్క ఆవిర్భూతి. ఎవడు ఈ మిత్రత్రయము యొక్క ఉపదేశములను పరిశీలించుకొని తన సంకల్పములను కర్మలను నిరంతరము సరిదిద్దుకొని వర్తించునో అతడు తనకు తన మిత్రబృందమునకు ఈ సమస్తవిశాలప్రపంచమునకు లాభమును సుఖమును కూర్చు జీవితమును గడపగలడని నేను నొక్కి చెప్పగలను. గ్రంథములుకూడ మనకాప్తమిత్రములే. అవి మనవెంట ఎల్లకాల ముండవు. కాని విశ్వసనీయమైన ఈ మిత్రత్రయము దినములో ఇరువదినాల్గుగు గంటలు మనతో నుండును. వీని బోధలనుండి మనము సర్వజ్ఞానమును పొందవచ్చును. పురాతనకాలమున పెక్కు గ్రంథాలయములు గాని విశ్వవిద్యాలయములు గాని ఉపన్యాసవేదికలు గాని లేనప్పుడు మహర్షులు పరమహంసలు నివసించెడివారు. వారు ఒంటరిగా దూరమున నున్న కొండలలో అడవులలో ఎడారులలో సముద్రతీరములలో నివసించెడివారు వా రీ లోకమున పెక్కు వింతలు చూచిరి. నక్షత్రగోళములు పరిశీలించిరి., మృత్యువున కావలనున్న లోకమును గమనించిరి. పురాతనకాల మందలి ఆ మహామహుల ఉజ్జ్వలజ్ఞానమును గూర్చిన గ్రంథములు పెక్కు లున్నవి. ఆ విషయములు వారి కెట్లు వినిపించినవి? వింత గొల్పు ఆ విజ్ఞానము వారి కె ట్లబ్బినది? అది వారి కీ మిత్రత్రయము నుండి లభ్యమైనది. ఆ మిత్రత్రయోపదేశమునుండి లాభమును పొందవలయు నన్న మనము సరియైన జీవితపథమున ప్రవర్తింపవలయును. సరియైన జీవితపథ మనగా నేమి? ఈ కాలమున సరియైన జీవితపథ

మునుగూర్చి చెప్పుట కడు కష్టము. ఎందు కనగా మానవు లందఱు దుష్టజీవితములనే గడుపుచున్నారు. కారణ మేమనగా, వారు చదువు చున్న గ్రంథములు నవలలు ప్రేమకలాపములు దుష్టగ్రంథములు. వానిని దుష్టులు వ్రాసిరి. అవి దుష్టవిషయములనే బోధించును. అందుచే మానవుల మనస్సులు దుష్టజీవితాదర్శములతోడను దుష్టజీవితప్రయుక్తుల తోడను నిండినవి. అందుచే జీవితముయొక్క సమ్యగాదర్శముల్లను సమ్యక్ప్రయుక్తులను గూర్చి వారి యెదుట పలుకుట బహుకష్టము. ఆధునికపాఠశాలలయందు పిల్లల విద్యావిధానము ఒక దుష్టసిద్ధాంతము పై నెలకొల్పబడినది. శైశవము మొదలుకొని వారి తలలో దుష్టాదర్శములే పెరుగుచున్నవి. సమ్యగ్జీవితవిధానమును గూర్చి ఈ పిల్లలముందు భాషించినచో వారు హర్షింపరు. నిన్నొక పిచ్చివా డందురు. తల్లి ఒడిలో వా రేమి నేర్చుకొనిరో దానినే ఆచరణలో పెట్టుటకు వారు జీవితముల గడపుచున్నారు. ఇప్పుడు సమ్యగ్భావనను గూర్చి బోధించుట లాభము లేని పని. మఱియొక కష్ట మేమనగా అనేకులు దుష్టజీవితములు గడిపి లాభించి యున్నారు. వారి కేది బోధించుటయు దుర్లభము. ఒక డి ట్లనును —' నే నొక బహుదుష్టజీవితమునే గడిపితిని. కాన లక్షాధి కారి నైతిని ' అని. ఇంకొక డి ట్లనును—' సగము ప్రపంచమును నేను మోసగించితిని. అయినను కోట్లు సంపాదించితిని ' అని. ఇట్టి వారు తమ జీవితవిధానములను మార్చుకొన గోరరు. దుష్టజీవనమున లభించిన విజయము నేటి ప్రపంచమునకు బహుప్రమాదకర మయినది.

ఒక నూతనప్రపంచనిర్మాణమును మన మారంభింప దలచినప్పుడు నూతనాదర్శములతో మొదలుపెట్టవలయును. ఆధ్యాత్మికనాగరకత యొక్క ఫలితములను మన మనుభవింప దలచినప్పుడు మన మీ దినము ననే నిజమైన ఆధ్యాత్మికజీవితమును గడపుట కారంభింపవలెను. అది మనకు భౌతికనాగరకశక్తులకు మధ్య జరుగు పోరాటములోని కీడ్పును.

దౌర్భాగ్యవశమున ఈ శక్తులు ఆదికాలమునుండీ పనిచేయుచునే యున్నవి. పురాతనగ్రంథములలో వెలుతురునకు చీకటికి మధ్య, దివ్యాదివ్యముల మధ్య, మంచికి చెడుగునకు మధ్య, పోరాటము జరుగుచుండినట్లు చూతుము. ఈ నాటికిని అది సర్వప్రపంచమున సాగుచునే యున్నది. అయినను మనము నిరుత్సాహపడరాదు. నూతనారంభమునకు గడంగ వలయును. భవిష్యత్తులో దృష్టి నిలిపి సమ్యగ్జీవనము, సమ్యగ్భావనము, సమ్యగ్యత్నము చేయుటచే ప్రపంచమును మార్చగల మనియు, దానిని సజ్జనులకు వాసయోగ్యమయిన దానినిగా జేయగల మనియు ఆశింపవల యును. ఈ క్లిష్టకార్యము నెట్లారంభించుట ? భావనముతో ధ్యానముతో సాగవలెను. ధ్యానధారణసమాధు లనునవి మూడు దేవతలు. అవి మన జన్మచక్రమున గల గ్రహముల నడపును. యోగియొక్క నిరంతర మంత్రము లీ మూడు— సమ్యగ్ధ్యానము, సమ్యగ్ధారణ, సమ్యక్సమాధి.

సరిగా ఆలోచించుట కొలది మందికే తెలియును. ఇంచుమించు అందఱును సరిగా ధ్యానముచేయుట నెఱుగరు. అందఱి అభీష్టములు దుష్టములే. సమ్యగ్భావన, సమ్యగ్ధ్యానము, సమ్యగభీష్టము అనగా నేమి ? సమ్యగ్భావన అనగా ఈశ్వరు డేది చెప్పునో అది మంచిది అనుకొనుట. సమ్యగ్ధ్యాన మనగా ఏది ఈశ్వరుని సంతోషపెట్టునో అట్టి దానినే క్రమ ముగా చింతించుట. సమ్యగభీష్ట మనగా మోక్షమునకు సాక్షాన్మాతృ దేవతయే. ఎవని ధ్యానధారణసమాధులు సమ్యగ్విధానమున నడచునో అతని శరీరములో మార్పు వచ్చును. అతని శరీరములోని దుష్టశక్తు లన్నియు సమ్యక్శక్తులుగా మారును. అతని శరీర మతని ఆత్మకు సద్గుణ సంపన్నయైన సహధర్మిణిగా నగును. ఈ సంయోగమువలన కలుగు సంతానము ఈ ప్రపంచమందలి తమోవిషయములను దుష్టభావములను సంస్కరించును. కాబట్టి సమ్యగ్భావన దౌష్ట్యముల నన్నింటిని కాల్చి వేయునట్టి మహాగ్ని. సమ్యగ్భావములను భావించుట ఎట్లు అని నీ వడుగ

వచ్చును. నిజముగా నమ్మకముగా నీవు మంచి భావములు కావలయుననీ కోరుదువేని వానిని భావించుట నీకే తెలియును. సర్వజ్ఞానము నీ హృదయాంతరాళమునుండి నీకు చేకూరును. అప్పుడు ఫలిత మెట్లుండునో ఆలోచింపుము. ఒక్కడు ఏకాంతముగా కూర్చుండి సమ్యగ్భావములు భావించుచున్నచో ప్రపంచమున వేర్వేరు చోటుల నున్న వేలకొలది జనులు ఆ అనుభూతిని పొందెదరు. ఆ సమ్యగ్భావనయొక్క ప్రాణప్రదమైన స్పందనము వారి అనుభూతికి వచ్చును. అనుకొనకయే వారికి తెలియకయే వారి భావములు మార్పు నొందును. కాలానుసారముగ వారు సమ్యగ్ధ్యానము చేతురు. పిమ్మట సమ్యగభీష్టమును పొంద నేర్తురు. ఒకడు మహాధనికు డైనాడు, మఱియొకడు సేనాధిపతి యైనాడు. వారిలో ఒకనియందు లోభభావము, మఱి యొకనియందు హింసాభావము విపరీతముగా పెరిగినదని అర్థము. వాని ఫలితములుగ వా ర ట్లయిరి. వారిలోని దుర్భావన అట్టి భౌతికపరిస్థితులు కల్పించినది. ఒకని ధనికుని జేసి కొందఱి ప్రాణములను బోగొట్టినది. వ్యతిరేకముగ భావించుటను అభ్యసించినచో వ్యతిరేకమార్గమున ప్రసిద్ధి నొందును. ఒకడు లోభభావమును హింసాభావమును పరిత్యజించి దానము చేయుటను క్షమించుటను అభ్యసించినచో అతడు ప్రపంచమందలి సత్పురుషులకు నాయకుడగును. ఉన్నతజీవితమునకు ప్రథమసోపానము లోభక్రోధముల త్యాగము. లోభక్రోధములను పరిత్యజించినంతనే నీవు తద్వ్యతిరిక్త గుణము లయిన దయను క్షమను వృద్ధిచేసికొందువు. నిజముగా ఈ దయాక్షమలు కలిగియుండుటకంటె బాగుపడుటకు మఱియొక మంచి త్రోవ లేదు. ఎవడు దయావంతుడు క్షమావంతు డయ్యెనో అతడు సమ్యగ్భావమార్గమున బహుదూరము నడచిన వాడని అర్థము.

సరిగా ధ్యానించుట ఎట్లు అను దానిని గూర్చి విచారింతము. అనేకులు ప్రాపంచికసంపదకై మాత్రమే ధ్యానము చేయుదురు. నీ కొక

మనఃపరిశీలనయంత్ర ముండీ, దానిని నీవు ధ్యానమందిరములకు గొని పోయి, ధ్యానమునకు జేరు జనసమూహమున నుందువేని, ఒకడు తన ఆవునకు కోడెదూడ పుట్టవలయు ననియు, ఒకడు ధనము కావలె ననియు, ఒకడు వ్యాజ్యమున గెలుపు కావలె ననియు, ఒకతె తన భర్త మరణించి నూతనప్రియునితో వివాహము సమకూడవలె ననియు, ఇట్లు పెక్కు తలపులు నీకు వినిపించును. కాని యోగమార్గమున ఇతరుల తలపులను విను విధాన మున్నది. సామాన్యమానవుని ధ్యానము పశువులకొఱకో, ధనముకొఱకో, శత్రుసంహారముకొఱకో అని యోగి ఎఱుగును. ఉత్తమమయిన జీవితమును గడపువా డెవ్వడును ఇట్టి వాంఛలను కోరడు. భౌతికజీవితమునకు కావలసిన ఈ ప్రాకృతికపదార్థము లతనికి చిక్కియే ఉన్నవి. కాబట్టి అతడు జ్ఞానముకొఱకు సర్వప్రపంచమును ప్రేమించగల దయార్ద్రహృదయముకొఱకు ధ్యానము చేయును. ఇది సమ్యగ్ధ్యానము. ఎవడు సమ్యగ్ధ్యానమును చేయ నెఱుగునో అత డడుగకయే అతని చుట్టు నున్న భూతప్రకృతి అత డనుకొని నట్లుగా మారును. వింతగా అతని కట్టి యాజమాన్య మబ్బును. చుట్టు నున్న వాతావరణము స్థితిగతులు అతని కనుకూలముగా వర్తించును. ఇంతట నతడు క్రమముగా ఉన్నతవిజయములు సాధించును. తా నింత కాలము తపించిన శాంతి నందుకొనును. ఈ రహస్యము నెఱిగినవా డగుటచే అత డడుగవలసిన పని లేదు. అవసరభౌతికపదార్థములు ఉపలబ్ధము లయియే యున్నవి. అత డందుచే మౌనము వహించును. అర్థముల నర్థింపడు.

సమ్యగభీష్టము అనగా నేమో చూతము. ఈ మార్గమున సమ్యగభీష్ట మింకను కొంత దూరమున నుండునది. వెనుకటి రెంటికంటెను ఇది కొంచెము కష్టమయినది. ప్రపంచమోక్షమునకై యత్నించుచున్న వారలకు తప్ప అన్యుల కిది లభ్యము కాదు. సమ్యగభీష్ట మనునది ఒక

అద్భుతమైన శక్తి. స్థూలపదార్థమును సూక్ష్మమును చేసి, సూక్ష్మమును ఆత్మలో విలీనముచేయుట దీని పని. ఎవ్వడు సరియైన కోటికను కోరుట నెఱుంగునో ఆ కోటికతో కోట్ల మానవులను రక్షించును. అతడు తనలో అంతటి శక్తిని కూర్చుకొనును. ఇతరులలోని దుష్టప్రకృతిని అతడు సత్ప్రకృతిగా మార్చగలడు. అప్పు డది సద్బోధలను స్వీకరించు టకు యోగ్యమైన దగును. అట్టి దాని నతడు మోక్షమునకు తీసికొని పోవును. ఆధ్యాత్మికముగా చెప్పుచో సమ్యగభీష్టమును సాధించినవాడు మానవశ్రేష్ఠుడు. యోగియొక్క జీవితము సమ్యగభీష్టముతో నిండినది. అతడు ఇతరుల హృదయములలో ఆత్మలలో మోక్షేచ్ఛను జిజ్ఞాసను సృజించును. ఈ సర్వప్రపంచమున ఆఱు చోట్ల నాలుగురు అద్భుతమైన ఈ సమ్యగభీష్టశక్తిని పెంపొందించువా రుందురేని ఈ సమస్తప్రపంచ మును స్వర్గసీమనుగా మార్చవచ్చును. సమ్యగభీష్ట మనునది సూర్యుని వంటిది. చీకటి సూర్యు నెట్లు జయింప నేరదో అట్లే దౌష్ట్యము పాపము మొదలైనవి సమ్యగభీష్టముకల వానిని ఓడింపలేవు. సమ్యగభీష్టమును సాధించినవాడు త్రిలోకాధిపతియై కూర్చుండును. అనేకులు మానవులు అధమాభీష్టులు లేక అల్పాభీష్టులు. వారు అల్పమైన వానిని కోరుదురు. హీనమైన పదార్థములతో వారు తృప్తిపడుదురు. పిపీలికము సుశీరము మూషికము మకరము— ఇట్టివాని కోటికల వంటివి వారి కోటికలు. ఉన్నతుడు ఉన్నతమైన కోటికలనే కోరవలెను. లేకున్న ఉన్నతాంశ ములను అత డూహింపలేడు. ఉన్నతకార్యములు నిర్వహింపలేడు. కార్యాచరణము అభీష్టమునకు తరువాత నయ్యేడిది మాత్రమే అని మనకు తార్కికముగా కన్పట్టును. అభీష్టమనగా ఊరక సోమరితనముతో కోరెడి కోటిక కాక దీక్షాపూర్వకమయిన నిశ్చయబుద్ధితో కోరు తీవ్రమయిన కోటిక. అట్టి దానికి తగిన జీవితమును జీవింపవలయును. ప్రతివాడును ఒక మంచి క్రియావిశేషణముతో కూడిన క్రియామూర్తిగా నుండవల

యును. సమ్యగ్భావనము సమ్యగ్ధ్యానము దీర్ఘకాల మభ్యసించిన పిమ్మట సమ్యగభీష్టమును వర్ధిల్లజేయుట శ్రేయస్కరము, పంద్రెండు సంవత్సరములు సమ్యగ్భావనము, పంద్రెండు సంవత్సరములు సమ్యగ్ధ్యానము జరిగిన పిమ్మటనే అభీష్టమునకు దిగవలెను. ఇట్లు సరియైన పునాది లేని యెడల అభీష్టము వ్యర్థ మగుటయే కాక దుఃఖప్రద మగును. కావున సమ్యగ్భావనము సమ్యగ్ధ్యానము ఉపదేశపూర్వకముగా శాస్త్రపూర్వకముగా జరుగుట అత్యంతావశ్యకము. మొదట చెప్పినట్లుగా ఆత్మ ఒక దివ్యగానము. ఎవ్వడు సమ్యగ్భావన మొనర్చి సమ్యగ్ధ్యానము చేసి సమ్యగభీష్టమును కోరునో అతనికే ఆత్మ దృష్టము శ్రుతము విజ్ఞాతము కాగలదు. ఆత్మగానామృతము నాస్వాదించుటయే, సర్వమును ఆ గాన తరంగసందోహమున నిమగ్నము చేయుటయే, మానవజీవితము యొక్క పరమావధి.

# స్మృతి

వెలుగు పైనుండి ప్రసరించుచున్నది. గాలి పైనుండి వీచుచున్నది. మన వ్యష్టిజీవితము గతమునుండి మన వైపునకు ప్రవహించుచున్నది, ఒక వ్యక్తి తన నడతకు చాలవరకు త్రోవ జూపు ఇతరవ్యక్తులచే వస్తువులచే చుట్టబడినవాడై వర్తమానమున జీవితమును గడపును. ప్రపంచమునందలి ప్రతివస్తువు మనలను మనలోనుండి బయటికి పారద్రోలుచున్నది. ఆ త్రోపిడికి మనకు కాలానుట లేదు. సుడిగుండమున బడుచున్నాము. ఇట్టి స్థితి మన నడతను దిద్దుచున్నది. మన పరిసరము, మన వర్తమానము, మన సమకాలీనులు. వర్తమాన మొక్కటియే మన జీవితమున ప్రధానము కాదు. మన వర్తమాన జీవితము గతమను మహాసముద్రమున కడపటి అల. నీకుముందు నీ తల్లిదండ్రులు జీవించిరి. వారికి ముందు వారి తల్లిదండ్రులు జీవించిరి. ఇట్లు వెనుకకు పోనుపోను పూర్వపూర్వ లోక గొలుసు వలె కన్పట్టుదురు. వర్తమానమున నున్న మానవుడు ఒక ప్రత్యేకవ్యక్తియా లేక గతమనెడి ఒక మొత్తముయొక్క ఫలరూపుడా ? లేక ఈ వర్తమానమానవుడు కోటానకోట్ల పూర్వులయొక్క ప్రతిరూపుడా ? నిజము విచారించినచో మానవుడు కేవలము ఈ మనశ్శరీరములతో కన్పట్టు మానవుడు కాడు. అస్పష్టముగా కన్పట్టు పూర్వయుగములలో పాదుగొన్న మహావృక్షముయొక్క పుష్పమతడు. వృక్షప్రపంచముయొక్క స్థితి కూడ ఇంతే. వృక్షకాండము కొమ్మ లగును. కొమ్మలు రెమ్మ లగును, రెమ్మ లాకు లగును. ఆకులు పూలగును, పూలు పండ్లగును. కావున ప్రతిఫలములో మొత్తము వృక్షముయొక్క పూర్వచరిత్ర ప్రస్థితమై యున్నది. ప్రతి

ఫలము వృక్షముయొక్క పక్షి ప్తరూపము. అందుచే ఫలములోని బీజము సర్వవిధముల పూర్ణమైన వృక్షమును ఉత్పాదనము చేయగలదు. దానిమ్మ గింజ దానిమ్మ చెట్టును పుట్టింపగలదు. అట్లే మానవుడు. వర్తమాన మానవుడు గతమందలి కోట్లకొలది యాత్రికులు వచ్చి విడిసియున్న చర మవిశ్రాంతిమందిర రూపుడు. నీ శరీరములో గతించిన నీ తల్లిదండ్రు లనే కాదు. మొదటినుండి వచ్చిన ఆంధ్రజాతిని గాంచుచున్నాను. అంతే కాదు, భారతీయజాతిని మొత్తమును, కాదు మొత్తము మానవజాతిని కాంచుచున్నాను. అందుచే నీ పీ వర్తమానమునకు చెందిన ఒక యువకుడ నని, ఒకవ్యక్తినని తలచుచున్నను, ఆ వ్యక్తిలో ఆ రూపములో మొత్తము మానవజాతియొక్క జీవితము చరిత్ర పరిణతి ప్రస్థితములై యున్నవి. ఈ మహాకాల మంతయు ఒత్తబడి కుంచింపబడి ఒకటిగా చేయబడిన ట్లున్నది. నీ వాంఛలను గూర్చి నీ ఆవేశములను గూర్చి నీ భావాభ్యాస ములను గూర్చి వివరింపవలయు నన్న మొత్తము మానవజాతినిగూర్చి అర్థము కావలయును. నీ పూర్వుల హృదయములలో నాట్యము చేసిన శక్తులనుండియు, నీ పూర్వీకుల ఆత్మలలో తల లెత్తిన స్వప్న ములనుండియు నీవు తప్పుకొనలేవు. అందుచే మంచివో చెడ్డవో ఇప్పు డున్న భావకర్మలతోడి మానవుడు జాగ్రదవస్థలో స్వప్నావస్థలో వెనుకకు వెనుకకు తన మూలస్థానమునకు ఎదురీత నీదుచు పోవుచున్నాడు. మానవజాతిలో వృద్ధినొంది నీలో ప్రతిబింబించుచున్న సహజగుణములు నీయందు దాగుటలేదు. పూర్వులనుండి ప్రవహించుచున్న ఈ ప్రవాహము నీలోగుండ ముందుకు సాగిపోవుచున్నది. ఈ ప్రవాహము నీ నుండి భవిష్యదగాధములోనికి ముందునకును మూలస్థానమునకు వెనుకకును రెండు తీరుల ప్రవహించును. ద్వివిధమైన ఈ ప్రవాహమునే సంసార మందురు. ఈ జీవిత ప్రవాహములో ఉద్రేకపూరితములు ఆకర్షణీయములు అయిన భాగము లనేకము లున్నవి. దీనిలోని అత్యంతాకర్షణీయమైన

భాగము ఇందనుక చెప్పినది కాక వేఱుగా నున్నది. ఈ జీవితప్రవాహ
ములో మిక్కిలి గమనార్హమైన విషయ మేమనగా— వారే మానవులు
భవిష్యత్తులో వచ్చుట, వారే వ్యక్తులు అదే స్మృతితో తిరిగితిరిగి ఆరు
చెంచుట. పూర్వుల శ్రమఫలితముగ వృద్ధినొందిన ఈ శరీరము.
పూర్వుల భావనాఫలితముగ వృద్ధినొందిన ఈ మేధస్సు ఎట్లు మూలస్థాన
మును చేరునో అట్లే ఈ చైతన్యము చైతన్యాంశమైన స్మృతి ఒక
నూతనమార్గమున వెనుకకు మూలస్థానమును చేరును. వ్యష్టిమానవు
డనగా మాటలాడుచున్న చేతనామయస్మృతిరూపుడు. దేని స్మృతి ?
జ్ఞానకర్మలయొక్క. నీ జ్ఞానముయొక్క స్మృతి నీ కర్మయొక్క స్మృతి
నీ కున్నది. నీ వొక నావికుడవో ఒక వైమానికుడవో ఒక కృషీవలు
డవో అయి యుండెడివాడవు. కాని వీనిలో ఇప్పు డెవ్వడవు నీ వు
కాకున్నావు. ఒక విమానమును నడుపు మనిన నాచేత కా దందువు. ఒక
నావను నడుపు మనిన నాకు తెలియదు, చుక్కాని పట్టుటయే యెఱుగ
నందువు. నే నిదివర కా పని చేయలే దందువు. అనగా అర్థ మేమి ?
ఆ జ్ఞానముయొక్క స్మృతి నీకు లేదు. నీ వ్యష్టిరూపములో కొంత
జ్ఞానము కొంత కర్మ లేకున్నది. నావను నడపుట విమానమును నడపుట
కృషి చేయుట ఈ మూడు విధములయిన జ్ఞానము నీ వ్యక్తిత్వములో
లోపించి యున్నది. కాని మఱి యొక్క జ్ఞానము నీలో నున్నది. పాఠ
శాలలో భూగోళము గణితము భాషలు సభ్యత ప్రవర్తన ఇవి కాక
జీవితము సంఘము ప్రకృతి వీనికి సంబంధించిన కొన్ని ధర్మములు వీని
జ్ఞానము నీవు సేకరించితివి. ' నేను చదివితిని, నే నూహించితిని, నేను
వ్రాసితిని, నేను వింటిని ' అని నీవు చెప్పగలవు. కాబట్టి నీ వ్యక్తిత్వ
ములో ఒక విశిష్టమైన జ్ఞానము, ఒక విశిష్టమైన కర్మ నీకు సుపరిచిత
మైనవి ప్రస్థితములై యున్నవి. అందుచే నీ వొక చేతనామయస్మృతి
గూపుడ వందును. అనగా కొన్ని స్మృతులు చేతనామయములు నీలో

నున్న వని యర్థము. స్మృతి అని ఎందుల కనుచున్నాను? స్మృతి గతమునకు సంబంధించినది. గతమును గుర్తునకు తెచ్చుకొనుట స్మృతి. ఈ ఉపదేశములను వినుట అర్థముచేసికొనుట— ఇట్లు జీవితము నర్థము చేసికొనుట— ఇదంతయు గతముయొక్క స్మృతి. ఎందుకనగా, దేనిని మనము వర్తమానమున సులభముగా భావింపగలమో ఆచరింపగలమో అది యంతయు పూర్వమున భావించినట్లు చేసినట్లు స్మృతికి వచ్చునని అర్థము. వీణను బహుసంవత్సరములు ప్రయోగింప నేర్చినవాడు సహజముగా దానిని ప్రయోగింప గోరును. అందలి గానమాధురిని ఆస్వాదించును. కాని అదే వీణను, జీవిత మంతయు గొడ్ల కోసి జీవించిన కసాయివాని చేతిలో నుంచుము. అతడు దానిని ప్రయోగించి గానమును సృజించలేడు. ఎందుకనగా ఆ వాద్యమును ప్రయోగించు జ్ఞానకర్మలు రెండును అతనిలో లోపించినవి. కాబట్టి ఆ స్మృతి అతనిలో లుప్తమైనది. అందుచే ప్రతి వ్యక్తియు స్మృతిలో నున్న జ్ఞానకర్మల యొక్క చేతనారూపుడు. ప్రతి వ్యక్తికి అతని విశిష్టస్మృతి కలదు. నీ సోదరునకు ఒక శిల్పజ్ఞానమున్నది. కావున అతడు కృషీవలుడు కాలేడు. అతని జ్ఞానకర్మ లతనిని ఆ దిక్కునకు నడపించినవి. నీవి నిన్ని దిక్కునకు నడపించినవి. మీ యిరువురియందును పనిచేయుచున్నది ఆ చేతనామయస్మృతి. మన మిప్పు డొక మిక్కిలి ఆకర్షణీయమైన అంశమును గమనింపవలసి యున్నది. మానవజాతియును మన పూర్వులును మన శారీరకజీవితమును మెలచుచు ప్రభావితము చేయుచు ఉన్నను, మఱియొక సూత్రము చేతనామయ స్మృతి అనెడి సూత్రము వ్యక్తియొక్క మనశ్శరీరముల కర్మలకు ప్రోద్బలక మగుచున్నది. ప్రతివ్యక్తియందును అది వేఱుగా నుండును. ప్రతివ్యక్తియందు వేఱైన చేతనామయస్మృతి పనిచేయుచు ఆ వ్యక్తిత్వమును పోషించి ఒక ప్రత్యేకగమ్యస్థానమునకు నడిపించును. ఒకని చేతనామయస్మృతి అతని నొక న్యాయవాదిగా, ఇంకొకనిని నటునిగా, మఱి

యొకనిని మల్లునిగా, ఒకనిని శాస్త్రజ్ఞునిగా, వేఱొకనిని చర్మకారునిగా, చేయును. కాన, మానవుడు అనగా యథార్థముగా చూచినచో స్మృతి రూపుడు. ఒక దేది యగుచున్నాడో ఆ వైపునకు అతని స్మృతి భావ కర్మల నిచ్చి అతనిని నడిపించుచున్న దని అర్థము. వారి వారి దృష్టులను తీర్చి దిద్దుటకు మానవులను ఈ స్మృతియే నడిపించుచున్నదా ? మానసిక శక్తియైన ఈ స్మృతి మనోదూరము లయిన శారీరకభౌతికపదార్థములను తీర్చి దిద్దగలదా ? వీనికి సమాధానము లేమి ? అని నీవు ప్రశ్నింపవచ్చును. వినుము. మనోదూరములుగా గన్పట్టున వన్నియు మనస్సుయొక్క బాహిరరూపములు. మనలో నున్న స్మృతి మనస్సుయొక్క శుద్ధరూపము. మన శరీరము భౌతికజగత్తు మనస్సుయొక్క మలిన రూపములు. శుద్ధమనస్సు మలినమనస్సుపై స్వామిప్రభావమును ప్రయోగించును. అందుచే మానవుని వాంఛలు స్మృతిచే ఆవేశితములై శరీరముచే అనుసరింపబడును. ఒక బీదరైతుకుటుంబమున పుట్టిన బాలుడు పరిస్థితులవెంబడి ఒక మహాగాయకుడో ఒక మహాధ్యక్షుడో కావచ్చును. ఇది ఎట్లు పొసగుచున్నది ? జాతి గాని అతని తల్లిదండ్రులు గాని అతనికి శారీరకరూపమును మాత్రమే ఇచ్చిరి. కాని అతడు గతమునుండి తన విశిష్టస్మృతిని తెచ్చుకొనినాడు. ఆ స్మృతి అతనిని ముందుగల ఒక స్థితికి త్రోసినది. ఆ స్థితి అతనిని గాయకుని గానో అధ్యక్షుని గానో చేసినది. ఆ స్మృతి ఉద్దేశించిన అదృష్ట మిట్లు సిద్ధించినది. పూర్వ జీవితముల స్మృతి మన కర్మలకు ప్రోద్బలకము కాగా సిద్ధించిన మహా సుఖమును మన మనుభవించుచున్నాము. ఇక్కడ ఒక సమస్య ఉత్పన్నమగుచున్నది. మనస్సుయొక్క ప్రవృత్తికిని చేతనయొక్క ఆదేశములకును కలుగు సంఘర్షణమును గూర్చిన సమస్య. మనస్సుయొక్క ప్రవృత్తి తప్పుత్రోవలకు సాగును. చేతన తప్పులనుండి తప్పుకొను మని మనకు చెప్పును. తాత్కాలికోద్రేకములకు లోనుగాక నిగ్రహము

వహించి ఉన్నతముగా నిలువుమని అది మన కాదేశించును. పూర్వుల యొక్కయు జాతిమొత్తముయొక్కయు శక్తి మన శారీరకోద్రేకములో పనిచేయును. చేతన వ్యష్టిచేతననుండి సరాసరి వచ్చును. వ్యష్టియొక్క ఆత్మ లేక ప్రత్యగాత్మ పూర్వులనుండి సంక్రమించిన శరీరాలయము నందు ప్రతిష్ఠితమైనది. మఱి ఆ పూర్వులు అనేకవిషయములను చూచిరి. అనేకానుభవములను పొందిరి. మంచివో చెడ్డవో అటునిటు గానివో అయిన వారి కోఱికలు సఫలములు నిష్ఫలములు బీజరూపమున శరీరములో నిక్షిప్తములై యున్నవి. ఆ బీజములు మాంద్యమును పోగొట్టుకొని జాగరూకత వహించి వాని వెనుకటి బలముతో స్వేచ్ఛతో తమ ప్రాబల్యమును జూప యత్నించును. అప్పుడు చేతనాశక్తి రంగమున ప్రవేశించుట. అప్పుడు చేతన మేల్కొని శరీరముయొక్క అంధశక్తులను నిగ్రహింపవలెను. కావున తీర్మాన మేమనగా— ఆత్మ విశిష్టవ్యక్తికి సంబంధించినది. అనేకజన్మలలోని రూపములను దాటి వచ్చుచున్నది. తరతరముల పూర్వీకులనుండి అవతరించినది శరీరము. ఇప్పుడు ఆత్మనుగూర్చి ఇంచుక చర్చ సేయుదము. ఆత్మ సర్వశుభప్రదాయి అనియు, ఆప్తమిత్ర మనియు, ఏకైకరక్షక మనియు చెప్పియుంటిని. ఆత్మయొక్క స్థూలరూపము లగుటచే మనశ్శరీరముల రెంటిపై ఆత్మ తన ప్రభావమును వింతగ బ్రసరింపజేయును. ప్రపంచమున ప్రతిదియు ఆత్మయే. మనస్సు ఆత్మయొక్క సూక్ష్మరూపము. శరీరము మనస్సు యొక్క స్థూలరూపము. మనము మూలమునకు పోయినచో అనగా ఆత్మ చెంతకు పోయినచో మనశ్శరీరములు రెంటిని నిగ్రహింపగలము. మానవుని జీవితమున ఆత్మనిగ్రహమునకంటె మిక్కిలి ఆవశ్యకమైనది ఇంకొకటి లేదు. ఆత్మనిగ్రహమే యోగమునకు ఏకైకద్వారము. ఈ సుగుణమును సాధించుటకు సర్వశక్తిని వినియోగింపవలెను. ఆత్మనిగ్రహమును సాధించిన వానికి అనేకసుగుణములు అప్రయత్నముగా

అబ్బును. శాంతము న్యాయము దానము ధర్మము మొదలయినవి. ఆత్మ నిగ్రహముయొక్క తత్త్వ మిది, ఆత్మను నిగ్రహించుట ఎట్లు అందువా? వినుము. ఆత్మయొక్క దుర్బలరూపములు మనశ్శరీరములు. అట్టి మనస్సును ఏకాగ్రముగా ఆత్మయందు నిల్పుటకు నిరంతరమైన తీవ్ర మైన దృఢమైన యత్నమును చేయవలయును. ప్రపంచమున ఆత్మ కడు శక్తివంతమైన పదార్థము. ఆత్మశక్తిని గ్రహించిన వానికి మనశ్శరీరము లను నియమించుట పిల్లలఆటగా నుండును. సర్వజ్ఞానము సర్వవివేకము ఆత్మనిగ్రహపరునకు లభ్యము లగును. అతడు తన మనస్సును ఏ వస్తువునం దైనను కేంద్రీకరింపగలడు. అప్పు డా వస్తువు తన సర్వ రహస్యములను అతని కందించును. నిజమైన ఆత్మనిగ్రహము గలవానికి సూర్యునిలో గల ద్రవ్యమును గాని నక్షత్రములయొక్క ప్రకాశమునుగాని పృథివీగర్భమున నున్న పదార్థమును గాని తెలిసికొనుట అశక్యము కాదు. ఆత్మనిగ్రహము కలవానికి ఏదియు గుప్తమై ఉండలేదు. గతములో నీ జన్మకు పూర్వమం దున్న అంశములను, మరణానంతరము జరుగబోవు అంశములను అత డావిష్కరింపగలడు. నిక్కముగా సర్వవివేకము ఆత్మనిగ్రహఫలము. ఆత్మయొక్క చేతులలో ప్రకృతి ఒక సాధనము. ఒక మహాగాయకుడు కొన్ని తీగెలతో అద్భుతగానమును సృజించు రీతి ఆత్మనిగ్రహపరుడు ప్రకృతిలోని ద్రవ్యములతో వింతలైన వస్తువులను సృజింపగలడు. కొన్ని లోకములనే సృష్టిచేయగలడు. ఒక కుమ్మరివాడు అసంఖ్యాకములగు కుండలను కూజాలను కేవలము చక్రముపై మట్టిని పట్టుకొను పద్ధతిచే నిర్మించు రీతి ఆత్మనిగ్రహపరుడైన యోగి ప్రాకృ తికద్రవ్యమును చేబట్టి మర్త్యలోకముల సృష్టిచేయును. మానవుడు గత కాలమున వృద్ధిచేసినట్టియు, ఇప్పుడు వృద్ధిచేయగలట్టియు ఈ శక్తి, దీని రహస్యము, అతడు న్యాయముగ జీవించుటలో న్యాయముగ శ్వాసించు టలో న్యాయముగ భుజించుటలో న్యాయముగ శయనించుటలో న్యాయ

ముగ భావించుటలో కలదనిన నీకు వింత గొలుపవచ్చును. మన మంద
జము ఎదురుచూచుచున్న శాంతి సద్భావము ప్రపంచమునం దెల్లయెడల
ప్రతిష్ఠ నొందవలయు నన్న ఆ పని ఆత్మనిగ్రహపరులు ఆత్మసంయమ
పరులు ఆత్మప్రబుద్ధులు అయిన వారిచేతనే సాధ్యము. ' ఈ గోళమునం
దంతట విశ్వశాంతి తప్ప మఱి యొక్కటి మేము కోరము ' అని ఉద్ఘో
షింపగల స్త్రీపురుషులు మన కిప్పుడు కావలయును. ఇట్టి నిశ్చయము
గల స్త్రీపురుషులు కొలది మంది లభ్యమై, వా రాత్మనిగ్రహపరమైన
జీవితమును గడుప దొడంగిరా, భూలోక మంతయు నాకలోక మగుట
కెంతో కాలము పట్టదు. యోగముయొక్క పరమార్థ మిచటనే కలదు.
ఇట్టి శక్తిని సంపాదించుటయే, ప్రపంచమం దంతటను శాంతిసద్భావ
ములను సౌభ్రాతృత్వమును ప్రతిష్ఠాపనము చేయగల సామగ్రిని సాధించు
టయే, యోగముయొక్క పరమావధి. కావున యోగి సోమరి కాదు.
మానవు లందఱికంటె యోగియొక్క విధి మిక్కిలి గురుతర మైనది.
అనేకులకు జీవితము వర్తమానవిషయము. ప్రతివాడును నేడు సుఖ
పడుట ఎట్లు ? రేపు సుఖపడు మార్గ మేమి ? అని ఆసక్తుడై యున్నాడు.
పక్షి లెగిరిపోయి కొన్ని పురుగులను పట్టుకొని తిని తమ నీడముల నిద్రిం
చును. రే పేమి భుజింపగలవో అవి ఆలోచింపవు, కాని కొన్ని పక్షులు
కొన్ని జంతువులు కొన్ని కీటకములు వానకాలమునకు కావలసిన ఆహార
సంభారమును ప్రోగుచేసి పెట్టుకొనును. పరిణతి నొందిన నేటి మానవ
జాతి ఈ సంగ్రహగుణమును అమితముగ పెంచుకొనినది. ప్రతివాడును
తన జీవితాంతమువరకే కాక తన పుత్రులకు తన పౌత్రులకు సరిపడగల
ధనధాన్యములను ఆస్తిపాస్తులను ప్రోగుచేయుటకు ఆతురత వహించు
చున్నాడు. ఈ సంగ్రహగుణము చీమయొక్క గుణము. దీనిని మాన
వుడు పెంచుకొనుటలో వింత గాని విడ్డూరము గాని లేదు. ఈ ఆహార
సంగ్రహగుణము ఈ బ్రతుకుదెరువుదేవులాట— వీనిలో భావిమానవ

జాతినిగూర్చి ఆలోచించు యుక్తి గాని, బీజము గానీ, మూలము గానీ, ఏమియు లేదు. మానవజాతిని వినాశమొనర్చు విధానమే ఇం దున్నది. పారిశ్రామికప్రకోపము మిన్నుముట్టు ఈ నవయుగమున పెద్ద జాతులు ప్రపంచమునందలి ద్రవ్యకోశమును వినియోగించుకొనుచున్నవి. అవి బొగ్గును కొయ్యను ప్రాణవాయువును నత్రజనిని ఖాళీచేయుచున్నవి. పుడమిలో గాలిలో గల సృజనశక్తిని అయిపోగొట్టుచున్నవి. ముందు కొంతకాలమునకు మానవజాతి బ్రతుకుటకు కావలసిన ప్రాణవాయువు నత్రజని వంటచెఱకు లేకుండ వాని నిప్పుడే మన ముపయోగించు చున్నాము. మన ఆత్మలో నిలుపుకొనిన గుణములతో భవిష్యన్మానవ జాతి సంబద్ధమై యుండునని మన మేమాత్రము స్మృతికి తెచ్చుకొనుట లేదు. ఆత్మ తన స్వయమైన జీవితవిధానముచే కర్మవిధానముచే తన ఉనికికి మనికికి భవిష్యన్మానవజాతియొక్క మనికికి ఉపయోగపడు శక్తిని కలిగియున్నది. మానవజాతికి సుఖశాంతులను సమకూర్పగల శక్తులను ఆత్మలో పెంచుట యెట్లో యోగము బోధించును. వర్తమానమున భోగ మయజీవితమును గడపుట యెట్లా అని కాదు యోగము బోధించునది. ఆత్మయం దనుప్రాప్తమైన దానిని నిజముగ నిశ్చయించి దివ్యమైన జీవన మును గడపు త్రోవను అది చూపును.

# స్వప్నము

నిద్రించుచున్న శిశువుయొక్క ప్రశాంతమైన ముఖారవిందమును ఎన్నడైనను గమనించితివా ? ఉషఃకాలమందలి మసకవెలుతురుచే చుట్టబడిన మహాసాగరమును ఎప్పుడైనను పరిశీలించితివా ? సుప్తశిశుముఖమును ఉషస్సాగరముఖమును నీవు చూచియుంటివేని ఆత్మ యొక్క అద్భుతలక్షణమును నీవు గమనింపగలవు. ఆ లక్షణ మేది ? అది నిశ్శబ్దత. నిశ్శబ్దస్థితిలో ఆత్మ తనకు తాను స్వేచ్ఛగా సువ్యక్తత నొందును. సుస్థితి సువ్యక్తత పరస్పరసంబద్ధములు. స్థితి యొక్క వ్యక్తతయే విశ్వములోని గొప్ప లక్షణము. సత్యమైన దాని కెప్పుడును స్థితి కలదు. స్థిత్యాలయమువైపునకే మన అన్వేషణము మన యాత్ర సాగిపోవుచున్నవి. మానవుడు జీవించుచున్నాడు. కాని కేవలజీవనముతో అతడు సంతృప్తి నొందుట లేదు. అతనికి సుఖము కావలెను. ఆ సుఖమును పొందుటకు అతడు ఈ విశ్వములోని ప్రతిపదార్థము చేరువకు అనుక్షణము పోవుచున్నాడు, తన కుమారుని తలకు సరిపడు టోపీని కొనుటకై ఒక స్త్రీ ప్రతిదుకాణమును ఎక్కి దిగుచున్నట్లు. అట్లే మానవుడు నిప్పుచెంతకు నీళ్ళచేరువకు చెట్లవద్దకు సముద్రపుటొడ్డునకు సూర్యకాంతికి చుక్కలవెలుగునకు పోవుచున్నాడు. చేతులు జోడించి నిలబడి బహురూపిణియైన ఈ విశాలప్రకృతిని జేరి తనకు సుఖపుత్తలిక నిమ్మని యాచించుచున్నాడు. అతని కది చిక్కుట లేదు. ఒక వేళ చిక్కినను ఒకటి రెండు దినములకంటె పైకాల ముండుట లేదు. తిరిగి దుఃఖితు డగుచున్నాడు. తిరిగి యాచించుచున్నాడు. సుఖముకొఱకైన ఈ దుర్భరయాచన మానవుని విధి అనిపించుచున్నది. తాను వాంఛించిన

దానిని అతడు ప్రకృతినుండి పొందలేకున్నా డెందులకు ? అడుగడుగు నను నిరుత్సాహితు డగుచున్నా డేమి ? జన్మజన్మాంతరములయందును ఈ నిరుత్సాహ మిట్లతని నావేశించుచున్న దేల ? పూర్వజన్మలలో అతనికి నిరాకరింపబడిన సుఖతృప్తిని పొందవలయు ననియే అతడు తిరిగి తిరిగి జన్మించుచున్నాడు. 'నీవు నాకు గతజన్మలో సుఖము నీయ లేదు. దానిని ఈ జన్మలో ఇమ్ము' అని మానవుడు ప్రకృతిని అడుగు చున్నా డనిపించును. బహుశః ప్రకృతి ఇచ్చినదే చూడుడు. కాని, అత డింకొక దాని నడుగును. ఈ నిరంతరదాహము మానవజాతి జీవనమును ఎండగట్టుచున్నది. ఇట్టి బహునిరుత్సాహములయిన పిమ్మట మానవుడు తన ఆత్మను ప్రశ్నింపగా అది ఇట్లు సమాధాన మొసంగును. 'ఓయీ ! నీవు స్వప్నమయభూతములను యాచించుచుంటి వాయెను. నీవు సుఖ మును కోరుచున్నావు నిజమే. నీ కొఱకు సుఖమున్న మాటయు నిజమే. కాని ఆ సుఖముపైపునకు పోవు త్రోవపై నీవు నడచుట లేదు. నీ వింద్రియమార్గమున బడితివి. అది అస్థిరమార్గముకదా' అని. మానవు డస్థిరసుఖము నాసించుచున్నాడు. ఆ సుఖము నిలచుట లేదు. అందుచే విఫలు డగుచున్నాడు. పిపాసితుడైన వాడు ఒక రాతిపై దెబ్బను కొట్టినచో ఆ దెబ్బ అతని దాహమును తీర్చునా ? తీర్చదు. మండు టెండలో ప్రయాణము చేసి చేసి వచ్చినవాడు ప్రజ్వలించుచున్న అగ్ని చెంత కూర్చున్నచో ఆ అగ్ని అతనికి చల్లదనము నిచ్చునా? ఈయదు. కాని మానవు డదే పనిని చేయుచున్నాడు. అతడు కన్నులకు గంతలు కట్టుకొని చీకటిలో ద్వివిధాంధస్సులో నడయాడుచున్నాడు. ఆ గ్రుడ్డి బాటపై అతడు బిచ్చ మెత్తుచు తిరుగుచున్నాడు. ఎవనిని బిచ్చ మెత్తుట ? వినలేని జీవములేని అచేతనపదార్థములను. అందుచే అతని కా సుఖము లభించుటలేదు. వృక్షములను, శిలలను, జంతువులను తనకు సుఖ మిమ్మని అతడు యాచించుచున్నాడు. కాని అతని కవి దుఃఖమునే ఇచ్చు

చున్నవి. తుద కాతడు హతాశుడై గుండె పగిలి మరణించుచున్నాడు. ప్రతిమానవుని చరిత్ర ఇది.

జీవితములోని గొప్ప లక్షణము స్థితి అని చెప్పితిని. అది సత్పదార్థము. ఆ సత్పదార్థము కాక మిగిలిన దంతయు స్థితిలేనిది. మనము ప్రకృతి అని విశ్వ మని దేనిని పిలుచుచున్నామో, దేనిని మన ఇంద్రియములతో కనుచున్నామో, అది ఆ సత్పదార్థము దృష్ట్యా చూచినచో కేవలము స్థితి లేనిది. అయితే ఈ స్థితిలేని పదార్థము, మానవుని ఎట్లు వాని వాంఛలను తీర్చునట్లుగా ఆశ గొల్పుచున్నదో చూడుడు. ఈ ప్రపంచమునందు ఇది మిగుల వింతయైన విషయము. లేని పదార్థములు మన కున్నట్లు కన్పట్టును. అనభ్యస్తమైన బుద్ధిగలవాడు అనియమితమైన హృదయము గలవాడు అనాత్మీయమైన విలాసము గలవాడు—ఇట్టి సామాన్యమానవుడు ఈ తత్త్వము నర్థము చేసికొనగల డని ఊహింపరాదు. మానవుడు సత్యములని గ్రహించిన వాని కన్నిటికి ఇది విరుద్ధముగా కన్పట్టును. ఈ ప్రకృతి స్థితి కలదిగనే కనబడుచున్నది. అయినను ఇది స్థితిలేనిది అనుచున్నాను. మానవు డెన్ని వింతలైన శక్తులను సంపాదించినను ఈ స్థితిలేని తనమును గ్రహింపలేకున్నాడు. 'అట్లయిన ఈ స్థితిలేనిదానిని ఈ మిథ్యను మే మెట్లు ప్రేమించుచున్నాము ?' అని నీ వడుగవచ్చును. ఈ ప్రశ్నకు సమాధానము చెప్పుట కష్టము. అయినను, నే నొక చిన్న కథను చెప్పెదను వినుము. ఒక డొక దుకాణమును నడపుకొనుచుండెను. ఒకనా డతడు దుకాణములోని తన కుర్చీలో కూర్చుండియే నిద్ర కొరగి ఒక స్వప్నమును కనినాడు. సమీపమం దున్న నగరమునకు పోయి నట్లును, ఆ నగరమందలి ఒక గొప్ప వ్యాపారస్థుని కొమార్తెను అతి సౌందర్యవతిని గాంచి ప్రేమించి వివాహమాడి నట్లును, ఆ కలలో కనినాడు. పిదప కొంతకాలమునకు ఆ వ్యాపారస్థుడు తన ఆస్తి నంతటిని ఆ ఏకైకపుత్రిక కిచ్చి కాలగతి నొందినాడు. అంతట ఆ భార్యతో

ఆ దివ్యభవనమున అతడు బహుపరిచారకులతో పెక్కు ఏనుగలు గుఱ్ఱములు మొదలయిన వానితో మిక్కిలి సుఖముగా కాలము గడపుచుండెను. మఱి కొంతకాలమునకు అతడు తన ఐశ్వర్యమును పెంచదలచి కొన్ని నావలు కొని వస్తుభాండారములతో వానిని నింపి భార్యాసమేతుడై చూచి దేశమున కేగి వస్తువులను అమ్ముకొని మఱింత ధనము సంపాదించి వచ్చినాడు. ఇరువది సంవత్సరములు గడచినవి. పెక్కురు పిల్లలు కలిగిరి. పంద్రెండవ బిడ్డ పుట్టి జ్వరగ్రస్తయై చనిపోయినది. ఆ బిడ్డ శవమును పూడ్చుటకు వారు శ్మశానమున కేగిరి. ఒక పెద్ద తుపాను వచ్చినది. తలదాచుకొనుటకు చెంత నెచ్చటికైనను పోదము రమ్మని భార్య నతడు ప్రతిమాలినాడు. తనబిడ్డను వదలి వచ్చుటకు ఆమె నిరాకరించినది. తుపాను పెద్ద దయినది. అత డామెను బలవంతముగ కొనిపోవుటకు పట్టి లాగినాడు. హఠాత్తుగా అప్పు డొక పిడుగుపడి ఆమె చనిపోయినది. దుఃఖాగ్ని అతనిని దహించుచున్నది. అతనికి మెలకువ వచ్చినది. అదివర కతడు చుట్ట త్రాగుచు కుర్చీలో నిద్రించుచుండెను. ఆ చుట్టకు గల నిప్పురవ్వ అతనిచేతిపై బడి మెలకువ వచ్చినది. అతడు కునికినది రెండు మూడు నిమిషములని గ్రహించినాడు. ఆ కొలదికాలములో అత డీ వింతకలను కనినాడు. మరల తన కుండలు కూజాలు గల దుకాణములోని కుర్చీలోనే తా నున్నాడు. మఱియొక కథ చెప్పెదను వినుము.

ఒకనాటి రాత్రి సేనాపతి యొకడు తన భార్యను వెంటబెట్టుకొని ఒక జనసమూహములో పోవుచున్నట్లు కల గనినాడు. కొందఱు స్నేహితులు కన్పడి మాటలాడ దొడగిరి. గుంపు దట్టముగా నున్నది. ఇంతలో అతనిభార్య కనబడలేదు. కొన్ని గంట లా గుంపులో వెదకినాడు. ఆమె జాడ లేదు. ఏ స్నేహితుడో ఆమెను వెంట గొనిపోయినాడనుకొని దుఃఖితుడై ఇంటికి చేరి తల్లిదండ్రుల కా విషయ మెఱిగించి

నాడు. పాపము వా రేమి చేయగలరు? అంత కొంత సేపటి కతడు రాజుచెంత కేగి తన గోడును చెప్పుకొని తగిన సహాయము చేయుమని కోరినాడు. 'నీ భార్య కింకొక భర్త కావలసియుండగా నే నేమి చేయ గలను' అని రా జనినాడు. హతాశుడై అతడు దేశము విడిచి పరదేశ మున నివసింపసాగెను. ఆ ప్రక్కయింటివాని భార్య నితడు ప్రేమించెను. ఆమె ఇతనిని నిరుత్సాహపఱచుటకు కాబోలు ఒక బిందెడు నీరు తెచ్చి వీని తలపై క్రుమ్మరించినది. నిరాశుడు దుఃఖార్తుడునై అతడు బ్రతుకు మీది వాంఛను వీడి చావ దలచెను. విషము త్రాగదలచి సిద్ధపడి త్రాగ బోవు వేళకు ధైర్యము లేకపోయినది. పిమ్మట సముద్రములో దూకి నాడు. మునిగి పోజాలక ఈది ఒడ్డునకు చేరినాడు. ఒక పర్వతశిఖర మెక్కి క్రింద పడదలచి శిఖరాగ్రమును జేరగా పడుటకు గుండె చాలక దిగి వచ్చినాడు. గిరిపాదమున ఒక మాంత్రికుడు కన్పడెను. అతనితో తన కథను చెప్పుకొనినాడు. మాంత్రికుడు తన శక్తిచే అతని కొక రాజ సౌధమును నిర్మించి ఒక రాజకన్యను సృజించి యిచ్చినాడు. అందు సేనాపతి కొన్ని సంవత్సరములు మిక్కిలి సుఖముగా గడపి ఒకనా డా రాజకన్యతో తన పూర్వభార్యవిషయము ప్రసంగవశమున చెప్పుచుండెను. ఆ చెప్పుటలో చప్పట్లు కొట్టి నవ్వుచుండెను. ఆ నవ్వుల పొంగులో అతనికి మెలకువ వచ్చినది. ప్రక్కనున్న భార్య వానిని పట్టి కదలించుచు చప్పట్లు కొట్టుటకు కారణ మేమని అడుగసాగెను. అతడు నిద్ర కొరగి ఒక నిమిషమైనను కాలేదు.

మన మనస్సుయొక్క విచిత్రప్రకృతిని తెలుపుటకు ఈ రెండు కథలును దృష్టాంతములు. అనేకసంవత్సరముల వరకు విస్తరించెడి ఒక మహాకథను తన భాండాగారమునుండి గ్రహించి అతిస్వల్పకాలములో మనస్సు సృష్టిచేయగలదు. ఈ ప్రకారముగా మనస్సు ప్రకృతిలో లేన ట్టియు, కల గనువానికి అత్యంతనిశ్చయముగా తోచునట్టియు ఒక మహా

మాయను సృజించు శక్తిని కలిగియున్నట్లు చూచుచున్నాము. ఈ ప్రమాదమునకు పడుడగుట మానవునిలో మనము ముఖ్యముగా గమనింపవలసిన లక్షణము. మన మనస్సులో నున్న ఈ లక్షణము మనము చూచుచున్న సమస్తవస్తువులను సృజించుచున్నది. మనము ప్రత్యక్షముగా చూచిన దానిని నమ్మవలె ననియు, మిక్కిలి జాగరూకులమై యున్నా మనియు, మన భావన. ఏ మాత్రము సందేహింపము. నిజముగా జీవిత మున్నంత్వ వరకు మనకు సందేహము కలుగదు. కాని మన దృష్టి నాకర్షించుచు జీవితాంతము మన మనస్సులను ఆహరించుచున్న ఈ వస్తుజాత మంతయు సత్యము కాదు. మహాయోగులు, తాత్త్వికులు, మనస్సేయొక్క ఈ ఇంద్రజాలమును కనుగొని, మానవుడు తనచే తానే బ్రతికి యున్నంత వరకు మోసగింపబడుచున్నా డని గ్రహించినారు. ప్రతి మానవుడు తనకు తానే ఆశలు గొలుపుకొనుచున్నాడు. తనను తానే శిక్షించుకొనుచున్నాడు. సర్వమును ఆవరించిన, సర్వమును లీనము చేసికొనిన, సర్వనాశకమైన, ప్రమాద మిది.

స్థితిలేని వానినుండి మానవుడు సుఖమును యాచించుచున్నా డని ఇదివరకు చెప్పియుంటిని. దుకాణదారుడు స్వప్నమును గనుచున్నంత సేపు తా నొక సుందరాంగిని వివాహమాడితి ననియు, మహైశ్వర్యమును పొందితి ననియు. తలచుచు సుఖమున నోలలాడెను. కాని మెలకువ చెంది స్వప్నము కరగిపోయిన దని గ్రహించినంతనే అపారదుఃఖమున కుప్పగూలెను. అదే విధము ఈ విశ్వములోని ఒక విశిష్టవస్తువునుండి ఒక మహాసుఖము నాసించి ఎదురు చూచుచున్నంతవరకు, సాధనలో తఱచు అది సర్వము శూన్యముగా దుఃఖముగా తెలిసికొందుము. ఉదాహరణకు పెండ్లిగానున్న ఒక కన్యను చూడుము. ఆమె బంగారు కలలు కనుచుండును. తాను నివసింపబోవు నూతనగృహము, అందు దినమున కొక నూతనవైభవానుభవము, అచట తన కబ్బు సుఖపరంపర. సరియే.

వివాహమైనది. రెండో మూడో అయిదో ఏడో పదునైదో సంవత్సర ముల పిమ్మట జీవితము మారును. బహుశ ఆమె భర్త మరణించును, లేక ఆమెను విడిచిపెట్టును, కాకున్న అతని ఐశ్వర్య మెల్ల పోవును, అట్లు కానిచో వారి గృహము కాలిపోవును. వర్ణింపరానిది ఊహింపరానిది ఏదో జరుగు ననుకొనుము. అట్లగు నని ఆమె యెన్నడును తలచనిది సంభ వించును. అది ఆమె ఆశల నన్నింటిని కూల్చివేయును. హతస్వాంతయై ఆమె గతముయొక్క శిధిలముల చెంత ఒంటరిగా నిలబడును. అంతయు ఒక కలగా కన్పట్టును. మరల ఆమె ప్రకృతియొక్క మాయలో పడి పోవును. తిరిగి ఆమె సుఖమును పొందగోరును. ఈ సారి ఆమె వివాహ మాడదు. తన సర్వశక్తులను ధనసేకరణకు మరలించును. ఒక మహా భాగ్యమును ప్రోగుచేసి అందు సుఖమును కనుగొన నామె ఆశపడును. తిరిగి నిరాశయే సిద్ధించును. తిరిగి ఆశాశిధిలముల చెంతనే నిలబడును. ఈ ప్రకారము జీవితము తరువాత జీవితము ప్రతిదానిలో మానవుడు సాగి పోవుచున్న బాటపై ఇరుపార్శ్వములనుండి స్వప్నవృక్షచ్ఛాయలే పడు చున్నవి. ఈ స్వప్నవృక్షమునకు ఆశాస్వర్ణఫలములు వ్రేలాడుచున్నవి. క్షణములు గడచిపోవును. స్వప్నవృక్షము మాసిపోవును. ఆశాసువర్ణ ఫలములు అదృశ్యము లగును. ఏమియు మిగులుట లేదు. అంతయు ఎడారి. నీవు ఆఫ్రికా ఆసియా ఖండము లందలి ఎడారులలో సంచరించి యున్నచో ఎండమావు లనగా నేమియో తెలిసియుండును. భీకరముగ విజృంభించుచున్న సూర్యాగ్ని క్రింద ఎండలో దప్పితో తపించు బాటసారి హఠాత్తుగ దూరమున నొక వింత తోటను చూచును. అందు చక్కని నీటి బుగ్గలు, చల్లని చెట్లనీడలు, తోచును. పక్షుల మధురకలకూజితములు విన్పిం చును. కుసుమపరిమళవీచికలు నాసికాపుటములకు సోకును. గంపె డాసతో అతడా తోటవైపునకు గబగబ నడచును. నడచి నడచి ఎంత పోయినను ఏమియు నుండదు. అంత నొక దివ్యనగరముయొక్క విచిత్రదృశ్యము

తోచును. చలువరాతితో కట్టబడిన సౌధరాజములతో బహువిధవృక్షములతో జలసమృద్ధితో తులదూగు ఆ నగరవీధులలో సంచరించు స్త్రీ పురుషుల మాటలు విన్పించును. తనకు విశ్రామయోగ్య మయిన స్థలము తుదకు లభించ నున్నదనియు. అందు తన కొక చెంబెడు నీరు త్రాగుటకు దొరక నున్నదనియు, అతడు తలచును. ఆ వైపున కతడు వేవేగ నడచి పోవును. కాని ఏమియు కన్పట్టదు. చుట్టును ఎల్లయెడల రాలుచున్న ఇసుకయే. సుడివడి తాపజ్వాలను సహింపలేక మరణించును. ఆ రక్తో టర మెండ కెండిపోవును. ఎముకలు తప్ప ఇంకేమియు మిగులదు. ఈ జగమం చెటు చూచినను ఇదే కథ. ఐరోపాలోని శ్మశానవాటికల ప్రక్కగా బోవుచున్నప్పుడు నాకు భారతదేశపు ఎడారులలో చూచిన తెల్లని ఎముకలు స్మృతికి వచ్చును. ముప్పదియో ఏబదియో వందయో సంవత్సరములు ఈ తీరున దూకులు పెట్టుచున్నా రీ స్త్రీపురుషు లెందు కొఱకు ? కమ్మని దృశ్యబింబము కొఱకు, చల్లనినీడ కొఱకు, - సర్వ మయిన శూన్యము కొఱకు. ఒక సమాధిని చూడుము. అది నిశ్శబ్దముగా జీవితము యొక్క ఏకత్వమును చాటుచున్నది. అది విషాదభూయిష్ఠమే కాని సత్యము. అది హృదయవిదారకమే కాని ఉపదేశాత్మకము. యోగి తన నిశితమైన దృష్టితో ఈ జీవితమును కడముట్ట చూచినాడు. అత డే మనుచున్నాడు ? అతడు విషాదము నొందెనా ? లేదు. ఎన్న డెఱు గడు. ఎందుచేత ? జీవితములోని మఱియొక వైపును, జీవితములోని మహోలక్షణమైన సత్పదార్థమును అతడు కనినాడు. ఏకసత్యమైన సుస్థిర మైన సత్పదార్థమైన ఆ స్థితిపై అతడు కన్నులు చెవులు ఏకాగ్రము లొనర్చి నడచుచున్నాడు. అందుచే యోగి ఎన్నడును మోసగింపబడడు. అత డెన్నడును దుఃఖమున క్రుంగడు. యోగిముందు ప్రకృతి భీతితో నిలబడును. యోగికి ప్రకృతి తల ఒగ్గును. ' నేను మోసగించుటకు వీలు కాని మానవు డితడు ' అని ప్రకృతి అనుకొనును. అందుచే యోగి

సృష్టికి ప్రభువు. మనము స్వప్నమున బడి పోవుచున్న కొలది మనము చేయుచున్న ప్రమాదము పెద్దదగుచుండును. ప్రపంచమునం దున్న దుఃఖ మంతయు ఈ ప్రమాదముయొక్క ఫలితమే. ప్రతిమానవుడును తన జీవ మొక్కటియే జీవింపవలయునని తలచుచున్నాడు. అందుకై అతడు తన సోదరుని దోచుకొనుచున్నాడు, హత్య చేయుచున్నాడు. ఈ మానవులు సత్యమును దర్శింపలేదు. వీరు ప్రకృతిచే మూఢులుగా చేయబడిరి. ఏకైకసత్యసందర్శనము వీరికి కాలేదు. ఆ సద్దర్శనము నెట్లు పొందుదుము ? జీవితములో సత్యముయొక్క దర్శన మే రీతి మనకు లభ్యము కాగలదు ? మాయాదృశ్యములచే ఆవృతుల మైన మనము ఆ సత్యాలయము నెట్లు చేరగలము ? వివేకవంతులయిన వా రందఱు తమ మనస్సులలో ఈ ప్రశ్న నూహించియే యుందురు సుస్థితి సువ్యక్తత ఈ రెండును పరస్పరసంబద్ధములని ఇదివరకు చెప్పియుంటిని. కావున సత్యస్థితి తన్నుకు తానే అభివ్యక్తము చేసికొనును. అది మనతో భాషించును, మనకు బోధించును, మనకు సుఖసౌధమునకు బోవు త్రోవను చూపించును. అది ప్రతిమానవునితో ఇట్లు చెప్పును ' నా చెంతకు రమ్ము. నీవు సుఖమును పొందగలవు నా చేఱువకు రమ్ము, నీ కాశ్రయ మిచ్చెదను. నీ దుఃఖముల నన్నింటిని పోగొట్టెదను. నీ విచారము నంతటిని తీసివైచెదను, నేను చూపించు సత్య మార్గమున జాగ్రత్తగా నడుపుము. నా చెంతకు రాగలవు. ఆ పైన విశ్రమించెదవు గాక. అమృతకలశమును చవిచూచెదవు గాక ' అని. యోగి ఎప్పుడును మరణింపడు. అత డమరుడు. ఎందుకో తెలియునా ? అతడు మరణ మెఱుగని వానిని ప్రేమించును. మానవు లందఱు మరణించుచున్నారు. ఎందుకో తెలియునా ? వా రసత్యమైన వానిని మరణించు వారిని ప్రేమించుచున్నారు. నీవు నీ హృదయమున ధ్యానమగ్నుడ వయ్యెదవేని, ఈ ప్రపంచమందలి చీకటిబాటలపై వెలుగును ప్రసరింపజే యుటకు సిద్ధముగా నున్న ప్రదీపమును గాంచె

దప్ప. ప్రతిమానవుడు ఒక తమోగుహలో నివసించుచు దివ్యమహాదీప కాంతికి దూరుడై యున్నాడు. నీ వొక యోగివి కాగోరుదువేని నీ హృదయగవాక్షములను తెఱచి యుంచుము. నీ ఆత్మద్వారములను తెఱవుము. వెలుగు లోనికి ప్రసరించును. దేవుని కెల్ల వేళల ప్రియులైన వారి కర్ణముల జొచ్చు మహాగానమును నీవు వినగలవు. జీవిత మొక దీర్ఘమైన మసకవెలుతురు. ఇక్కడ మనము దేనినైనను పగటివెలుగులో వలె చూడలేము. అన్ని విషయములపై సంశయము అను ముసుగు ఆవరించును. వస్తుజాతము యొక్క ముఖమున క్రమ్మియున్న ముసుగును తొలగించిన వాడే తాత్త్వికుడు. ఆత్మలో జరుగు పనిని ఉదాహరించుటకు ఒక జాతి ప్రజలలో జరుగు వివాహవిధానమును గ్రహింపవచ్చును. వధువును పుట్టినింటినుండి కొనివచ్చుటకు వరు డేగును. అతడు వధువుతల్లి చెంతకు జేరగా ఆమె ఇట్లనును 'నా కొమార్తె లోపల ఇంటిలో నున్నది. నీ వామెను నిక్కముగా ప్రేమించిన వాడవేని, ఆమెను నిజముగా సుఖపెట్ట గోరుదువేని, లోనికి వచ్చి ఆమెను వెదకికొనుము' అని. అత డింటిలో ప్రవేశించును. వధు వెక్కడనో దాగుకొని యుండును. ప్రతిగదిలో ఆమె యెత్తు బొమ్మ ఒకటి సుందరముగా వస్త్రాభరణములతో అలంకరింపబడి యుండును. సరిగా ప్రతిబొమ్మయు ఆమెవలెనే ఉండును. వరుడు వెదకుట మొదలిడును. అతడు బొమ్మచెంత కేగి దాని చేతిని పట్టుకొనెనా, అందఱు చప్పట్లు చఱచి వాని నా యింటినుండి వెడలగొట్టెదరు. అతనికి వధువు దక్కదు. కాని అతడు అది బొమ్మ అని తెలిసికొని 'ఇది రంగద్దిన బొమ్మ. ఇది నా కెందుకు ?' అనుచు ప్రతిగదిని దాటి బొమ్మలను విడిచి వధువున్న గదిని జేరి ఆమె హస్తమును గ్రహించెనా, అప్పుడతని కా పిల్ల నిచ్చి వివాహము చేసెదరు. ఆత్మ కిది ఉదాహరణముగా సరిపోవును. మనము ఏ ఇతరమును గాక దేవుని ఒక్కనే ప్రేమించు
ర మైనచో, మానవు లీ జీవితములో వేనికొఱకు అనుదినము చచ్చి

పోవుచున్నారో, అట్టి సహస్రపదార్ధములను సమస్తభాగ్యమును ఎల్ల పద పులను ఎంత వింతగొల్పువాని నైనను, మనము తాకబోము. జీవితములో సాగిపోవుచు నిర్జీవములైన రంగుబొమ్మలను నిరాకరించుచు, ఏకైక సత్యమైన సర్వవ్యాపకమైన శాశ్వతమైన ప్రేమపూర్ణమైన పరమాత్మనే అన్వేషించెదము. ఆయనను ఈ జన్మలో కనుగొనకున్నను, తదన్వేషణములో మరణించుచున్నా మను సంతృప్తిని జ్ఞానమును కలిగియుందుము. పారిపోవుటకంటె వీరుని వలె పోరాడుచు మరణించుట వేయి రెట్లు శ్రేయస్కరము. ఆ నిత్యాలయమును చేరుటకు ముందున్న బాటపై విశ్వాసముతో విసుగు లేక సాగిపోవు యాత్రికుడు పడినను వెనుకకు పోవుటకంటె వేయి రెట్లు శ్రేష్ఠము. ఒక మహాయాత్రికుడు బాటపై పడి పోయినచో, ఆ పిమ్మట వచ్చు యాత్రికులు అతని ఎముకలను గాంచి ఆవేగమును బొంది 'అవును, అతడు మనకంటె ముందు వచ్చినాడు పడిపోయినాడు. మనము ముందునకు పోవుదము. త్వరగా ఆ సత్యాలయమును చేరుదము రండు' అని ఉద్యమింతురు. ఈ ప్రకారము యుగయుగమున గొప్ప తాత్త్వికులు మహాయోగులు ఆ సత్యాలయమును జేరగోరి మండుచున్న బ్రతుకు టెంగలపు బాటపై సాగిపోవుచునే యున్నారు. ఈ యుగములోని వారమైన మనమును అదే బాటపై నడచుచు మనకు ముందు పోయిన వారి ఎముకలను జూచి తల లొగ్గి భక్తితో శ్రద్ధాంజలు లిచ్చి వారికై ధ్యానము చేసి నమస్కరించి జీవితలక్ష్యమును జేరు పూర్ణవిశ్వాసముతో దీక్షతో ఒంటరిగా ముందున కేగుచున్నాము.

# భావన

జీవిక ఒక నిర్మాణకర్త్రి. ఆమె భావనచే నిర్మించును. పదార్థము లన్నియు జీవికాభావనకు బిడ్డలు. మానవుడు కూడ తద్భావనాసంజాతుడే. మన వివేకము పోగలిగినంతవరకు పోయి చూచినచో భావనకాక మఱి యొక సృజనశక్తి ఉన్నట్లు చూడలేము. ఈ భావన రెండుతీరు లయిన స్వభావము కలది, లేక ఒకే స్వభావము కలదై మనకు రెండుతీరులుగా కన్పట్టుచున్నది అని చెప్పవచ్చును. అది సమష్టిని దర్శించుటకుముందు వ్యష్టిని సృజించును. అది సమష్టిని ముందు సృజించి, వ్యష్టిని పిమ్మట సృజించిన దని చెప్పలేము. ఎందుకనగా రెంటిమధ్య కాలవ్యవధి ఏర్పడును. ప్రకృతిలో పదార్థము లన్నియు ప్రక్క ప్రక్కన ఏకకాలసంజని తములు. కావున సహేతుకముగా నుండుటకు సమష్టితో పాటే వ్యష్టి యొక్క ఉత్పాదనము కలిగిన దని చెప్పవలయును. సమష్టి యొక్క చిహ్నముల నన్నింటిని వ్యష్టి వహించును. సమష్టి మూలబింబ మని వ్యష్టి దానికి నకలు లేక ప్రతిబింబ మని భావింపవచ్చును. సద్గుణము అనునది సమష్టిభావము. ఒక మానవు డొక సత్కార్యమును చేసినప్పుడు సద్గుణ మతనిలో ప్రతిబింబించిన దందుము. ఈ ప్రకారము ప్రతివ్యష్టియు సమష్టిమానవునికి ప్రతిబింబరూపుడు. వ్యష్టిమానవుడు సమష్టిమానవుని ప్రతిబింబరూపు డని ఎట్లు చెప్పగలమో అట్లే పరిమితమైన మానవుని వ్యష్ట్యాత్మ అనంతమయిన సమష్ట్యాత్మకు ప్రతిబింబ మనియు వ్యష్టి సమష్ట్యాత్మలు ఒకటే యనియు తార్కికముగా చెప్పగలము. ఈ విషయ మును మనము విచారించువేళ, ఒకదానికంటె ఇంకొకటి భిన్నము. ఎందు చేత ? ఎందుకనగా వ్యష్ట్యాత్మయొక్క ముఖ్యచిహ్నము హేతువు లేక

వివేకము లేక చేతన. నీవు చేతనామయుడవు. ఈ చేతనయే నీవు. ఒక మానవుడు సజీవుడై యున్నా డని చెప్పుటను వివరింపవలయునన్న అతడు చైతన్యముతో నున్నా డనుటకంటె మార్గాంతరము లేదు. కావున మానవుడు దేవుడు సమానముగా కలిగియున్న ధర్మము చైతన్యము. కావున దేవుడు మానవుడు ఒకటే నని చెప్పగలము. ఎందుకనగా ఇరు వురు చేతనామయులు. మన యింకను లోతుగా ఆలోచించినచో దేవుని చైతన్య మనంతమని గ్రహింతుము. దేవుడు సర్వచైతన్యరూపుడు. మానవు డొక భాగమున అనగా దేశకాలములకు సంబంధించినమటుకు చైతన్యరూపుడు. మఱి యొక భేదము కలదు. దేవుడు నైతికముగా, ఆధ్యాత్మికముగా రసాత్మకముగా నిర్మలుడు. మానవుడు నైతికముగా ఆధ్యాత్మికముగా, రసాత్మకముగా మలినుడు. పరిమితి, మాలిన్యము – ఈ రెండు విషయములలో తప్ప మానవాత్మకు – దేవాత్మకు భేదము లేదు. మానవునికి దేవునికి మధ్యగల మూడవభేదము విశదమయినది ఏమనగా —— రహస్యము లేకుండ ఈ విశ్వమునకు సృష్టికర్త దేవుడు. ఒక పరిమితార్థమున మాత్రమే మానవుడు సృష్టికర్త లేక నిర్మాత. కాని దేవుడును మానవుడును భావనచేత సృష్టిచేయుదురు. చేతబట్టుకొను కఱ్ఱ నొకదానిని నీవు చేయగోరుదువేని, మొదట నీవు దానినిగూర్చి భావన చేయవలయును. ఆ కఱ్ఱ యొక్క స్వభావము, దాని రూపము, దాని పొడవు, దాని లావు, దానిపై చెక్కడమా లేక పూతరంగా–ఇదంతయు నీవు భావింపవలెను. అప్పు డొక చెట్టుకొమ్మను నఱికి, నీ యిచ్ఛ కనుకూలముగా కఱ్ఱను చేతువు. ఇక దేవుని పక్షమున సృష్టి వేఱుతీరున నుండును. అప్రయత్నముగా ప్రక్క ప్రక్కన భావనతోపాటు సృష్టి జరుగును. దేవునిలో భావనామయశబ్దముతోపాటు సృష్ట్యాత్మకద్రవ్యము కూడ ఉత్పన్నమగును. మానవుని విషయములో సృష్ట్యాత్మక ద్రవ్య మును ప్రకృతి అందీయవలయును. సృష్టిలోని పశుపక్షిమీనములు మొద

లయిన అన్నిటకంటెనిర్మాతగా మానవుడు మిగులశ్రేష్ఠుడు. కొన్ని జంతు
వులలో కొన్ని పక్షులలో కొంత నిర్మాణప్రకృతికలదు. కాని మానవునిలో
నిర్మాణశక్తి జంతువులలోనున్న దానితో పోల్చుటకే వీలులేనంత మహో
న్నతముగా పెంపొందింపబడినది. ఏది మంచిదో తెలిసికొను జ్ఞానము
ఏది మంచిదో దాని నాచరించు శక్తి జంతువులయందుకంటె మానవు
యందు అత్యుత్కృటముగ నున్నది. దేవునియందు నిర్మలసత్స్వభావము
మానవునియందు చాలమటుకు మలినభావము. మానవుడు చేయు పన
లన్నిటిలో కొంత చెడుగు మిళితమై యుండును. మానవునికి కూడ
కొంత సౌందర్యజ్ఞాన మున్నది. కొన్ని సుందరవస్తువులను ఉత్పాదనము
చేయు శక్తి ఉన్నది. ఇందులో కూడ ఒక పరిమితమార్గమున అతడ
దేవునిబోలి యున్నాడు. దేవుడు అత్యంతసుందరుడు, శుద్ధమైన సౌం
ర్యమును సృజించు శక్తి కలవాడు. మానవుడు సృజించు సౌందర్యముల
ఎల్లప్పుడు కొంత వికార ముండును. అందుచే మానవునికి దేవుని
భేదమును గాంతుము. దేవుడు పూర్ణముగా సత్స్వభావుడు. దేవు
పూర్ణముగ సుందరుడు. దేవుడు పూర్ణముగ సృష్టికర్త. కాని మానవు
పరిమితముగ సత్స్వభావుడు. మానవుడు పరిమితముగ సుందరుడు
మానవుడు పరిమితముగ సృష్టికర్త. ఇన్ని విధముల మానవుడు దేవు
బోలియున్నచో దేవునిచేరువకు బోవునంత యెత్తున ఆతడు తన శక్తుల
వృద్ధిబొందింప వీలున్నదా? అను ప్రశ్న రావచ్చును. ఉన్నది. మానవు
తన శక్తులను పెంచుకొన వీలున్నది. యోగము యొక్క లక్ష్య మిదియే
దేవుని యంత సత్స్వభావముతో నుండుటకు, దేవునియంత సుంద
ముగా నుండుటకు, దేవునియంత సృష్ట్యాత్మకముగా నుండుటకు, దేవు
యంత పూర్ణముగా నుండుటకు యోగము మానవునికి బోధించున
సామాన్యమానవుడు దాని పేరెత్తినచో వణకిపోవునంత మహోన్న
మైనది యోగముయొక్క ఆదర్శము. సామాన్యమానవు డిట్లనుకొనును

'పాపము చేయువాడు, వికారరూపము కలవాడు, మరణించువాడు అయిన మానవుడు దేవునివలె అంత సత్స్వభావుడుగా, అంత సుకుమారుడుగా, అంత పూర్ణుడుగా ఎట్లు కాగలడు' అని. కాని సామాన్యమానవులు యోగులు కాలేరు. అసాధారణమానవులే విధిప్రాప్తమయిన యోగపథమున నడయాడగలరు. నీ సోదరునికి చదువు చెప్పు మని నీ తండ్రి నిన్ను నియమించె ననుకొనుము. అతడు నిన్నటికంటె నేడు. నేటికంటె రేపు ఇట్లు దినదినము మంచిత్రోవకు రావలయు నని యెదురుచూచు చుందువు. నీ వేమి చేయుదువు ? అతడు శారీరకముగా దినక్రమమున బలవంతుడు కావలయు ననియు, దినక్రమమున అతని ప్రవర్తనము మంచిత్రోవకు రావలయు ననియు, నిరీక్షించుచుందువు. అట్లతడు చదువులో, నడతలో, బలములో, పెంపొందుట చూతువేని, ఒకనాటి కతడు మంచి పౌరుడుగా నాగరకసంఘసభ్యుడుగా కాగలడని తలచెదవు. అట్లే మన మొక స్త్రీ విషయమునగాని పురుషుని విషయమునగాని నిరీక్షణము సేతుమేని, దానికి మన తత్త్వశాస్త్ర మూలమైన ఆధార మున్నది. మన తత్త్వశాస్త్ర మనగా నేమి ? నిరంతరాభివృద్ధి నిరంతరసంస్కారము ఆగని ఆత్మశక్తిప్రసారము ఏది మంచిదో ఏది నిర్మలమైనదో ఏది సత్యమైనదో ఏది పవిత్రమైనదో కనుగొను సామర్థ్యము – ఇట్టివన్నియు ప్రాపంచికవిద్యావిధానమునకు లక్ష్య మయినచో యోగవిద్యావిధానము యొక్క లక్ష్య మింకెంత మహోన్నతముగా నుండవలయును? యోగము లోని సిద్ధాంతము నిర్మాణము, పునర్నిర్మాణము, అతిఘననిర్మాణము. నీ అదృష్టమును నిర్మింపుము, నీ ఆదృష్టమును పునర్నిర్మింపుము, నీ అదృష్టమును అతిఘనముగా నిర్మింపుము. నీ అదృష్టమును నిర్మింపుమనుటలో నా భావ మేమియో తెలియునా ? నైతికముగా వైజ్ఞానికముగా ఆధ్యాత్మికముగా యోచించినచో నీ ప్రవర్తనలో అనేకదౌర్బల్యము లున్నవి. జీవితములోని అన్నికోణములను పరామర్శించుటకును, నిష్ప

క్రికముగా ప్రతిదాని విలువను తూచి చూచుటకును, ఆరంభింతువేని నీ ప్రవర్తన అనేకదోషములచే దెబ్బతిన్నట్లు కనుగొందువు. ప్రతివాడును తన ప్రవర్తనలోని దోషముల నెఱుగును. ఆ దోషజ్ఞాన మతనికి లేకున్నచో అతని దేశికుడో, స్నేహితుడో, వాని నతనికి చూపించును. అతని స్నేహితునికి తప్పక తెలిసియుండవలెను. అత డతనికి వానిని చూపింపవలెను ఎట్లో తెలియునా ? మిక్కిలి మధురమైన శాంతమైన ప్రేమయుతమైన మార్గమున. ఎందుకనగా ప్రేమ అభివృద్ధికి దోహదము చేయును మనము యోగాభ్యాసము చేయుచున్న వేళ మన లోపములను దోషములను పాపములను కనుగొందుము. అప్పుడు మన మిట్లు ప్రశ్నించుట కారంభింతుము 'నేను నా ప్రవర్తనను పునర్నిర్మించుటకు మార్గ మున్నదా ?' అని. ఆత్మలోని దేశికు డిట్లు చెప్పును 'నీ ప్రవర్తనను నీవు పునర్నిర్మింపవచ్చును. నిన్ను నీవు శక్తివంతునిగా చేసికొనవచ్చును. నిన్ను నీవు సుందరునిగా ఉన్నతునిగా వివేకవంతునిగా దిద్దుకొనవచ్చును' అని. అప్పుడు నీ వొక విశిష్టవిధానముగల ప్రవర్తనను ఒక ప్రత్యేకమార్గము గల భావమును అభ్యసించుట కారంభింతువు. భావము ప్రవర్తనపై ప్రవర్తన భావముపై ప్రసరించుచుండగా కొలది కాలములో అత్మయం దొక నూతనశక్తి ఆవిర్భవించును. ఈ నూతనశక్తిని నడపించుటకు గొప్ప తెలివి గొప్ప మెలకువ కావలెను. యోగులు ఆత్మాభివృద్ధికి అద్భుతములైన మార్గము లనేకములు కనిపెట్టిరి. వాని ననుసరించుటవలన వా రంతర్గతదోషములను జయించిరి. ఈ దోషములలో కొన్ని పరంపరగా జాతినుండి సంక్రమించినవి. వ్యష్టిమానవున కీ రీతి సంక్రమించిన దోషముల నన్నింటిని సమూలముగా తొలగించుటకు చాలకాలము పట్టును. కాని ఒకసారి ఆరంభించి ఆసక్తితో సాగించుచుండినయెడల ఆ యత్నము తప్పక విజయవంతము కాగలదు. నిరుత్సాహపడిన యోగిని నే నెన్నడును చూడలేదు. ఎందుకనగా యోగియైనవాడు ప్రతివాడును తన యోగాభ్యాసకార్యమున విజయమునే పొందినాడు. అయితే నీ వి ట్లడుగవచ్చును.

'అట్లయినచో లోకమున ఇందఱు వ్యర్థు లున్నా రేమి? ఇందఱు నేరము
లొనర్చిన వా రున్నా రేమి? ఇందఱు పాపులు ఇందఱు చెడ్డవారు ఉన్నా
రేల?' అని. వినుము. వీరందఱు అనగా ఈ పాపులు ఈ దుష్టులు ఈ
వ్యర్థులు, నాశకులు; ఆత్మనాశకులు. వారు శైశవమునుండి నాశనము
తప్ప మఱియొక్కటి చేయలేదు. వారు శరీరమును మేధస్సును ఆత్మను
నాశనము చేసికొనిరి. వారి ప్రభావము హానికర మైనది. నీ వొక మంచి
పనిని చేయబోవుచున్నప్పుడు వలదని వారించిన వాడు నీ శత్రువని నిశ్చ
యింపుము. జాగ్రత్త సుమా! బీదల కొక ఆసుపత్రిని కట్టుటకు తలచు
చున్నా వనుకొనుము. ఒకడు 'వలదు. దానివలన లాభ మేమియు
లేదు. ధనవ్యయము, శ్రమపూర్ణము. ఈ పని పెట్టుకొనవలదు' అని
చెప్పబూనినచో వాని నొక శనిగ్రహముగా తెలిసికొనుము. వానిని నీవు
వీడవలెను. వా డొక నాశాత్మకుడు. ఇట్టి నాశకులు దేశమున పెచ్చు
పెరిగియున్నారు. వా రెల్లయెడల ప్రత్యక్షమగుచున్నారు. వారు తమ
గ్రామములో విరోధములు కల్పించెదరు. గ్రామమునకు గ్రామమునకు
పోరు పెట్టెదరు. జాతికి జాతికి యుద్ధములు సృష్టించెదరు. వారు నాగరి
కతకు విచ్ఛేదము కూర్చెదరు. విచ్ఛేదము వినాశము తప్ప వారింకే
మియు చేయలేరు. నిర్మాణ మొక ఆధ్యాత్మికశక్తి. ఒక సత్పురుషుని
ఆత్మలోని దివ్యశక్తి. అతడు చేసిన నిర్మాణమును బట్టి సత్పురుషుని
కనుగొనుము. మంచిని కనుగొనుటకు మఱియొక త్రోవ లేదు. మంచి
వాడని నిర్ణయించుట కింకొక బాట లేదు. కాలము దేనినికూడ విచ్ఛేదము
చేయదు. కాలము సర్వమును నాశనము చేయునను వాదము తప్పు. నాశ
నము చేయువాడు మానవుడు. ఒక మానవు డొక సుందరమైన భావము
నూహించును. ఒక శతాబ్దము పిమ్మటనో ఆపైననో అదొక మతముగా
సిద్ధ మగును. వేలకొలది జనులు ఆ ఒక్క భావమునుండి [illegible]
పహించెదరు. మఱి యొకడు బయలుదేరును. నిర్దయముగా ఆ మత

మును అపనిందపాలు చేయును. హింసాత్మకము వినాశాత్మకము అయిన ద్వేషము వ్యాపింపజేయును. అందుచే ఈ జీవితములో నిర్మాణము ఆదర్శముగా గల వారికిని ధ్వంసము ఆదర్శముగా గల వారికిని మధ్య నిరంతర సంగ్రామము సాగుచున్నది. యోగము కేవలము నిర్మాణము. నిజమైన యోగి దుర్మార్గముతో నైనను పోరాడడు. సంతతము సదంబర నిర్మాణము నందే నిమగ్నమై యున్నచో దుర్మార్గము తనంతటతానే కూలి పడిపోవు నని అత డెఱుగును. ఇది విశ్వశాసనము. మన కే మతముతో గాని ఏ జాతితో గాని ఏ దేశముతో గాని పోరాటము లేదు. ఎందుకో తెలియునా ? చెడుగు అనునది రాత్రియొక్క తుదిగడియలోని చీకటి. మంచి అను ఉదయభానుని జ్వలత్కిరణప్రసారమునకు ముందు అది మాసిపోవలెను. అందుచే యోగి నిరంతరభక్తితత్పరుడు, నిరంతరధ్యానమగ్నుడు, నిరంతరము తనను సృజించిన మహాసృష్టికర్తను మననము చేయువాడు. ఈ ప్రకారము యోగవిధానమున తన దోషములను ఉన్మూలింపజేసికొనుటచే, దేవుని మహాగుణములను జీర్ణముచేసికొనుటచే, యోగి దేవుని సింహాసనము దరికి జేరును. కావున నిన్ను నీవు నిర్మించుకొనుటకు, నీ ప్రవర్తనను పునర్నిర్మించుట కొఱకు, సద్భావ మను పునాదిపై నీ దేశము యొక్క పునర్నిర్మాణము చేయుటకొఱకు, నీ మనస్సులో నిశ్చయించుకొనుము. సద్భావమును పునర్నిర్మించుటకంటె మోక్షము లేదు. నీ వి ట్లడుగవచ్చును 'సద్భావము నెట్లు తెలిసికొందుము ? సద్భావము నెక్కడ నేర్చుకొందుము ? సద్భావ మెచ్చటను కనబడుట లేదే' అని. అందుకు నా సమాధాన మిది 'సద్భావ మెచట కనబడునో ఆ తావు నిదివరకే చెప్పితిని. దేవుడు సత్స్వభావుడు. నీవు నిరంతరము దేవుని ధ్యానింతువేని, ఆయన సద్భావము నీ ఆత్మను స్పృశించును. ఒకానొక రాత్రివేళ నీవు నిద్రించుచున్నప్పుడు ఆయన నీ తలను తాకును. నీవు సద్భావ ప్రభాభాసమానుడవై మేల్కాంతువు. స్వర్గమర్త్యలోకము లందలి దేవత

లందఱు ఆనందముతో జగద్ధ్రిప్యజాత మంతటిని తెచ్చి నీ యుం దుంచె దరు. నీవు స్వర్గనిర్మాణమువంటి నిర్మాణమును చేయవచ్చును. జీవితము లోని మహారహస్య మిది. ఈ మాంసమయజీవితము వెనుక, ఆత్మ యొక్క మహాజీవిత మున్నది. అది పిడుగువలె బలము కలది. సము ద్రమువలె విశాలమైనది. నీవు ప్రతిదినము ఆ శక్తి ఆ దివ్యశక్తి ఆ ఆ దివ్యజ్యోతి సమీపమునకు రమ్ము. ప్రతిరాత్రి ఆ శక్తిచెంతకు ఆ జ్యోతిచేరువకు వచ్చుచున్నానని నీకు నీవే చెప్పుకొనుము. నీ అంతర్బ హిర్జీవితమును మలిన మొనర్చిన నీ దోషములు శిశిరఋతువునందలి పండు టాకులవలె రాలి పడిపోవుచున్న వనియు, ఒక నూతనవసంతము వేవేగ నీ ఆత్మలోనికి చొచ్చుకొని వచ్చుచున్న దనియు, నీ జీవితము వసంత వృక్షమువలె చిగిర్చి పూచి ఆకసము నలుదిక్కులనుండి వన్నెవన్నెల పిట్టలను కలకూజితము లీను శకుంతములను ఆహ్వానించుచున్న దనియు దినదినము గమనింపుము.

యోగివి కమ్ము. ఉత్తమములు ఉన్నతములు అయిన వాని నెల్ల ఆసింపుము. ఈ తమోమయప్రపంచమున ఆత్మకు సుఖ మిచ్చున దేదియు లేదు. కోలారుగనులలోని సువర్ణ మెల్ల ఆత్మకు సంతోషమును కలుగ జేయలేదు. ఆత్మలోని అనంతైశ్వర్యమును విప్పి చూపని ఏ విజ్ఞానము గాని నేను అభ్యసింప గోరను. మనము ఆత్మాన్వేషకులము. డస్సి పోయిన ఈ జగమును మార్చు టెట్లు? పాపముతో నిండిన ఈ జగమును తిరిగి బాగుచేయు టెట్లు? ఒకరి నొకరు సంతతము ద్వేషించుకొనుచున్న చంపుకొనుచున్న ఈ నానాజాతుల మానవులు తిరిగి ఏక మగుటెట్లు? తిరిగి ఏకకుటుంబ సభ్యులగు టెట్లు? ఇది మన విచారము. మనతో చేరువారు పునర్నిర్మాణప్రతిజ్ఞను గైకొనవలెను. ఒక సుఖమయమైన భోగపూర్ణమైన జీవితమును గడపుట గాని, ప్రొద్దుపొడుపున వన్నెవన్నెల బుడగలవలె ప్రొద్దులు పుచ్చుట గాని వారి పని కారాదు. వారిది తీవ్రప్రయత్నముతో

కూడిన జీవితము. త్యాగముతో కూడిన జీవితము. కఠినమైన ఏకాంతగిరిపై తుపానులో ఒంటరిగా లేచి నిలిచి ప్రకాశించు ప్రదీపస్తంభమువంటిది వారి జీవితము. ప్రతిదేశము ప్రపంచములో ప్రజల నెల్లరిను పిలిచి ఇట్లు చెప్పగలదు 'సోదరులారా ఇటు రండు. ఏకతయొక్క ఆత్మయొక్క వైభవమును గాంచుడు. మీ విభేదములను మీ దుఃఖములను మఱచి పొండు. ప్రేమభానూదయకాంతులలో వినోద మొందుడు 'అని. నీ శక్తిని అంత ఉన్నతశిఖరమునకు ఎత్తగలిగినచో, 'నా క్షేమియు వాంఛింపను. దేవుడు నా కిచ్చిన దానిని ప్రపంచక్షేమమునకు వినియోగించెదను. నేను నా కాలమును నా పదవిని నా క్రియాశక్తిని ప్రపంచమును సంస్కరించుటకును ప్రజలను ధర్మమార్గప్రవర్తకుల నొనర్చుటకును అర్పించెదను' అని నీవు చెప్పగలిగినచో, యోగిబృందమంతయు నిన్నాహ్వానించును. ఒకనాడు వారు నీతో ఇట్లందురు 'ఇదుగో, ఇక్కడ మన వంటివాడొక డున్నాడు. ఇతడు మన బాధలను పంచుకొనును. మనతో పాటు విలపించును, మనవలె చక్రమునకు బుజమొడ్డి ముందునకు త్రోయును' అని. ఈ వర్గ మిట్టిది. ఇది యోగజీవితము. ప్రపంచమునకు విమోచనము కలిగించుట మనవంతు. ఎట్లు ? ఇంత బ్రహ్మాండమైన పని నెట్లు నిర్వహించుట ? ఇంత పట్టుదల గల ఆత్మకు విధానములు సాధనములు దొరకకుండవు. ఆవిష్కరణమే మహాత్మయొక్క స్వభావము. ప్రకృతి తన రహస్యముల నన్నిటిని బయటపెట్టును. దాని విచిత్రధర్మముల సహాయమున అసాధ్యముగ కన్పట్టు దానిని సాధింపగలము. అసాధ్యము సాధించుట ఇంద్రజాలము. యోగములో మహేంద్రజాలమిది. భూలోకమునుండి నాకలోకమున కొక బాటను నిర్మింతుము. మానవు లాబాటపై నడచిపోయి స్వర్గమును చేరుదురు. దీనిని భావించుటయే సామాన్యమానవుల కసాధ్యము. కాని, నీ పూర్వజన్మలను నీవు స్మరింపగలవేని, అనేకజన్మలకు ముందున్న విషయమును నీవు స్వప్న

మున వినినదానిని స్మరింపగలవేని, ఈ పృథివియొక్క చరిత్రలో స్వర్గ మున కొక ఆకాశమార్గ మున్న కాలము ఒకటి ఉండెనని నీ స్మృతికి వచ్చును. నీ వది మఱచితివా, మిక్కిలి విచారకరమయిన విషయము. నీవు పథనిర్మాతవు కాలేవు. అప్పుడు నీలో ఆ వీథియొక్క స్మృతిని మేల్కొల్పుట కడు కష్టము. ఈ ప్రపంచముయొక్క చరిత్ర ఈనాడు మనము చూచుచున్నది కాదు. ఈ ప్రపంచముయొక్క ఆనాటి గతము దివ్య మైనది. భవిష్యత్తు అంతకంటెను దివ్యతరముగా నుండవలె నని మనము పాటుపడుచున్నాము. నీ హృదయము పరిశుద్ధమైన క్షణమే, నీ హృదయము యోగిబృందముయొక్క హృదయముతో ఏకీభావమును పొందిన తత్క్షణమే, నీకు రోమాంచము కలుగును. ఒక నూతనశక్తి నీ శరీరమును ప్రవేశించును. ఒక నూతనదృష్టి నీ కనుల కబ్బును. ఆ క్షణ మునుండి నీవు పునర్జన్మ మెత్తుదువు. ఆ క్షణమునుండి ఈ జన్మలో చూడని వానిని, కోట్ల సంవత్సరముల క్రిందటి వానిని. నీ స్మృతినేత్రము నీ అంతర్నేత్రము చూచిన వానిని, నీ కన్నులు చూచును. ఆ స్మృతి నేత్రమును ఆ ఆత్మనేత్రమును విప్పుటకు ప్రయత్నింపుము. అది విచ్చెనా, వ్యాధి యుద్ధము దుఃఖము విచారము లేని కాల మొకటి ఉండి నట్లు నీవు చూడగలవు. ఒక్కసారి నీ విది చూచినచో నీవు పూర్ణ హృదయముతో పనిచేయగలవు. నీ శరీరములో బంధింపబడి స్తబ్ధముగా నున్న శుద్ధశక్తులు విముక్తములై ప్రపంచవిమోచనమునకు పాటుపడు చున్న యోగిబృందమునకు తోడుగా పనిచేయును.

గుర్తుంచుకొనుము. ఈ పనిని నిర్వర్తింపనిదే ఈ జీవితమునకు విముక్తి లేదు. ఈ సమస్తవిశ్వము నీలో ఒక విభ్రాంతిని ఒక ఆశ్చర్య మును రేకెత్తించుటకు యత్నించుచున్నది. అది పూర్ణవికాసమును పొందెనా, అప్పుడు నిన్ను కార్యరంగములోనికి త్రోయును. ఈ ప్రపంచ విమోచనమున కైన మహాయుద్ధరంగమున నీ వ్యక్తిత్వమును ఉపయో

సంప్రము. మనఃపూర్వకముగా నిన్ను నీవు ఈ మహాకార్యమున నర్పించు కొందువేని, నీ ముక్తి సులభసాధ్యము. స్వయముగా ఆత్మార్పణము చేయుటకంటె దివ్యమైనది ఇంకొకటి లేదు. శిష్యులనుండి మేమాశించునది ఇదియే — స్వయ మాత్మార్పణము. ఈ అర్పణము ఈ త్యాగము చేతనే మనము విశ్వములోనున్న అమృతత్వమును తొంగిచూడగలము. ఈ విశ్వామృతత్వము అర్పితమైన మన ఆత్మను సాధనముగా గొని ఒక నూతన ప్రపంచమును సృష్టిచేయును. ఎందఱు వ్యష్టిమానవులు తమ ప్రత్యగాత్మలను అర్పణము సేతురో అన్ని ఉత్తమలోకములు మూల ప్రకృతిగర్భమునుండి ఆవిర్భవింపగలవు. నీ వల్పుడవని అనామకుడ వని నీ త్యాగమునకు విలువ లేదని నీ వెన్నడును తలపకుము. ప్రపంచ క్షేమమునకైన నీ త్యాగము ఒక దేవదూతత్యాగమంత అర్థవంతము, ప్రధానము. త్యాగమే వింతగా రూపపరిణామమును బొంది స్వర్గమైనది. ఈ జీవిత మెందుకు? ఇది ఉద్దేశింపబడినది త్యాగము చేయుటకు. ఎప్పుడో తెలియునా? పరిశుద్ధి వహించి ఘనత నొంది దివ్యమహిమ ఆవిష్టమైన పిమ్మటనే సుమా. అంతకు ముందు కాదు. అది పూర్తి నొందిన పిమ్మటనే అంగీకృత మగును. కాలములోని ప్రతిక్షణములో ఒక్కొక్క శ్రుతి మూతవడి యున్నది. స్వయముగా ఆత్మార్పణము చేసిన వారే ఆ క్షణమును తెఱచి ఆ శ్రుతిగ్రంథమును పఠింపగలరు. నీ పేరా గ్రంథమున వ్రాయబడి యున్నది. ఆ పేరు నిన్నుద్ధరింపగలదు. అది దేవునకు తెలియును. దేవుని భావనవలె ఆశ్చర్యకరమైన దానినిగా తన భావనను మానవుడు పెంచుకొనినచో అత డెంతటి మహాకార్యములు చేయునో గదా! ఆలోచించుకొనుము. భావనను వృద్ధిచేయుటకు గల నియమము, త్యాగబుద్ధిని పెంచుకొనుటకు గల వీలును, విచారించుకొనుము. అట్లు చేయుటలో కృతార్థుడ వగుదువేని, నీవు నీ జీవితమును వ్యర్థము చేయలేదని గ్రహింపగలవు.

# సందేశము

ఈ జగత్తు నందలి సమస్తపదార్థములు ఆవలినుండి వచ్చు సందేశములను వహించునవి. మన జీవితమున కొక విధ్యుక్తమున్నది. ఆ సందేశములలోని ఆజ్ఞలను పాలించుటచే విధి నిర్వర్తింపబడును. బలము సమకూడును. మానవుడు ప్రార్థనామూర్తి. విషయము లా ప్రార్థనల కనుగుణములుగా నుండును. ప్రార్థనలు పరిణమించునట్లే అవి పరిణమించును. బ్రతికిన వా రున్న లోకమునకు చచ్చిన వా రున్న లోకమునకు ఒక సంబంధ మున్నది. ఆ సంబంధ మా సందేశములచే వ్యక్తమగును. మన మీ సందేశములపై జీవించుచున్నాము. మృత్యనంతరజీవితమును గూర్చిన ఊహ కాధారము మన కీ సందేశములలోని విశ్వాసము. పర్వతములు వృక్షములు నదులు మేఘములు సముద్రములు— ఇవి మధ్యవర్తులు. పరలోకమునుండి వచ్చు సందేశములను స్వీకరించు కేంద్రములు. మన హృదయమునకు తృప్తిని గూర్చునట్టి మన ఆశకు బలము నొదవించునట్టి మతము, దేవదూతలనుండి వినిపింపబడిన బ్రహ్మవాక్కు. సంఘటనలు సూచించు సందేశములను సమన్వయము చేయ నెఱిగిన వాడే వివేకి. నక్షత్రములు వాయువు పృథివి అగ్ని జలము— ఇవి అన్నియు అందించు సందేశములను సమన్వయము చేయుటకే శాస్త్రములన్నియు ప్రయత్నము చేయుచున్నవి. సోదె చెప్పుట మంత్రవిద్య జ్యోస్యము మొదలయిన పేర్లతో నున్న వన్నియు పూర్వకాలమున తత్సందేశములను పఠించుటకైన అపరిష్కృతపద్ధతులు. ఇప్పుడు శాస్త్రము గణితమార్గమున సమన్వయము చేయుచున్నది. భావనయందు ప్రతిబింబించిన ఆ సందేశములను తత్త్వము పఠించి సమన్వయించి చెప్పుచు

న్నది. ఈ ప్రకారము మనఃప్రకృతుల మూలమున అందింపబడిన సందేశములను విడదీసి చెప్పగలుగుటలోననే మానవుని శ్రేష్ఠత్వము స్పష్టమగుచున్నది. ఈ సందేశములలోని అర్థమును తాత్పర్యముచేసికొనుటలో కృతార్థుడు కానియెడల మానవుడు యుగములక్రిందట తానున్న స్థితిలో అనగా పశుస్థితిలోననే ఉండెడివాడు. కావున మనము వానిని పఠించుట నేర్చుకొనవలయును. మనము వానిని పఠించుటపైననే మన జీవితము సర్వము ఆధారపడి యుండుటచే ఆ సందేశములను సరిగా పఠించుట మనము నేర్చుకొనవలయును. ముందుగా సూచింపబడుటచే మనకు రాబోవు ఆపదలను మృత్యువును తప్పించుకొనగలము. ఈ సూచనల నిచ్చున దెవరు? ప్రకృతి, మనస్సు అవి స్వప్రమాణమున నిచ్చుట గాదు. వానికంటె వివేకవంతములైన శక్తుల చేతులలోని సాధనములై యిచ్చుట. సాధారణముగా ఈ సందేశము మఱియొక ప్రాణి నుండి వచ్చును. చూడుము. నీ శత్రువు నిన్ను సర్వనాశనము చేయుటకు యుక్తిని బన్నుచున్నాడు. అదే కాలమున ఆ శత్రువుయొక్క సంకల్పముల నెఱిగిన నీ స్నేహితు డొకడు నీకు ముందుగా సూచన చేయును. నీ స్నేహితు డిచ్చిన సందేశములోని కీలకమును గ్రహించుటపై నీ క్షేమము ఆధారపడియున్నది. ఒక పెద్ద తుపాను రాబోవుచున్నది అను సూచన వచ్చిన దనుకొనుము. ఆ సందేశము మన కందినప్పుడు, నిజముగా తుపాను వచ్చు వేళకు మనను మనము రక్షించుకొన గలుగుటపై మన క్షేమ మాధారపడియున్నది. ఇట్లు ఈ సందేశములను మనము పఠింపగలుగుట ఎంతైనను ఆవశ్యకమై యున్నట్లు చూచుచున్నాము. ఇచట ఒక ప్రశ్న కలుగును. 'వీనిని మన మెట్లు సరిగా పఠింపగలము?' అని. యోగములో దీని కొక ప్రధానవిధానము కలదు. అది చిత్తైకాగ్రత. ఒక మానవుడు తన చిత్తమును దీర్ఘకాలము ఒకే విషయమునందు మాత్రమే ఏకాగ్రము చేయగలుగు నెడల, అది చెప్పవలసిన దంతయు

చెప్పును. దాని నతడు గ్రహింపగలడు. మఱి యే విధానమున నైనను అర్థముకాని విషయములను అత డర్థము చేసికొనగలడు. ఒక వస్తువు దూరమునం దున్నప్పుడు దానిపై ఏకాగ్రత ఎట్లు సాధ్య మగునని నీ వడుగవచ్చును. మన ఇంద్రియములు ప్రసరింపగల దూరములోపలి విషయములను మనము తెలిసికొనగలము. మన ముందున్న బల్లపైగాని షున మున్న గదిలోగాని గల వస్తువులను గూర్చి పరిశీలింపగలము. కాని, దూరమందున్న వస్తువులపై దూరమందున్న వారిపై మన చిత్తము నెట్లు ఏకాగ్రము చేసి నిల్పగలము ? అట్లే కాలముచే వ్యవధానము కలిగినప్పుడు ద్రవ్యము చిక్కు చిక్కుగా నుండును. (1) కాలవ్యవధానము (2) దేశవ్యవధానము (3) వస్తువే అస్పష్టముగా నుండుట. ఈ మూడు విధములయిన చిక్కులను అతిక్రమించుట కష్టము. మన ఇంద్రియ ప్రసారపరిమితికి ఆవల ఏమున్నదో దానిని స్పష్టముగా గ్రహింపగల శక్తి మన మనస్సున కున్నదా ? అనునది ఒక ప్రశ్న. మనస్సునకు, లోతుల నున్న మనస్సునకు మూడు లక్షణము లున్నవి (1) అంతటను వ్యాపించి తదనేకవిశేషములను గ్రహించి లోగొను శక్తి (2) దూరప్రయాణశక్తి (3) కేంద్రమునకు దెచ్చు శక్తి. మొదటిదానిచేత అనగా వ్యాపకశక్తిచేత మనస్సు ఆకాశములో ఏమున్నదో గ్రహింపగలదు. ఎందుకనగా ఆకాశమే వ్యాపకద్రవ్యము. భావనకు గల సహజమైన అంతర్జ్ఞానముచేత ఆకాశములో ఏమున్నదో గ్రహింపగలదు. రెండవది, మనస్సున కున్న దూరప్రయాణశక్తిచేత కాలములో నేమి జరుగునో అనగా భవిష్యత్కాలములో ఏమి సంభవించునో దానిని గ్రహింపగలదు. సమస్తమైన సంగతులు జరుగబోవుటకు ముందు కాలగర్భములో తమ బింబముల నేర్పఱచును. ఆ సూక్ష్మమైన చిత్తరువు, ఇరువది సంవత్సరముల పిమ్మట జరుగబోవు దాని చిత్తరువు, కాలపురుషుని చీకటిగదిలోనికి పంపబడినది. మనస్సు తన దూరప్రయాణశక్తిచేత ఆ చిత్తరువును చూడగలదు.

మూడవది. మనస్సు తన కేంద్రమునకు తెచ్చు శక్తిచేత ఆ వస్తువు యొక్క అస్పష్టతను విడదీసి అర్థము చేసికొనగలదు. మనస్సుయొక్క ఈ కేంద్రీకరణశక్తి అనగానేమి? మనఃకిరణముల నన్నింటిని ఒక చోటికి తెచ్చి ఒకవస్తువుపై ఏకాగ్రము చేయుట. ఈ శక్తిచేత అస్పష్టముగా నున్న దానిని మానవుడు స్పష్టముగా చూడగలడు. అతడెంత సూక్ష్మాతిసూక్ష్మమైన దానినైనను చూడగలడు. ఈ మూడు శక్తులను నీవు వృద్ధిచేసికొనినప్పుడు దేశసంబంధమైన దూరమున నున్నదానిని, కాలసంబంధమైన దూరమున నున్నదానిని అస్పష్టమైన దానిని చూడగలవు. ఈ జ్ఞానము లభించు విధానమునకు చిత్తైకాగ్రత అని పేరు. ఇక్కడ ఒక విషయము చెప్పవలసి యున్నది. ఈ చిత్తైకాగ్రత అను శక్తిని వృద్ధిచేయుటకు శ్వాసను శరీరచలనమును రక్తములోని వేగమును ఉష్ణోగ్రతను నిరోధించుట నేర్చుకొనవలయును. హృదయము శ్వాసకోశములు తీవ్రముగా పనిచేయును. భావములు తెగ తిరుగుచు పోవుచుండును. చిత్తైకాగ్రతను నేర్చుకొనుటకు ఇంద్రియము లిచ్చు జ్ఞానము ఆధారము కాదు. సామాన్యమానవునకు పంచేంద్రియములు త్వక్చక్షు శ్రోత్రజిహ్వాఘ్రాణములు సర్వజ్ఞానమును అందించును. యోగి ఈ పంచేంద్రియములను స్తబ్ధముచేయును. అనగా తటస్థములనుగా నుంచును. అప్పుడు మనస్సుయొక్క సహజమైన అంతర్జ్ఞానము ఉదయించును. అప్పుడు విషయములను, అతీంద్రియవిషయములను ఇంద్రియములచేత చూడబడలేని వానిని గ్రహింపవచ్చును. మన ఆత్మ తెలిసికొనగోరినదంతయు చిత్తైకాగ్రతాశక్తిని వృద్ధిచేసి తెలిసికొనవచ్చును. మరణానంతర మేమి సంభవించును? ఈ జన్మకు ముందు మన స్థితి యేమి? సూర్యచంద్రనక్షత్రముల రహస్య మేమి? ఇట్టి ప్రశ్నల కన్నిటికి సమాధానములు పైవిధానమున పొందవచ్చును. మనస్సునకు వెలుపల నున్న విషయములను తెలిసికొనుటకు మనసునకు వీ లెట్లు కలుగును? ఎట్లనగా,

భౌతికవిషయము లన్నియు మనసునుండి వచ్చినవే. వాటికి మూలము ఈ రహస్యద్రవ్యమైన మనస్సు. తుద కవి అన్నియు మనస్సులో విలీన మగును. ఈ తత్త్వము ననుసరించి భౌతికములకు మానసికము మూలము. మానవుడు నైతికముగా జీవింపని యెడల ఈ అద్భుతమైన శక్తిని వృద్ధిచేసికొనలేడు. నైతికశక్తులయిన న్యాయము నిగ్రహము దానము ధర్మము మొదలయినవి ప్రజాసహాయార్థమై ఉద్దేశింపబడినవి గనుక వానిని పెంపొందించుకొనవలెను. హిమవత్పర్వతములలో ధ్యాననిష్ఠాగరిష్ఠులై కూర్చుండు యోగులు ఏ బాటసారి దారి తప్పినను, ఏ పాంథుడు ఆపదలో నున్నను, ఏ యాత్రికుడు వన్యమృగములలో చిక్కినను, తమ మానసికశక్తిచే గ్రహించి వారికి సహాయమందిచ్చి క్షేమమును కూర్చెదరు. నామట్టుకు నేనును దారితప్పి చిక్కువడి వారి కరుణచే ఆపదలు గడచి, త్రోవకు వచ్చితిని. ఆహారము, ఆశ్రయము దుర్లభమై నే నల్లాడు స్థితిలో వారి దయచే నాకు రెండును లభ్యము లైనవి. ఈ మహాత్ములు వారి యేకాంతగుహాలలో నివసించుచు లోకుల సహాయముకొఱకు లోకుల విపన్నివారణముకొఱకు తమ యావజ్జీవితములను వినియోగించెదరు. నీవు నిజముగా విశ్వసనీయముగా లోకసహాయముచేయు కోటిక కలవాడ వైనచో ఈ శక్తులను వృద్ధిచేసికొనగలవు. ముందుగా నీ కింకొక విషయము చెప్పవలసి యున్నది. ఈ శక్తులను అభ్యసించి లోకమునకు అపకారము కూడ చేయవచ్చును. కేవలము లోకమును హింసించుటకే ఈ శక్తుల నభ్యసించువారు కలరు. కాని లోకమునకు అపకారము చేయువారు తమ నాశనమును తామే తెచ్చికొనినవా రగుదురు. ఈ శక్తులను దుర్వినియోగము చేయువారు సర్వనాశనమును పొందుదురు. దేవు డీ అద్భుతశక్తులను మన కెందు కిచ్చినాడు ? వాని వినియోగముచే ఆయనను సంతోషపెట్టుటకు, ఇతరులను ఆయన సన్నిధానమునకు జేర్చుటకు. మన లక్ష్యము మానవుని ఆధ్యాత్మిక

జీవునిగ జేయుట, స్వార్థమును, భౌతికభావమును నిరోధించుట, అయి యుండవలెను. ఈ మహాశాస్త్రము ప్రపంచములోని కవతరించినది మానవానీకమును ఆత్మోన్ముఖమునుగా జేయుటకే సుమా. మానవులను మృత్యువు నుండి రక్షించుటకు, మరణాధికమైన శిక్షలనుండి తప్పించుటకు, యోగ మాచరణలోనికి వచ్చినది. చిత్తైకాగ్రత అను శక్తి మూలమున మానవుడు ప్రకృతిని వన్యమృగములను అదుపులో నుంచ గలడు. వ్యాఘ్రములు, సింహములు, రాబందులు, డేగలు ఈ శక్తిచే పూర్తిగా కట్టుబడును. వానిలో సద్భావమును ప్రవేశ పెట్టవచ్చును. జంతువులను ఆధ్యాత్మికపరిధికి లేవనెత్తుట మానవుని మహావిధులలో ఒకటి. మానవు లందఱు ఒకరి నొకరు సోదరునిగా పాటించు కాలమే కాక, జంతువులు సైతము ఒకదాని నొకటి హింసింపక వర్తించు కాలము ముందు రాగలదు. యోగు లీ గోళములోని ఆకాశము యొక్క, వాయువు యొక్క జలముయొక్క గుణములను మార్చుటకు శ్రమపడుచున్నారు. ప్రతిది స్వయంస్థితి గలది, స్వయంపోషణ గలది, స్వయం రక్షణ గలది యగుట వారి లక్ష్యము. అట్లయినచో ఒకదాని కొకటి ఎర కాజాలదు. ఈ విశ్వ మిప్పుడు 'ఎర' అను ధర్మముతో పాలింపబడు చున్నది. ఈ ధర్మము ప్రకారము బలవంతులకు దుర్బలు లెర యగుదురు. బలముగల జాతులు బలహీనజాతులను పాలించును. బలవన్మృగములు బలరహితజంతువులను చంపి తినును. ఇదంతయు ఎందుచేతననగా మానవుని హృదయమున 'అన్యాయము' అను భావము అగ్రపీఠమును వహించి యున్నది. ఈ బలపాలకధర్మము తప్పు అని మానవులు గ్రహించునట్టి నూతననాగరకతను తీసికొనివచ్చుటకు మన ప్రయత్నము. ప్రతిదానికి అనుభవమున్నది. దేనియొక్క అనుభవము? బాధ యొక్క అనుభవము. బాధానుభవమే జీవము యొక్క ముఖ్యలక్షణము. ఎక్కడ జీవ మున్నదో – అక్కడ బాధ యొక్క చైతన్య

మున్నది. కావున జీవ మనగా చైతన్య మని నిర్వచనము చేయవచ్చును. సాక్షాత్తుగా బాహ్యముగా కన్పట్టు బాధ మనకు లే దనియు, మనము స్వేచ్ఛగా నున్నా మనియు ఎంత అనుకొనినను, నిజముగా చూచినచో మనము బాధపడుచునే యున్నాము. ఈ పృథివిపై మనము అంటిపెట్టుకొని యుండుటకు, వాయువు మన శ్వాసకోశములపై అధోముఖమున ఎంత ఒత్తిడి తెచ్చిపెట్టుచున్నదో, చలి వేడి మన శరీరము నెంత పీడించుచున్నవో, బాగుగా ఆలోచించి చూడుము. మన శరీరములోని ప్రతి జీవకణము అనుక్షణము బాధానుభవమును పొందుచున్నది. మన సంఘజీవనము బాధామయనరకము. మానవు లొకరి నొకరు సంశయించుచున్నారు. ఒకని జూచి యింకొకడు భయపడుచున్నాడు. ప్రతిమానవుడింకొక మానవునికి బలవద్విరోధి. ప్రతి జాతియు తన ప్రక్కవారికి బలవద్విపత్తు. ప్రకృతి వ్యష్టిమానవునే గాక సమష్టిమానవుని, సమస్త మానవజాతిని సంతతము భయపెట్టుచున్నది. యథార్థముగా చూచినచో సర్వులు భయముతో బ్రతుకుచున్నారు. జీవితరంగమునుండి ఈ భయమును ఈ బాధను పారద్రోలుటయే యోగము యొక్క లక్ష్యము. కాని అది యెట్లు? ప్రతిపక్షములను భావించుట దీనికి మార్గము. ఇది శాస్త్రోక్తము. లోభగుణముగల వాని నొకని నీ వెఱిగినచో అతని బుద్ధిపై దానభావమును నీ చిత్తములో ఏకాగ్రముగా నిలుపుము. ఒకడు విపత్కరమైన పన్నాగములను పన్నుచున్నా డని నీకు తెలిసినప్పుడు అతని బుద్ధిపై ప్రేమభావమును కేంద్రీకరింపుము. క్రూరుని హృదయము తారుతో పూయబడిన రత్న మనుకొనుము. ప్రకృతి సంబంధమైన మహా విపత్తు రాబోవుచున్నదని తోచినప్పుడు ఆకాశమున శాంతభావమును ఏకాగ్రముగా నిలుపుము. ఇట్లు చేయుచుండగా కాలక్రమమున నీ మనసున కెట్టి శక్తి కలుగునో తెలియునా? నీవు కల్లోలములను ఆపగలవు. తుపానులను నిగ్రహింపగలవు. మానవుల కామక్రోధములను అరికట్ట

గలవు. అందుచే తార్కికమైన విధాన మేమనగా నీ వ్యక్తిత్వముతో నీ వారంభము చేయవలెను. యోగవిద్యార్థి మొదట తన కామక్రోధము లను తన లోభమును తన ఆశను తన అహంకారమును తన ఈర్ష్యను తన గర్వమును అరికట్టుట నేర్చుకొనవలయును. అట్లే శరీరమును వ్యాధి గ్రస్తమగు అవకాశమును నిగ్రహింపవలెను. శరీరమును వ్యాధి స్పృశింపనట్టి విధమున నిత్యాభ్యాసము చేయుచు స్థితప్రజ్ఞుడు కావలెను. ఈ ఆరంభదశయందు సైతము క్రూరకర్మ డెవ్వడును దుష్టబుద్ధి యెవ్వ డైనను తన చెంతకు రాకూడదని దృఢబుద్ధితో వాంఛింపవలెను. ముఖ్య ముగా పురుషుడు స్త్రీ విషయమున, స్త్రీ పురుషవిషయమున జాగరూకత వహింపవలసియున్నది. స్త్రీ పురుషులు చేరుట యోగపథమున వినాశ కరము. స్త్రీల ఆకర్షణలకు వశులగు పురుషులు యోగాభ్యాస మొనర్చు టకు అర్హులు కారు. అట్లే స్త్రీలు సయితము. అనగా స్త్రీ పురుషుని, పురుషుడు స్త్రీని ద్వేషింపు మని కాదు. ఒకరి ఆకర్షణలకు ఇంకొకరు వశము కాక స్వీయాత్మను పరిశుద్ధముగా నుంచుకొనుట ప్రధానము. ఆడదాని హావభావములకు లోనై ఆమె చెప్పుచేతలలో ఎవ్వ డుండునో వాడు ఆదాము అవ్వల తోటలోని నాటకమును తిరిగి ఆడబూనినా డని అర్థము. స్త్రీని గౌరవింపుము. కాని ఎట్లు? అమెలోని దుష్టసంకల్పము ఆమెలోననే ప్రతిబింబించి తన నిజమైన ఆత్మశక్తిని జగన్మాతృశక్తిని ఆమె గుర్తించునట్లు పురుషుడు చేయవలెను. శరీరభ్రాంతి మిక్కుట ముగా గల స్త్రీపురుషుల బారినుండి తప్పుకొనుము సుమా. వారి దైహిక భావములు నీ ఆత్మను క్రమ్మి నీ భావములను దేహసుఖము వైపునకు మరలింపగలవు. తనవైపు మానవుడు చూడవలెనని దేవుని కోరిక కాని, అందులకు మారుగా అతడు దేవునికొమార్తె వైపు చూపుప బఱుపుచున్నాడు. శరీరమును ఆత్మకు బానిసనుగా ఒనర్చిననే నైతికశక్తుల వృద్ధి నొందగలవు. ఈ జీవితములో గల కొలది సంవత్సరములన

నీవు ప్రజాసేవకు వినియోగింప గోరుదువేని నీ శరీరమును దేవునికి బానిసనుగా చేయవలెను. ఒకసారి నీవు దేవునకు నీశరీరమును అర్పించితివేని అదిమొదలిక నీ శరీరమును నీవు సేవించుటకు తలచుటకు అలంకరించుటకు అధికారమును కలిగి యుండవు. ప్రతిదినము ప్రాతస్సాయంకాలములయందు నీ శరీరముతో ఈ విధముగా చెప్పుము — 'ఓ దేహమా ! నీవు దేవుని బానిసవు. నీవు దేవుని బానిసవు సుమా' అని. ఆ మాట నీ దేహము వినును. ఇప్పుడు నీ ఆత్మ దేహమునకు బానిసగా నున్నది. కాని నీవు ప్రతిదినము నీ ఆత్మతో నిట్లు చెప్పుము ఓ 'ఆత్మా ! నీవు దేహమున కధినేతవు. దానిని దేవుని సేవించుటలో ప్రవేశపెట్టుము' అని. 'దేహము ఆత్మ రెండును ఎల్లప్పుడు దేవుని ఆజ్ఞలకై వేచియుండవలెను. మహానియమనిగ్రహములచే గాని దేహము దేవునికి బానిస కాజాలదు. అప్పుడే మనము ఆవలినుండి మనకై వచ్చుచున్న సందేశములను పఠింపగలము. ఎట్టి సందేశములు ? మన ఆత్మయొక్కయు మానవానీకముయొక్కయు విమోచనముకొఱకు దేవుః నుండి వచ్చు సందేశములు.

# త్యాగము

వ్యష్ట్యాత్మ లన్నియు కలిసి, దివ్యమైన సూర్యుడు అను జ్యోతిః కేంద్రముచుట్టును కాంతిమండలముగా నేర్పడును. ఆత్మప్రపంచమునకు కేంద్రమయిన సూర్యుని కాంతిని ప్రతిఆత్మ స్వీకరించుచున్నది. గాఢమైన ధ్యానమున మానవుడు తన ఆత్మ నొక దీపకళికనుగా జూచును. యోగమున క్రమాభివృద్ధి నొందిన పిదప సదాజ్యోతియైన సూర్యుని గాంచును. ఆత్మలో రెండు త్రోవ లున్నవి. అంతర్మార్గమున సత్ప్రకృతియైన సూర్యుని దెస కొకటి; బహిర్మార్గమున కర్మవైపునకు ఈ లోకమునకు మఱి యొకటి, సాగిపోవును. ఈ ప్రపంచమునందలి ప్రజలను రెండు తీరులయిన యాత్రికులనుగా విభజింపవచ్చును. దివ్యమైన నిశ్శబ్దమైన అంతర్మార్గ మొకటి. శబ్దించుచు ధూళిమయమైన కర్మమార్గ మింకొకటి, హృదయమున అంతర్మార్గమున పోవ వాంఛించుచు కర్మపథమున బోవు వారు కొంద ఱున్నారు. ఎట్టి వాంఛ యున్నను వారు బహిర్మార్గభ్రాంతులచే ఇంద్రియలోకమునకు బంధింపబడి యుందురు. అంతర్మార్గము లక్ష్యమును సాధించుట కైనది. బహిర్మార్గము సాధనమును లక్ష్య మొనర్చునది. ఈ నాడు మనకు ఒక నూతనమైన శాంతిప్రదమైన మతము కావలసియున్నది. మానుష్యక మంతటిని ప్రేమసుమస్రజముచే బంధించుటకు మన మభిలషించుచున్నాము. పృథివిపై గల జాతు లన్నింటికిని దేవునే పాలకునిగా ఎన్నుకొన గోరుచున్నాము. ఎవరు లక్ష్యమును సాధింతురో వా రీ నూతనమతమునకు బోధకు లయ్యెదరు. ఎవరు సత్యమును శివమును సుందరమును జీవితమునందు చోదకశక్తులనుగా గ్రహింతురో వా రీ మతమునకు కర్త లయ్యెదరు. వారీ మార్గమున

నాయకు లయ్యెదరు. ఈ గోళమందు ఈ దివ్యసంస్కృతిని నిల్పి యుంచుటకు ఈ నాడు కావలసిన దేమనగా— శాంతిధ్వజమును చేపట్టి తమ చుట్టును చేరుమని మానవానీక మంతటిని ఎలుగెత్తి పిలచు ఏకాగ్రచిత్తులు కావలెను. మానవుని చరిత్ర ఆరంభించిన నాటినుండి ఈ శాంతి అవశ్యకమగుచునే యున్నది. అనగా ఎప్పటినుండి ? మానవజాతి దిగజారి పోయి ప్రకృతిద్రవ్యమును దేవునిగా జేసిన నాటినుండి అని నా భావము. ఆ దుర్ముహూర్తము మొదలుకొని, మానవుడు ఖనిజములను భగవద్విగ్రహములనుగా ఎన్నుకొనిన నాటినుండి, ఆదర్శములైన సంస్థలన్నింటిని వానికి బలి చేసి జీవించుట కారంభించిన నాటినుండి. అప్పటినుండి ఇప్పటివరకు ఈ భూమిపై శాశ్వతమైన శాంతిసద్భావములతో కూడిన వాతావరణమును సృజించుటలో ఎవ్వడును కృతార్థుడు కాలేదు. ఎందుకనగా, పరిణామము అసమానముగా నున్నది. బహిర్మార్గముపై యాత్రికుల స్సంఖ్య నానాటికి పెరిగి పోవుచున్నది. ఈ గోళమునకు వార్ధక్యము శైత్యము పెరుగుచున్న కొలది ప్రకృతిలోని తమశ్శక్తులకు బలము కూడుచున్నది. స్వార్థశక్తులు భేదశక్తులు అజ్ఞానశక్తులు నిలుద్రొక్కుకొనుచున్నవి. తమశ్శక్తులు వృద్ధియగుచున్నకొలది ప్రకాశశక్తులు అస్తంగతము లగుచున్న వని ఊహింపరాదు. మానవు డుపయోగించుకొనుటయే యెఱిగినచో, ఓంకారము ప్రేమసంపదతో పూర్ణమైనది పరిపూర్ణమైనది. ఓంకారములోని ప్రేమను జీర్ణము చేసికొనుట యెట్లో యోగము బోధించును. ఈ పవిత్రమయిన సంఘములో ధీరులయిన వారు ఈ ప్రణవములోని ప్రణయమును జీర్ణమొనరించుకొను అద్భుతకళను ప్రప్రథమమున అభ్యసింపవలెను. సామాన్యమానవులు పృథివిని తినివేయుచున్నారు. జలమును త్రాగివేయుచున్నారు. వాయువును పీల్చివేయుచున్నారు. వారి భౌతికజీవితము ప్రతిబింబితమైన పృథివీకాంతిచే పోషింపబడుచున్నది, అందుచే వారి భావములు స్థూలములు. వారి బాంధ

వ్యములు సంకుచితములు. మహాభావముల నూహించుట, మహాద్రవ్యములను ప్రేమించుట వారికి తెలియదు. కాని యోగి తన హృదయమును ప్రణవప్రేమచేతను, శరీరమును సూర్యునినుండి సరాసరి వచ్చు కాంతి చేతను, అయస్కాంతీకృతములను చేయును. ఈ కాంతిలో ఆధ్యాత్మికౌషధమైన ప్రణవద్రవ్యము హృదయమును పోషించును. సూర్యుని నుండి సరాసరి వచ్చు కిరణములను ప్రణవసంపదను ఉపయోగించుకొను రహస్యము ఒక్క యోగికే తెలియును. ఆత్మలో విలీనము చేసికొను శక్తి ఒకటి ఉన్నది. సామాన్యమానవులలో ఆత్మయొక్క నోరు కట్టువడి యుండును, నాసాపుటములు బిగింపబడి యుండును. భౌతికమైన నోరు భౌతికములైన నాసాపుటములు మాత్రమే పనిచేయుచుండును. ఆత్మయొక్క నోటిని ఆత్మయొక్క నాసాపుటములను తెరచుటకు యోగి యత్నించును. అట్లు చేసి, ఆత్మ సూర్యునినుండియు ఓంకారమునుండియు పోషణను పొందినప్పుడు లోపల ఆధ్యాత్మికధృతి అనునది ప్రభవించును. ఆధ్యాత్మికవిశ్వాసము కలిగిన వాడే లేచి 'నే నీ ప్రపంచమును బాగు చేసెదను' అని వక్కాణింపగలడు. అతడే నూతనసృష్టిని చేయుటకైన రహస్యముల నభ్యసించు వాడు. అతని బాహ్యశరీరముకూడ నవ్య కాంతితో ఉద్దీపించును. అతని కంఠధ్వని మధురమై ఆకర్షణీయ మగును. అతని భావములు లోని భీకరవిద్యుదయస్కాంతయంత్రమునుండి వచ్చు జీవశక్తులై విరాజిల్లును. ఆత్మ కీ అయస్కాంతశక్తిని విద్యుచ్ఛక్తిని సమకూర్చుటయే యోగముయొక్క లక్ష్యము. నీ వీ శక్తిని సాధించితి వేని తోడి మానవుల నడుమ కాంతికి ఉష్ణతకు ఆకర్షణకు కేంద్ర మయ్యెదవు. యోగము నభ్యసింప గోరువారలు మనసునం దుంచుకొనవలసిన ముఖ్యమైన విషయ మేమనగా యోగికి సాధ్యము కాని విషయ మేదియు లేదు అని. ఒక నిప్పురవ్వ ఒక మహానగరమును కాల్చివేయ గలుగు నట్లుగా యోగి హృదయములోని ఒక మహాభావము విశ్వచరిత్ర నమాం

తము మార్చివేయగలదు. మానవుడు క్రమక్రమముగా ఒక లోకమునుండి ఇంకొక లోకమునకు ఆరోహించుచున్నాడు. మనపై ఆఱు లోకము లున్నవి. యోగమునందు అతని అభివృద్ధి ననుసరించి మానవుని స్థితి ఈ లోకములలో నిర్ణయింపబడును. ఇది యెఱిగినచో అధైర్యపడుటకు గాని నిరాశ నొందుటకుగాని తావు లేదు. మన ఆత్మయొక్క స్థితి ఇట్టిది. దైవుడు మన ఆత్మలో ఈ భావమును నాటి యుంచినాడు. మానవున కేతద్విషయకచైతన్యము లేకున్నను ప్రతిక్షణము అతడు జీవితములో ఆరోహణము చేయుచునే యున్నాడు. కాని యోగి చైతన్యముతో క్రమ పద్ధతి ననుసరించి ఆరోహించుచున్నాడు. రాబోవు సంతతివారి క్షేమము నకు ఉపయోగపడుటకు తన ఆత్మశక్తిలో కొంత అర్పింపనిదే ఎవ్వనికైనను ఈ లోకమును వీడి పైలోకమును అధిరోహించుటకు అనుజ్ఞ లభ్యము కాదు. శుద్ధమైన జీవశక్తిని శుద్ధమైన నిస్స్వార్థమైన ఇచ్ఛాశక్తిని వృద్ధిచేసికొని అర్పించుటకు కోటిజన్మలు పట్టవచ్చును. ఈ ప్రపంచ స్థితివిధానములో కోటిజన్మలు ఒక లెక్కలోనివి కావు. మనము అర్పించి తీరవలెను. దేనినైనను మంచిదానిని మనము సంపాదించినప్పుడు మన ఇచ్ఛ లేకున్నను అది మననుండి వెలికి పోవును. కావున అర్పణము అనునది యోగప్రపంచమున ప్రథమ సూత్రము. ఈ ప్రపంచమునందలి ప్రతికోణమున ఈ భూగోళమున కూర్పబడిన ద్రవ్యజాతమునందలి ప్రతిపరమాణువులో అహంకారమను తమశ్శక్తి నిబంధింపబడి యున్నది. అది ఆత్మయొక్క విశ్వకాంతిలో విలీన మగుటకు తిరస్కరించును. ఘనీభవించిన ఈ అహంకారలోహ మును విశ్వక్షేమ మను మూసలో కరగించుట యోగియొక్క విధి. అందుచే అట్టి మహాశక్తిని యోగి సాధింపవలసియున్నది. ఆ శక్తి యొక్క జ్ఞానమును పొందుటకు యోగులు సమాధినిష్ఠ లయ్యెదరు. వ్యష్ట్యాత్మ సమష్ట్యాత్మను భావించుట సమాధి. సమష్టిపై వ్యష్టి ఏకాగ్ర

మగుటకంటె ప్రయోజనకరమైనది ఇంకొకటి లేదు. శాస్త్రీయమార్గమున నీ వీ సమాధిని పొందినప్పుడెల్ల అహంకారము కొంత కొంత విచ్ఛిన్న మగుటయు విశ్వాత్మ కొంతకొంతగా లోన బ్రవేశించుటయు జరుగును. ఈ సమాధిస్థితిలో విశ్వమానవానీకమునకును నీకును ఐక్యభావమును నీవు పొందగలవు. ఈ సమాధి అనునది మానవహృదయమునుండి దివ్యత్వమునకు గల వంతెన. ఈ సమాధిలో కావలసినది వైజ్ఞానికమైన ప్రేమ, వేదనామయమైన ఏకాగ్రత. ఈ దివ్యసమాధి అందఱకు సాధ్యము కాదు. కోట్లలో ఈ శక్తి ఒకనికి సాధ్యమగును. ఒకానొకడైనను సమాధిస్థితి నందినప్పటికి దాని ఫలమును సద్వినియోగము చేయలేకున్నాడు. అనగా కొన్నివేళలయందతడు విశ్వాసమును కోల్పోయి దేవునివైపు ఎక్కువగా, మానవానీకమువైపు తక్కువగా, ప్రసరించుచున్నాడు. కాని, దేవుని యందు మన ప్రేమ అనగా అర్థ మేమి? మానవుని విముక్తుని చేయు టయే. అందువలన మానవానీకముతోడి మన తాదాత్మ్యమును వీడరాదు. అంతే కాదు. జీవచిహ్నముగల ప్రపంచభాగము దేనితోనైనను మన తాదాత్మ్యమును పోగొట్టుకొనరాదు. సమాధిలోని గొప్పతనమును ఇదే చాటును. సిద్ధిబొందెడి సమాధితో మానవానీకముయొక్క అదృష్టము అభేదముగ బద్ధమై యున్నది. మానవానీక మనగా వర్తమానమున బ్రతికియున్న మానవజాతియనియే నా భావము కాదు. మానవానీక మనగా భవిష్యత్తునకును గతమునకును అర్థమగును. భూతభవిష్యత్తులను దివ్య కేంద్రప్రసారితకాంతితో నింపుటకు మనము వాంఛించుచున్నాము. ఎవ్వరును మరణించుట లేదు. మనము వారిని ప్రేమించుట లేదు గనుక వారిని చూచుట లేదు. ప్రతిదియు తిరిగి వచ్చును. ప్రతిమానవుడును తిరిగి వచ్చును. ఈ పరిణామనిశ్రేణికలోని ప్రతిమెట్టును మానవుడు ఎక్కితీరవలెను. ఇది తప్పదు. ఎప్పుడును ఊర్ధ్వముగ చరింపకున్నను అనంతమయిన శక్తి ఉన్నది. అది తఱచు నిచ్చెనపై

కెక్కినట్లే ఆరోహణము చేయును. అది అట్లు చలించి చలించి తుదకు పైపైకి పోవును. యోగములో నిరాశ లేదు. ఆశ ఉన్నది. దేవుడు ప్రతి వ్యష్టిమానవునియొక్క అదృష్టసూత్రమును పట్టుకొని యున్నాడు. దేవుడు తప్ప తన అదృష్టమున కాధార మిం కెవ్వడును లే దని మానవుడు తెలిసికొని నమ్మినచో ఇక పతన ముండదు. ప్రకృతిద్రవ్యము అయత్నముగా తనకు తానే మెట్లరూపమును ధరించి అధిరోహింపు మని ఆత్మ నాహ్వానించును. అనేకుల కీ విషయము తెలియదు. ఆధ్యాత్మిక ప్రాప్తికి ప్రకృతిద్రవ్యము ఉపకరింపవలె నని మనము ప్రార్థన మొన ర్చుచో అది ఉపకరించును. ఈ శరీరము ప్రకృతిద్రవ్యము. ఆత్మ సూక్ష్మసూక్ష్మజీవితమును నెఱపగోరుచున్నప్పుడు శరీరము నిజముగా ఉపకరించుచునే యున్నది. తన శరీరము తనను క్రిందికి లాగుచున్నదని ఎవ్వడును చెప్ప వీలులేదు. ఎవ్వడయినను విశ్వసనీయముగా తన శరీరము తన ఊర్ధ్వారోహణమునకు అంతరాయము కలిగించుచున్నదని వక్కాణించిన యెడల ఈ పుడమిపై అతని దినములు దగ్గఱబడిన వని రూఢిగా నెఱుగుము. 'నేను త్రాగుడున కలవాటు పడినాను. త్రాగుచున్నాను. మానివేయవలెనని యున్నది. కాని మానలేకున్నాను' అని యెవ్వ డయినను అతివిశ్వసనీయముగ చెప్పుచో అతనికి మృత్యువు సమీపించిన దని తెలిసికొనుము. అతనికి నూతనశరీరము వచ్చును. లోభికైనను దురాశాపరునకైనను ఇదే తీరు. ఈ కొండెములను దేవుడు వినును. ఈ శరీరము నాకు మిక్కిలి బరువుగా నున్నదని యెవ్వడయినను దేవునితో చెప్పినచో ఆయన ఆ శరీరమును కరుణామయుడై తొలగించి అతని కొక శిశుదేహమును క్రొత్తదాని నిచ్చును. అతనికి మఱి యొక అవకాశమును కల్పించును. జననమరణములలోని నిజమైన సూత్ర మిది. మానవుడు మరణించున దిందులకు. తిరిగి జన్మించున దిందులకు. తెలివిగలవాడు తన మేధస్సు మూఢముగా నున్నదనియు, ఉన్నతసత్యా

మును గ్రహించుటకు తగిన బలము కలిగియుండలేదనియు దేవునితో చెప్పును. అప్పు డతడు త్వరలో ఆ శరీరమును వీడును. కాని, మన మట్లు కొండెములు చెప్పరాదు. గొణగరాదు. మన నైతికాధ్యాత్మికాభి వృద్ధికి శరీరము ప్రతిబంధకముగా నున్న దనరాదు. మనము అత్యంతా సక్తిని కలిగి యుండవలెను. సరియైన జీవితమును గడుపవలెను. శాస్త్రీయ విధానముల నభ్యసింపవలెను. సరియైన దేశికుని చేరవలెను. వంకలు, చెప్పుట అసహనలక్షణము. ఓర్పుతో నీ కర్తవ్య మంతటిని చేయవలెను. ఉన్నతసత్యముల నెఱుంగుటకు జిజ్ఞాసానలజ్వాల నీలో నుండెనా అవి తప్పక లభ్యము కాగలవని విశ్వసింపుము. సత్యము తనంతతానే నీ కన్నులయెదుట తన సౌందర్యమును బయటపెట్టును. జన్మ తరువాత జన్మగా నీ విదే ధ్యానించుచుంటివి. ఇదే అర్థించుచుంటివి. గతజన్మలలో నీ వనేకపర్యాయములు యోగాభ్యాసము చేయగోరి అనేకపరిస్థితు లాటంక ములు కూర్చుటచే చేయలేకపోతివి. గతకాలమున నీ ప్రయత్నవైఫల్య ములనుబట్టి ఈ జన్మలో నీకు నేర్చుకొను అవకాశము లభించినది. అందుచే చిక్కిన అవకాశమును పాడుచేసికొనుట యోగ్యముకాదు. మన మెంతో విలపించిననే గాని మహావిషయము లందవు. కనుక విలువ నెఱుగుము. పొందుము. నీవు వినునట్టి ప్రతిపదమును ఆత్మాగాధతలము నకు కొంపోయి ఉంచుకొనుము. నా బాల్యమున నేను యోగాభ్యాసము చేయ గోరితిని. కాని అనేకము లాటంకములు వచ్చినవి. నేను బడిలో నుంటిని. పాఠములతోనే నా కాల మంతయు గడచినది. అప్పుడు నే నొక గుడిలోనికి పోతిని. యోగము నభ్యసింపవలె నను నా కోర్కెను సఫలము చేయు మని దేవుని ప్రార్థించితిని. యోగపాఠములు నా కెవ్వరో చెప్పుచున్నట్లు కలగంటిని. కాని ప్రాతఃకాలమునకు వానిని మఱచి పోతిని. ఒక చక్కని తోటలో ఒక యోగి ఉన్నాడనియు, అక్కడ కేగినచో నా కాయన బోధించు ననియు ఎవ్వరో కలలో చెప్పిరి. అట్లే

జరిగినది. చూచితివా? బాహ్యముగా మనము నిస్సహాయులముగా కన్పట్టు దుము. కాని ఆంతరంగికముగా సహాయ మెల్లప్పుడును వచ్చుచునే యుండును. ఒక్క మారు అంతర్లోకము సత్యమైనదని విశ్వసింపుము. అంతర్లోకములో బహిర్మానవులకంటె సుందరులును మిక్కిలి సహాయము చేయువారును ఉన్నారని ఒక్కసారి విశ్వసింపుము. అప్పుడు నీవు నేర్చుకొన దలచినది పొందదలచినది నీకు లభ్యమగును. అంతర్లోకము నుండి మనకు భావములుమాత్రమే రావు. నిజమైనవి భౌతికమైనవి అంతర్లోకమునుండి బహిర్లోకమున కవతరించును. ఇది ముమ్మాటికి యదార్థము. ప్రపంచమున శాశ్వతశాంతి నెలకొల్పుటకును ఐక్యమును సాధించుటకును ఒక నూతనమతమును స్థాపింప వలయునను నా మహావాంఛకూడ అంతర్లోకమునుండియే వచ్చి బహిర్లోకమున నిలువగలదు. సృష్టియొక్క రహస్య మేమియో తెలియునా? లోనిదానిని వెలికి తెచ్చుట. ఈ బహిరాగమనవిధానమునకు అనుసంధానముగా మనము జీవించుచున్నాము. నీవు దీనిని విశ్వసించితివా, నీ జీవితముకూడ శాంతిసాధనోద్యమమునకు ఉపకారకము కాగలదు. ఈ విధానమును ఆచరణలోనికి దెచ్చుట యెట్లు? సమాధినిష్ఠచేత. సరాసరి సూర్యకిరణములను ప్రణవప్రేమను తనలో జీర్ణమొనరించుకొను యోగి విశ్వసమాధినిష్ఠ బూనగలడు. అతడీ ప్రపంచమును అధ్యాత్మభావప్రపూర్ణమును జేయగలడు. ప్రతిప్రాతస్సాయంవేళలయందును నీవు కాంతికేంద్రమున ఏకాగ్రముగ బుద్ధిని నిలిపి, ఆ కాంతి పరిధిని మొత్తమును పొంగి ప్రవహించుచున్నట్లు భావింపుము. యోగాభ్యాసము చేయు వానికి బద్ధకముగా నుండుట తగదు. సోమరితనము ఆత్మను కృశింప జేయును. నీవు నడచుచున్నను తినుచున్నను నిద్రించుచున్నను నిరంతరము విశ్వకాంతిని ధ్యానించుట నేర్చుకొనుము. తన గదిలోనికి చేరి ఒంటరిగా కూర్చొను వాని వంటివాడు యోగి. అనగా బాహ్యముగా అత డేమి చేయుచున్నను, అంతరంగి

ముగా దేవుని భవనమున ఎట్లు విశ్రమింపవచ్చునో అత డెఱుగును. యోగి నామమాత్రముగా భౌతికజగత్తున జీవించును. కాని అతని నిజమైన గృహము దేవుడు. అందుచే ఈ శరీరముయొక్కయు అహంకారము యొక్కయు గుణము లతని నే మాత్రమును కదలింపజాలవు. జగతీశక్తు లతని యేకాగ్రతను భంగింప లేవు. అతని ఆత్మలో అత డచలుడు. బహిర్జగత్తులో జరుగుచున్న దంతయు స్వప్నమని అత డెఱుగును. స్వప్నజీవితములోని లోతులు నీ కనుభూతము లేని, నా భావమును గ్రహింపగలవు. తఱచు మనము నిద్రించుచున్నప్పుడు మహాభయంకర విషయములను గాంతుము. ఒక పెద్దపులి మనలను తినుటకు వచ్చును. లేదా, ఒక రైలుబండి మనపై పోబోవును. కాని స్వప్నజీవితముయొక్క ఉన్నతానుభూతిలో మన ఆత్మ నిశ్శబ్దముగా నుండును. ఒక విధమైన సుఖానుభూతి లభించును. పెద్దపులి మనను తినలేదని యెఱుగుదుము. రైలుబండి మనను తాకలేదని యెఱుగుదుము. అందుచే యోగి నిశ్చయముగా జీవించును. భయంకరముగా కనబడున దంతయు ఛాయామాత్రమని వానికి తెలియును. ఇట్లు నిశ్చయించుట సామాన్యులచేత గాదు, అయినను సత్య మిది. నీ వొక అగ్నిపర్వతముప్రక్కగా పోవుచున్నావనుకొనుము. నీవే నిజమైన యోగివైన, అది అప్పుడు బ్రద్దలయినను నీవు భీతుడవు కావు, చలింపవు. అందలి నిప్పురవ్వలు భస్మము నీ శరీరమంతటిని కప్పివైచినను నీ వే మాత్రము జంకును బొందవు, చలింపవు. ఇది అక్షరముల నిజమైన మాట. ఈ ప్రకారము దేవుడు మనకు ఆత్మ కలదనియు, ప్రకృతి లేదనియు బోధించును. ఈ విద్యలో మొదటి మెట్టు మహాసహనము. అచంచలసహనము. ఆ కైలాసశిఖరమును గాంచుము. మంచు గాలి తుపాను దానిపై నెంత తీవ్రముగా తాండవించుచున్నను అది యెంత చలింపకున్నదో! నీ వట్లు నిలువవలెను. నిన్ను రక్షించుచున్న దివ్యప్రేమను ఓడింపగలది గాని అతిక్రమింపగలది గాని ఈ

విశ్వములో ఏ శక్తియు లేదని నిరంతరము విశ్వసించి యుండుము. ఈ దృఢమైన విశ్వాసమువలన నీ అనుభవము దృఢత నొందును. ఈ విశ్వాసమునుండి ఒక సుందరదేవత నిన్ను సమస్తాపదలనుండి తప్పించి కాపాడునది ఆవిర్భవించును. ఈ విశ్వాసమునుండియే ఒకానొక సుదినమున ప్రకృతిబాధనుండి శాశ్వతముగా లేవనెత్తుకొనిపోవు విమోచనము సిద్ధించును. కాని ఎల్లప్పుడు జాగరూకుడవై యుండుము. ఎల్లప్పుడు దేవునిలో పూర్ణవిశ్వాసము నీ కున్నట్లు నమ్ముము. నీవు సరిగా ధ్యానము చేసినట్లు నమ్ముము. శిక్షార్హమైన పనిని దేనిని గాని నీవు చేయలేదని నమ్ముము. జీవితరహస్య మనంతము సుమా! సర్వగ్రాహకమైన ఈ జీవితపు పట్టును తప్పించుకొనుట దుర్లభము. అది ఆత్మ నెట్లు తాకునో పండితోత్తముల జ్ఞానమునకు సైతమందదు. మన విపత్తులు వివిధములు. అందుచే మన మీ ప్రపంచమున పోరు సలుపుచున్నంత కాలము మన కవచమును ధరించుట నెన్నడును మఱచి యుండరాదు. మన కవచమేది? భగవద్భక్తి అను లోహముతో అది చేయబడినది.

# శాంతి

అరవిందము భారతదేశమందలి తటాకములలో సరస్సులలో నుండు ఒక అద్భుతమైన పుష్పము. అది మూడు జాతులుగా నుండును. తెల్లనిది ఎఱ్ఱనిది నీలమైనది. భారతీయనాగరకతకు ఈ అరవిందము చిహ్నము. సనాతనకాలమునుండి భారతీయకవులచేతను వేదాంతుల చేతను స్థూలసూక్ష్మప్రపంచసంబంధములయిన సత్యములను వివరించు అవసరములలో ఇది ఉపయోగపడుచు వచ్చినది. సర్వవిధముల ఇది సుందరమైన దగుటచే తాత్త్వికులు సత్యముతో పోల్చవలసివచ్చినప్పుడు దీని నుదాహరించిరి. వర్ణములో ఆకారములో స్థితిలో అది సుందరమైనదే కాక వర్ణనాతీతమైన దివ్యసౌందర్యము దానియందిమిడి యుండుటచే భారతీయకవియొక్క గాఢమైన ఆధ్యాత్మికచేతస్సు అరవిందములో జీవితరహస్యముయొక్క ఆత్మరహస్యముయొక్క మేళనమును గాంచెను. అరవిందములో వర్ణము వాసన కలసియున్న రీతి శరీరము ఆత్మ కలసియున్నవి. జలములో అరవింద ముంచబడినట్లు ఈ భౌతిక జగమున జీవితముతోడి ఆత్మ నిక్షిప్తమైనది. భారతీయభావములో జలము ఋతమునకు చిహ్నము. ఋత మనగా సృష్టికి పూర్వమున్న బీజము. మన శరీరములో అనేకములు అరవిందము లున్నవి. అనగా కొన్ని గదులు అరవిందమువంటి ఆకారముతో వర్ణముతో వాసనతో నున్నవి. వానిలో చేతనత్వము అగోచరమైన ఆత్మ ఉన్నవి. ఈ అరవిందములన్నియు వెన్నెముక నడిమి భాగమున అడుగునుండి తలవరకు ఏర్పడి యున్నవి. అట్టడుగున ఆధారపీఠము ప్రాణమునకు మూలము. ఊర్ధ్వ శిఖరము ఆత్మకు మూలము. ఈ రెండు కొనల మధ్య కనీసము పంద్రెండు

అరవిందము లున్నవి. దైహికవిధానమున ఉష్ణము శక్తి ప్రేమ మొదల యిన వాని సమ్యక్ప్రసారమునకు ప్రత్యేకవిధులు కలవై ఈ అరవింద ములు ఒక విధమైన తంత్రీకేంద్రము లన్నట్లు లున్నవి. శీర్షశిఖరమున ఊర్ధ్వమున నున్న అరవిందము సహస్రదళములు కలది. ఈ వేయి దళ ములు వేయి ఆదర్శయంత్రము లన్నట్లు లుండును. ఆత్మవృద్ధిచేసికొన గలుగు సర్వవివేకము సర్వజ్ఞానము సర్వసద్గుణములు మొదలయిన వాని కన్నిటికి అవి ప్రాతినిధ్యము వహించును. అడుగున ప్రాణాధారమున ఏది లేకున్న శరీరము జీవింపనేరదో మాటాడనేరదో ఆలోచింపనేరదో అట్టి శక్తి వసించును. ఈ రెండు కేంద్రములు పరస్పరసంబంధము కలిగి యుండుటచేత మన ఆధ్యాత్మికజీవితము భౌతికజీవితము బద్ధపడియున్నవి. భారతీయవేత్తలు చక్కని శాస్త్రపద్ధతులపై శరీరశాస్త్రమును మనశ్శాస్త్ర మును తఱచినిర్మించిరి. మానవుడు రక్తమాంసములే కాదనియు భావములు సైతము కాదనియు, అతడు మరణము లేనివాడనియు, అతని శక్తులు అనంతవిస్తృతి నొందగల వనియు, అతని సుగుణసంపత్తి కడు గొప్ప దనియు, కనుగొని యుంటిమి. మానవుని ఈ మనశ్శరీరసంబంధమయిన విచారణవలన తేలిన దేమనగా —ఒక అగ్రమున మానవుడు దివ్యుడు. మఱియొక చివర అదివ్యుడు. ప్రాణాధారభాగము వెన్నెముకయొక్క క్రిందిభాగము. అది అహంకృతి మృతి అపరిశుద్ధి గల భాగము. ఊర్ధ్వ భాగము దివ్యము అమరము శాశ్వతము అయిన భాగము. మానవు డొక భాగమున నీచుడు హీనుడు అయినప్పుడు దివ్యుడు మహాత్ముడు ఎట్లు కాగలడు అను ప్రశ్న రావచ్చును. దానికి సమాధాన మేమనగా —మాన వుడు అధోరవిందమును ఊర్ధ్వారవిందముచేరువకు ఎంతవరకు కొని రాగలడో దానినిబట్టి అతని గొప్పతన ముండును. మఱియొక విధముగా ఇట్లు చెప్పవచ్చును —మర్త్యమైన అహంకారమును అమర్త్యమైన దేవ త్వముచేరువకు ఎంత సన్నిహితముగా కొనిరాగలడో దానినిబట్టి అతని

అదృష్టముయొక్క తేజోవైభవ ముండును. అధోరవిందమును ఊర్ధ్వార విందముచేయుటకు ఎట్లు కొనిరావలయునో అది యోగులకు మాత్రమే తెలిసిన రహస్యము. వినయవిధేయతలతో వర్తించి సర్వత్యాగమును చేసి ఏ శిష్యుడు ద్వాదశసంవత్సరములు అభ్యసించునో వానికి రహస్యము అందింపబడును. అభివృద్ధిపథమునందలి ఆరంభదశలో ఈ రహస్యమును బయలుపరుపరాదు. అది అంత అమూల్యమైనది. విద్యార్థి మొదట అంతఃపరీక్ష అను కళను నేర్చుకొనవలెను. అంతఃపరీక్ష అనగా నేమి? హృదయములో ఆత్మలో శరీరములో తనకై తాను చక్కగా చూచుట లేక పరీక్షించుకొనుట. నే నేమి తలచుచున్నాను, నే నేమి కోరుచున్నాను, నేనేమి ఆశపడుచున్నాను, అని నిరంతరము నిన్ను నీవు పరీక్షించుకొనుచుండుటచేత, నీవు పరార్థజీవితమును గడుపుచున్నావో లేక స్వార్థజీవితమును గడపుచున్నావో తెలిసికొనగలవు. ప్రతిదినము నే నేమి మంచిపని చేసితినని ఆలోచించుటతో మొదలుపెట్టుము. భారతీయ విద్యా సంస్థలలో ఒక ఆచారము కలదు. విద్యార్థులు పగలు చేసిన పని నంతటిని సాయంకాలమున గురువుల చెంత చెప్పవలెను. విద్యార్థులకు తెలియని విషయములు చెప్పుచు వారిని నైతికమార్గప్రవర్తనమున వర్తింపజేయుట కొందఱు ప్రత్యేకాధ్యాపకుల విధి. వారెల్లప్పుడు విద్యార్థుల వెంటనే ఉందురు. ఆ సంస్థ నగరసమీపమున నున్నచో వారు నగరములోని కేగి విద్యార్థులు పగటివేళ ఏమేమి చేసిరో విని వత్తురు. ఏకాంతముగ కొండలపై నున్న సంస్థలలో గురువులు శిష్యులు కలసియే వసింతురు. సాయంకాలమున వారెల్ల రొక్కచో కూడుదురు. ప్రతివిద్యార్థియు గురువు చెంతకు చేరి తానేమి తలచినది తానేమి చేసినది తానేమి చేయగోరినది వివరించి అంతయు చెప్పును. ఒకడు తాను నగరములోని కేగితి ననియు ఒక వృద్ధస్త్రీ పాలకుండను మోయలేక మోసికొని పోవుచుండుటను చూచితి ననియు అప్పుడు తా నా కుండను అంగడివరకు మోసికొనిపోయి

యిచ్చితి ననియు చెప్పును. విద్యార్థి తాను చేసిన మంచిపనిని దానికై తన కిచ్చిన మర్యాదను గురువునకు విన్నవించుకొనవలెను. ఇంతేకాక తా నేమి మఱచినదియు చేయక విడిచినదియు తా నేమి చెడ్డ తలపులు తలచి నదియు కూడ చెప్పవలెను. గురు వెప్పుడును శిక్షింపడు. శిష్యుడే తన తప్పును ఒప్పుకొని తనకు తానే శిక్ష విధించుకొనును. శిక్ష అనగా ఇత రులకు ఎక్కువ సేవచేయుట అని అర్థము. అది ఇట్లుండును. దారి తెలియక బాధపడుచున్న ఒక గ్రుడ్డివానిని త్రోవలో చూచితి ననియు ఆ క్షణమున తా నాకలిచే బాధపడుచు సాయపడకయే పోతిననియు చెప్పును. ఇది చేయవలసినది చేయక విడిచిన నేరము. ఇందుకు శిక్ష ఏమనగా - ప్రతిదినము తాను చేయు పనులతో పాటు నాటినుండి మఱి నాలుగు విధు లను స్వీకరించును. పల్లెలలోని కేగి ప్రతిఫలము గ్రహింపకయే మోపులు మోసియు గృహములు చిమ్మియు తన శిక్షాకాలమును గడపును. ఇట్టి విద్యావిధానము యొక్క ప్రధానోద్దేశ మేమనగా పిల్లవానిని చిన్నతనము నుండియు సద్భావములు భావించునట్లును సత్కార్యముల నాచరించునట్లును అలవాటు చేయుట. అందుచే ఈ బాలకులు పెరిగి పెద్దవారై తమ గృహ ములకు తిరిగి చేరినప్పుడు సద్విద్యతో, పరోపకారము చేయవలె నను సద్భావముతో, నిస్స్వార్థజీవితము గడపవలె నను సద్వాంఛతో నుందురు. సనాతనకాలమునుండి భారతదేశములో పరంపరగా వచ్చుచున్న విద్యా విధాన మిది. క్రీస్తుపూర్వము మూడు నాలుగు శతాబ్దములలో భారతదేశ మును సందర్శింప వచ్చిన గ్రీకులు తమ గ్రంథములలో అద్భుతమయిన భారతీయవిద్యావిధానముపట్ల తమకు కలిగిన ఆశ్చర్యమును వెల్లడించిరి. అదే పద్ధతి ఇప్పటికిని సాగుచున్నది. ఆధునికపాఠశాలలయందు ఆ పద్ధతిని ప్రవేశపెట్టవలయు నని మా అభిప్రాయమై యున్నది. వానియం దిప్పుడు కొన్ని భౌతికవిషయములు భూగోళము గణితము చరిత్ర మొద లయినవి మాత్రమే బాలురకు పరిచయము చేయ యత్నించుచున్నారు.

కాని, ఏ పాఠశాలయందైనను నైతికవిషయములు బోధించు దేశికుడు లేడు. ఏ పాఠశాలయు బాలకుని నవహృదయమున తోడి సోదరులకు సహాయము చేయుట యందనురక్తిని కలిగించు ఏర్పాట్లు చేయుట లేదు. కొన్ని దేశములలో ఉపాధ్యాయులు తమ రాజకీయభావములను బాలురలో నాటజేతురు. తమ భావములతో ఏకీభవించిన వారియం దనుగ్రహమును. ఏకీభవింపని వారియం దాగ్రహమును జూపుదురు. ఏ బాలుర తల్లిదండ్రులు తమ భావములకు వ్యతిరేకులో ఆ బాలురను శిక్షించుట కూడ కలదు. విశ్వవిద్యాలయములలో ఇతర దేశముల విద్యార్థులున్న యెడల వారిని హీనముగ జూచుట కలదు. అట్లు ఈర్ష్య వహించుట తగదని అచటి ఆచార్యులైనను చెప్పరు, ప్రత్యుత అట్లు ద్వేషము వహించుటను వారే బోధింతురు. ఒక దేశమువా రింకొక దేశమువారిని అసహ్యముగా ద్వేషించుటను నేను తఱచు పరికించితిని. వా రట్లు చిన్నతనమునుండి ద్వేషమునే నేర్చుకొనిరి. ఆ దేశమందలి విద్యావిధాన మెంత దోషభూయిష్ఠ మైనదో యోచింపుడు. దాని పర్యవసానము దుఃఖము వినాశము తప్ప వేఱు కాజాలదు. భవిష్యత్తులో ప్రతి దేశములో ఒక పెద్ద శాంతివిశ్వవిద్యాలయమును స్థాపింపవలయు నని భారతీయయోగివరుల సంకల్పమై యున్నది. అచట విద్యావిధానము పూర్ణముగా నూతనపద్ధతులపై జరుగగలదు. శాంతి స్నేహ సోదరభావములు పెంపొందింపవలెను. వ్యష్టిచైతన్యములో మార్పును తీసికొనిరావలెను. కాబట్టి ప్రతిదేశములోని శాంతివిశ్వవిద్యాలయములో ఆ దేశస్థులే కాక ప్రపంచములోని అన్ని ఇతరదేశములలోని బాలబాలికలు విద్య నభ్యసింపవలెను. ఈ శాంతివిశ్వవిద్యాలయములను ఎందుకు స్థాపింప గోరుచున్నామో తెలియునా ? అన్ని జాతులకు చెందిన వారు ఒకే విశ్వవిద్యాలయములో విద్యాభ్యాసము చేయుచో వారు స్నేహితులయ్యెదరు. అప్పుడు ఒక దేశముపై ఇంకొక దేశము యుద్ధమును ప్రకటించుటకు వీలుండదు, ఇది పెద్ద కార్యక్రమము. దీనిని నెరవేర్చుటకు

చాల కాలము పట్టును. ఈ విశ్వవిద్యాలయములు ప్రపంచమును రక్షింప గలవు. ప్రపంచరక్షణ కింకొక మార్గము లేదు. ఇది మిక్కిలి ఆశ్చర్య కరమైన విషయము. ఇట్టిది భూమిపై ఎన్నడును సంభవింపలేదు. ప్రతి దేశము తన బాలబాలికలను అన్యదేశములకు పంపును. ఇతరదేశముల బాలబాలికలను స్వీకరించును. ఉపాధ్యాయులు కూడ ఇతరదేశములనుండి కైకొనబడుదురు. అందుచే గురువులు శిష్యులు స్నేహభావమున మెలగు దురు. ఈ రీతిగా కొంత కాలమునకు ప్రపంచమంతయు స్నేహమునే వహిం చును. ఒక విద్యార్థి తన విద్యాకాలము నంతటిని ఒక దేశములోనే గడపడు. సంవత్సరమున కొక దేశమును చేరును. అట్లయిన ఒక విద్యార్థి తన విద్యను పూర్తిచేసిన పిమ్మట ఇట్లు చెప్పగలడు ' నేను ప్రపంచమును చూచితిని. నే నన్ని దేశములవారితో స్నేహము చేసితిని. నే నందఱిని ప్రేమింతును. నేను ప్రపంచమంతటిని ప్రేమింతును. నా దేశముకొఱకై నేను యుద్ధము చేయను. నా సోదరులైన ఇతరదేశవాసులను చంపుటకు నా ప్రభుత్వము నన్ను సాధనమునుగా ఉపయోగింపజాలదు ' అని. ఈ విధానమును బహుశ నీ విప్పు డున్న స్థితిలో అభినందింపలేవు. కాని నీకు సహనము కుదిరి వివేకము వృద్ధి నంది నేను చెప్పినట్లు అన్ని విష యములను వినయవిధేయతలతో సరిగా ఆచరణలో పెట్టుదువేని కాలము వెంబడి నీ కంతయు అర్థమగును. ఒక దేశము నాకు సహాయము చేసి సానుభూతిని చూపినచో అన్ని దేశము లట్లే చేయగలవు. దానిని గూర్చి ఇప్పుడు విశేషముగ చెప్పను, నీవు మాత్రము ఆ శాంతిమహావిశ్వ విద్యాలయమును గూర్చియే ఆలోచింపుము. హృదయమును సిద్ధము చేయుము. నీ సర్వశక్తులను నీ సమస్తాశలను నీ ఆత్మను నిన్ను సైతము దానికై అర్పణము సేయుము. ఇరువది లక్షల సంవత్సరములనుండి ఈ ప్రపంచము ఈర్ష్యతో మత్సరముతో యుద్ధముతో బాధ ననుభవించు చున్నది. అందుచే విశాలమహాకాశమును భావింపుము. అది నీకు విశ్వ

సోదరజ్ఞానము నీయగలదు. నే నాంధ్రుడనని నేను భారతీయుడ నని నేను పురుషుడ నని ఇట్టి భావములను నీలోనుండి పారద్రోలుము. ఈ ప్రపంచమును సృజించి పెంచి నిలుపుచున్న ప్రేమను న్యాయమును సామరస్యమును ధ్యానింపుము. ప్రపంచమున నీవు కొంచెమే చూచి యుందువు. కాని ఇకమీద నీవు సర్వప్రపంచములోని కేగి ప్రతిదేశమందలి ప్రజలతో స్నేహము చేయగలవు. కొంతకాల మయిన పిదప నీ విట్లు చెప్పగల వని భావింతును. 'నాకు శత్రువు లేడు. నాకు ప్రపంచ మంతటితో స్నేహమే. నేను ప్రపంచ మంతటికిని సేవ చేతును' అని. ఇదే యోగము. ప్రపంచమునకు సేవ. మానవానీకమును సముద్ధరించుటకైన ఆధ్యాత్మిక సేవ. యోగములో రహస్య మేమియు లేదు. యోగము వింతలు విడ్డూరములు చేయున దని నీవు యోగమునుగూర్చి చదివిన దంతయు అబద్ధము. ఇరువది నాలుగు సంవత్సరములు యోగము నభ్యసించిన వాని కెవ్వనికిని యోగ మనగా అర్థము కాదు. అధర్మమునకు జంకని వారు కొందరు యోగముపై కొన్ని గ్రంథములు వ్రాసిరి. దాని ప్రయోజనము వారికే తెలియును. కాని వారికి యోగ మనగా తెలియదు. వారు బోధించబడినట్లు జీవితములు గడపినవారు కారు. దుష్టముగా జీవించి పాపములాచరించి ప్రచారము చేసి ధన మార్జింతురు. యోగశబ్దోచ్చారణము చేయుటకే వారి కర్హతలేదు. నిజమైన యోగము సత్త్వము, నిజమైన యోగము వివేకము ప్రేమ మానవత్వము. నీవు నిజమైన యోగి వగుచో తోటి మానవుని ప్రేమింతువు. దేవుని ప్రేమింతువు. ఈ ప్రేమను నీ ప్రవర్తనమువలన ఋజువు చేతువు. నీవు విధేయుడవై శాంతుడవై సత్యవర్తనుడవై ప్రయోజకుడవై భావమయుడవై యుందువు. ఇవి యన్నియు యోగగుణములు.

ప్రతిదినము నిన్ను నీవు ప్రశ్నించుకొనుము. నీవు యోగి వగుచున్నావో లేదో, నీవు సంవత్సరముక్రిందట ఉన్నట్లే ఉన్నావో మారి

నావో, నీ ఆత్మ నడుగుము. యోగములో ఆగుట లేదు. క్రమాభివృద్ధి కలదు. ఎందుకనగా మన కాలము కొంచెము. విఘ్నములు అనేకములు. మన మీ గోళమును వీడి పోవుటకు ముందు పృథివీమాతకు కొంత సేవ చేసితి మని చెప్పగలిగి యుండవలెను. ఈ సమస్తమానవజాతియు నీ హృదయములో వసించుచున్నట్లును నీ హృదయము ఈ మహామానవ కుటుంబమును ఆలింగనము చేసికొనుచున్నట్లును నీ వొక్కసారి భావింతు వేని జీవితసమస్య నీ కంత మహాప్రళయముగ గన్పట్టదు. ప్రపంచ సమస్య కిదే పరిష్కారము. ఇందుకే దేవుడు నిన్ను నీ తావునుండి ఇక్కడకు త్రోసినాడు. నీ వక్కడనే యుండి ఒక ధనికుడవై కాలము గడపుచో ఆ చిన్ని వృత్తములో సుళ్ళు తిరుగుచు ఈ మహాప్రపంచమును గూర్చిన చైతన్యమును పొందెడివాడవు కావు. ఇప్పుడు నీవు నీ స్థానమును వీడితివి, ప్రపంచములోని ఇతరదేశముల నాగరకతలను చూచుచున్నావు. దాని ప్రయోజన మేమియో తెలియునా ? నీ వాంధ్రుడ వని మాత్రమే కాక విశ్వమానవుడ వను అనుభూతి కలుగును. నీ దృష్టికి తేజస్సు వచ్చును. నీ హృదయము విశాలమగును. దేవుడు నీవేది నేర్చుకొనవలయునని తలచునో దాని నంతటిని నేర్చుకొందువు. ఇక్కడ నీవు ప్రతిదినము ఆర్జించుచున్న జ్ఞానము సమయము వచ్చినప్పుడు పనిచేసి, ఈ హిమాలయమున గడపిన దినములు వ్యర్థములు కావని తెలిసికొందువు. కష్టములు వచ్చును. మహావిపత్తులు సంభవించును. ఈ కష్టములలో విపత్తులలో నీ హృదయము విశ్వాసమును వీడరాదు. జీవితాంతము సమ్మోదముతోడనే గడచిపోవలెను. ప్రతిరాత్రియు, 'ఆమరణదీక్ష' అని పలికి నిద్రింపుము. భక్తికి మించినది నా కీ లోకమున మఱియొకటి కన్పిట్టదు. జీవితము యొక్క విలువ సేవలో కలదని స్మరింపుము. అనగా నీవు ప్రపంచమునకు చేయవలసిన సేవ పూర్తియయినప్పుడు అహోబిందము ఊర్ధ్వారవిందము చేరువకు వచ్చును. నీవు హృదయపూర్వకముగ

ప్రపంచమును సేవించినప్పుడు నీ వ్యష్ట్యాత్మ పరమాత్మతో ఏకమగును. ఈ ప్రాపంచికజీవనము పూర్తియయిన పిమ్మట ఆవల ఏమున్నదో నే జెప్ప పనిలేదు. ఆ రహస్య మెల్లకాలము రహస్యముగానే ఉండవలెను. నిజమైన శిష్యుడు దానిని తెలిసికొనవలయు నని ఆశపడరాదు. బ్రతుకు పై గల హద్దు మీరిన దురాశయే ఈ నేటి పైశాచికప్రకోపము. ఈ భూతవిద్యలో ఏ ప్రమేయములు సహేతుకములో ఏవి కావో మనకు తెలియ దని ఒక ప్రసిద్ధ తాత్త్వికుడు చాల కాలము క్రిందట చెప్పియున్నాడు. దయ్యములను గూర్చిన అద్భుతములు – భౌతికముగా సంచరించుట మొద లయినవి ప్రకృతియొక్క సహజవిధానమునకు సరిపడవు. ఈ అద్భుత ములు ప్రయోగదశయందున్న విషయము లన్నను అవి అద్భుతాంశ ములే. ఈ అద్భుతాంశములు మాచేతనే గాక పాశ్చాత్యతాత్త్వికులచేతను మిధ్యగా పరిగణింపబడినవి. మరణానంతరజీవితమును గూర్చిన రహ స్యములు ఎఱుగుదు మని నటించునట్టి వారి స్నేహము చేయవలదని నీకు నేను గట్టిగా చెప్ప నక్కఱ లేదు. యోగి ఈ భూతవిద్యను పూర్తిగా విస ర్జింపవలెను. సద్గుణసంపత్తి, తేజస్సు, ఔన్నత్యము అను మూడు సదు లకు జన్మస్థానమైన మానవహృదయము ఈ అశరీరభూతసంబంధ యత్నమున ఎండిపోవును. భక్తితో నుండుము. ప్రాణారవిందముపై బుద్ధి నిలిపి అది ఆత్మారవిందము నందుకొనవలె నని ధ్యానము చేయుము. మూలాధారమునందలి అరవిందము సహస్రారమునందలి అరవిందము చేరువకు రావలెనని ధ్యానింపుము. మూలాధారము భూలోకము, సహస్రా రము సత్యలోకము. ఈ భూలోక మా సత్యలోకముతో ఏకము కావలె నని నీవు ధ్యానింపవలెను. వైరుధ్యమును వాదభేదమును వీడి, ఇతరులను సంస్కరింప యత్నించుటకు ముందు నీ హృదయమును నీ ఆత్మను సంస్కరించుకొనుము. దేవుని సద్భావమునందు నీ ఆత్మకు అచంచల విశ్వాస మేర్పడి యుండవలెను. దేవుని నీ ఆత్మను పరివర్తనము చేయ

నిమ్ము. అదియే సర్వోత్తమపరివర్తనము. ఆయన పని అనేకవిధముల నిర్వర్తింపబడునది. ఆయన విధానములలో నీవు ప్రమేయము పెట్టుకొనకుము. వెలుగును సాధింప యత్నింపుము. ఆ దివ్వెను చేత నిడుకొని తుపానులు తప్పుకొని అంధకారమయమైన ఈ పృథివిపై నడచిపొమ్ము. నీ ఆత్మలోని దివ్వెను దేవునే వెలిగింప నిమ్ము. నీ జీవితమునకు తగిన ఫలము ఆ దివ్వె అనియే భావింపుము. మఱియొక ఫలము నాసింపకుము. జీవితములో మఱియొక నిశ్చయమునకు పోకుము. ఇతరములగు అల్పాదర్శములను ఆల్పాశలను నీ వీ విద్యాభ్యాసమునకు పూర్వము పొంది యున్న అల్పకాంక్షలను విడిచిపెట్టుము. శాంతిమహోద్యమమున నీ విప్పుడొక వీరుడవు. మా కిప్పుడు బలవంతులయిన సత్యవంతులైన స్త్రీపురుషులు కావలెను. వారి నెట్లు ప్రేమింపవలయునో వారి నెట్లు పోషింపవలయునో వారి కెట్లు త్రోవచూపవలయునో మే మెఱుగుదుము. వారిని అవసరమ్ములలో విడిచిపెట్టి యుండము. లోపల చూచుకొనుము. నీ హృదయాకాశమున ఒక నూతన నక్షత్రము ఉదయించుచున్నది. నీ జీవితయాత్రలో ఆ నక్షత్రము మార్గదర్శక మగును. నీ ముందున్న భవిష్యత్తును ఆశతో ధైర్యముతో చూడుము. నీ విధిని పూర్ణభక్తితో విశ్వాసముతో నీ ఆత్మశక్తి నంతటిని ఉపయోగించి నిర్వర్తింపుము. కార్యమధ్యమున నీకు సలహా కావలసినప్పుడు నీ వెక్కడ ఉన్నను మహాయోగుల వాక్కును ఎల్లప్పుడు వినగలవు. నీ వేది చేయవలెనో ఏది వీడవలెనో తెలిసికొనగలవు. నీ గ్రహణశక్తిని ఎల్లప్పుడు శక్తివంతముగా నుంచుకొనుము. నీ ఆత్మలోని వెలుగునుండి దివ్యత్వమును గ్రహించుశక్తి సంతతము సజీవముగా నుండునట్లు చూచుకొనుము. యోగికి ఆ అంతర్జ్యోతియే సర్వస్వము. దానిని మించి ఏమియు లేదు. ఏ వేళయందైనను నీ వీ యంధకారావృతవసుంధరాతలమున సంచరించునప్పుడు ఆ జ్యోతి నన కుక్కన మెఱయుటను గాంతువు. ఆ ధ్వని శబ్దించుచున్నట్లు విం

యిచ్చవచ్చిన చోటి కెక్కడి కేగినను ఈ రెండును నిన్ను వీడవు. నీ జీవితమును ప్రాతర్వికసితపద్మమును వలె పవిత్రముగా నుంచుకొనుము. నీ వాక్కును శ్రుతిబద్ధతంత్రీసమున్నద్ధవిపంచికను వలె స్వచ్ఛముగా నుంచుకొనుము. నీ నేత్రములను సంధ్యాతారకాగోళకముల వలె శుభ్రముగా నుంచుకొనుము. నీ శరీరము, నీ జిహ్వా, నీ నేత్రములు ఈ మూడును అంతర్జీవితమును బహిర్గమింపజేయు శక్తులు. వీనిని అపరిశుభ్రముగా నుంచుకొంటివా జ్యోతిర్మూలముపై నివి తిరుగుబాటు చేయును. ఉదయించుచున్న ప్రాతఃకాలసూర్యుని చూచుచు ఇట్లనుకొనుము. 'నా జీవితము ఈ ప్రాతరాకాశము వలె శుభ్రముగా నుండుగాక! నా ఆత్మ కాంతి ఈ ఉదయభానుప్రభాసమానమై సముద్దీపించుగాక!' అని. ఆకాశము సూర్యుడు నీకు సహాయము చేయగలరు. ఆత్మాభివృద్ధికి దోహదము చేయు ఏ అవకాశమును నీవు జారవిడువరాదు. పారిజాతవృక్షము ప్రక్కగా పోవునప్పుడు 'నా జీవితము ఈ వృక్షమువలె మధురముగా పరిమళవంతముగా శాంతముగా ఓర్పుతో విలసిల్లుగాక!' అని అనుకొనుము. జ్వలించుచున్న అగ్నిచెంత వసించునప్పుడు 'నే నీ అగ్నివలె శక్తివంతుడనై నా పాపములను దహింతునుగాక! ఈ అగ్ని సమిధలను కాల్చునట్లు నా అజ్ఞానమును నేను దహింతును గాక!' అని యనుకొనుము. ఒక సెలయేటి ప్రక్కన నిలచినప్పుడు 'నే నీ నిర్ఝరిణివలె వినయవిధేయతలను కలిగియుందును గాక!' అని యనుకొనుము. ఇవియన్నియు నీకు సాయము చేయగలవు. భౌతికశక్తులను నీ వడుగుటయే నేర్చుకొనవలెను గాని అవి యన్నియు నీకు తోడుపడును. వినయముతో విధేయతతో అడుగువానికి ఎవ్వనికిని ఈ విశ్వము కా దనదు. నీ స్నేహితుని రక్షింప దలచితివేని నీ స్వప్నాధిదేవతతో నీ స్నేహితుని జీవితమును రక్షింపుమని చెప్పుము. ఆ దేవత అట్టి పరిస్థితులు కల్పించును. ఏదియు నిర్జీవమని తలపకుము. ప్రతిదియు సజీవమని వివేకవంతమని నిన్నర్థము చేసికొనగలదని భావిం

పుము ఎందుకో తెలియునా? నీవు ప్రతిదానిని అర్థము చేసికొనుచున్నావు గద! మానవుడు తప్ప మిగిలిన దంతయు నిర్జీవ మనువాడు కేవలము మూఢుడు, అవివేకి. అట్లనుట ప్రకృతిని పరాభవించుట. శిశువు తన కంటె వివేకవంతమైన ప్రకృతిశక్తులచే కాపాడబడుచున్నది. ఎందుచేత? వానియందు విశ్వాస ముంచి వాని సహాయ మర్థించుచున్నది. ఈ విశ్వము లోని భిన్నభిన్నశక్తు లన్నియు నిన్ను సేవించుటకును నీ ఉద్యమము నందు తోడుపడుటకును నీ జీవితమును సుఖమయమును అద్భుతావహ మును ఒనర్చుటకును సంతోషముతో ముందునకు వచ్చు దినములు రా గలవు. ఈ విశ్వశక్తుల చెంత తుదిసెలవు గైకొని నీవేగునప్పుడు అవి కన్నీరు గార్చుచు 'మమ్మెంతో ప్రేమించిన మిత్రు డకటా మమ్ములను వీడిపోవుచున్నాడు' అని విలపించును.

# శక్తి

ప్రతిపదార్థములో సార మేది కలదో అది శక్తి. శక్తియొక్క దృష్టిలో ఉచ్చము నీచము అని లేదు. అన్నియు సమానమే. అయితే ఉచ్చమయిన దానిలో నీచమయిన దానిలో కంటె శక్తి కొంత ఎక్కువగా ఉండవచ్చును. ప్రకృతియే శక్తి అన్నప్పుడు అంధమై అవివేకమయిన శక్తి కాదు. ప్రకృతియొక్క మూలము శక్తిలో చిచ్ఛక్తితో నున్నది. ప్రకృతి శక్తినుండి ఆవిర్భవించుటచే ప్రకృతికి శక్తికి అభేదము చెప్పబడినది. ప్రకృతియొక్క సాక్షాత్కారము రెండు తీరులు ఊహ్యము, అనూహ్యము. ప్రకృతి ఈ విశ్వాకృతిగా పరిణమించుటకు ముందు పరమాత్మకు ఊహ్యముగా ప్రత్యగాత్మకు అనూహ్యముగా నుండినది. అది యిప్పుడున్న తీరులో మనకు ఊహ్యముగా నున్నది. కాలముగా ఆవరణముగా పృథివ్యాపస్తేజోవాయ్వాకాశములుగా మానవుని మనస్సుగా జీవరూపములుగా మనకు ప్రత్యక్షమగుచున్నది. ఈ ఊహ్యమైన ప్రకృతి చిచ్ఛక్తి. ప్రకృతిలోని ప్రతిపరమాణువులో భావము వివేకము ఉన్నవి. సాగరములోని మత్స్యములలో మారుతములోని పతత్రములలో కాననములోని భూరుహములలో ప్రతిచోట జీవముతోడి హేతువు కానగును. హేతువుయొక్క వృత్తి శక్తిని దృఢపరచుట. ప్రకృతిలోని ప్రతివస్తువు ఆవరణములో కాలములో హేతువులో తన స్థితిని దృఢమొనర్చుకొనుచున్నది. అయితే ఈ శక్తిని మనము చూడలేము. ఊహ్యములయిన శక్తులలో కాలము మిక్కిలి గొప్పదని మనము చెప్పవచ్చును. ఎందుకనగా కాలము సర్వ పదార్థములను పుట్టించును గిట్టించును అని ఊహింతుము. కాలము మనము మనస్సుతో మాత్రమే పరికించగలదైన

ప్పటికి నిజమయిన భౌతికసత్యము. అది ఆవరణముపై యాంత్రికమైన ఒత్తిడిని తెచ్చిపెట్టును. ఆవరణము పృథివ్యాపస్తేజస్సుల జీవితమును ఒత్తిడి చేయును. కాలము ఆవరణము మూలాణువు లని మనము పరిశీలింపగలము. ప్రధానశక్తి కాలమునుండియే ఆవిర్భవించుచున్నట్లు మనము ఊహింపగలము. అనగా కాలము మొదట ఆవరణమును కదలించును. ఆవరణము ఆకాశమును నెట్టును. ఆకాశము తేజస్సును త్రోయును. ఇట్లే కడమ వ్యవహారము జరుగును. ఈ ప్రకారమే ఆవరణములోని ఋతువులు ఒకదాని తరువాత నొకటి వెంబడించుచు వచ్చును. సృజింపబడిన పదార్థములలో కాలము కదలికను కలిగించుచున్నను అది కదలునది కాదు. కదిలింపబడునది కాదు. ఇది తార్కికమయిన దోషము. అందులకే మనము శక్తిని అంగీకరించుచున్నాము. చిచ్ఛక్తి కాలమును కదలించుచున్నది. చిచ్ఛక్తి శుద్ధసత్వముచే ప్రేరేపింప బడుచున్నది. ఈ రెండును ప్రణవమునం దంతర్వ్యాప్తములై యున్నవి. కాబట్టి ఊహ్యాము అనూహ్యాము అయిన ప్రకృతి అంగవిశిష్టమై ఏకముగా నున్నది. సత్త్వము జ్ఞానము శక్తి సంబంధమయిన సూత్రములుగా కాలము దాని ప్రధానాంగముగా ఆవరణము మొదలయినవి తరువాతి అంగములుగా అది సంచలించుచున్నది. అన్ని పదార్థములు ప్రాకృతికములు అతిప్రాకృతికములు అయిన మూలద్రవ్యములను కలిగియున్నవి. ఇవి లేని వస్తు వేదియు కానరాదు. ఒక లాంతరును తీసికొనుము. అది మనకు కొంత మంచిని చేయుచున్నది. చదువుట వ్రాయుట మొదలయిన పనులకు ఉపయోగ పడునట్లు కాంతి నిచ్చుచున్నది. లాంతరులోని శుద్ధసత్త్వద్రవ్యమిది. దానియందున్న ప్రకాశగుణము జ్ఞానద్రవ్యము. అది దానిని నడపుకొనుచు మనలను నడిపించుచున్నది. దీపజ్వాల ఊర్ధ్వమున కెగయుచున్నది. తేజోవృత్తి యది. ప్రకాశగుణముయొక్క సూత్రమునకు బద్ధమై యున్నది. కాలద్రవ్యము కూడ దానియందున్నది. అది కొంత

కాలమే వెలుగగలదు. అంత కెక్కువ కాలముగాని తక్కువ కాలము గాని వెలుగదు. అందులో ఆవరణద్రవ్య మున్నది. పైకి క్రిందికి చుట్టు ప్రక్కల - ఇట్లు కొంత ఆవరణములోననే జ్వలింపగలదు, ఆ తరువాత ఆకాశము వేడి నీరు గాలి పృథివి ఇవియన్నియు అది వెల్గుట కవసరము. కాబట్టి పదార్థము లేక వస్తువు అది ప్రకాశించుటకు కావలసిన గుణము లన్నియు ప్రణవసూత్రముచే కూడిక నొంది కాంతికేంద్రముగా ఏర్పడు చున్నవి. ఈ విశ్వములోని ప్రతివస్తువును ఇదే తీరున పరిశీలించితిమేని ప్రతివస్తువునందును ఈ చెప్పబడిన మూలద్రవ్యములు లేక సూత్రము లన్నియు అంగవిశిష్టతతో ప్రత్యక్షము లగును. కాబట్టి ఈ విశ్వము కేవ లజడపదార్థము కాదు, బలముగల పదార్థ మన్నను సరిపోదు. పదార్థమే బలము. బలమే పదార్థము. కాబట్టి నిజమైన తాత్త్వికుడు ఈ విశ్వములో కేవలము బలమునో త్రాణనో చూచి తృప్తి నొందడు. అతని నేత్రములు ఋషిత్వముతో కూడినవి. కావున అత డన్ని పదార్థములలో మూలద్రవ్యము లయిన సత్త్వమును జ్ఞానమును గాంచును. ఈ లెక్కకు తప్పినదికాదు మనజీవితము. మనజీవితము ఒక విధముగా ప్రాకృతికము మఱియొక విధ ముగా అతిప్రాకృతికము. జీవితములోని అతిప్రాకృతికమే ప్రాబల్యము వహించును. జీవితములో సత్త్వము జ్ఞానము ప్రణవముయొక్క మూల సూత్రము లున్నవి. ఇవి కాక జీవితములోనే ఉండి ప్రకృతిపదార్థము లలో కనబడని మఱి మూడు సూత్రములు నాదబిందుకళ లనునవి యున్నవి. నాద మనగా నేమి? నాద మనగా భావధ్వని లేక శబ్దధ్వని. ప్రతివ్యష్టిజీవితము ఒక ప్రతిధ్వనిలోనుండి ఆవిర్భవించును. అది ఉన్నంత కాలము ఆ శబ్దముచే జీవించును. ఆ శబ్దమే ధ్వనింపవచ్చును లేదా మనస్సులో భావముగా బింబముగా అనుభూతిగా ఉండవచ్చును. అది సూక్ష్మమైనది ధ్వనిరూపమైనది. మఱి కళ అనగా నేమి? కళ అనగా ఒక జీవనగుణము లేక జీవనశక్తి. దీనిచేత జీవనము ప్రత్యేకము లేక

విశిష్టము అయ్యును జాతిజీవనమును నెరపును. ఈ కారణముచేతనే అంగవిశిష్టజీవితరూపము ప్రతిదియు తన విశిష్టత్వముకొరకు ప్రాకులాడును. సమయము వచ్చినప్పుడు అనంతాణువులుగా విచ్ఛిన్న మగును. ప్రతిజంతువు కూడ తన జాతిప్రకృతికై దేవులాడు స్వభావమును కలిగియున్నది. అయినను ప్రతిక్షణము దాని శరీరమున కూడియున్న అనంత పరమాణువులు వృద్ధికి గాని నాశనమునకు గాని రూపపరిణామమును బొందును. కళయొక్క స్వభావ మెల్లప్పుడు ఒక భాగముగా ఒక విభేదనసూత్రముగా పనిచేయును. ఇక బిందువనగా నేమి? బిందు వనగా అతిసూక్ష్మమైన ఒక ప్రాణాణువునుండి ఆవిర్భవించిన రూపము. జీవన బీజము ఒక మనస్సంబంధమైన అతిసూక్ష్మాంశము. జీవరసము నిజముగా ఒక త్రుటిలో జరుగు విషయము. ఈ బిందుసూత్రమున నాదకళలు అన్యోన్యాకర్షణముతో అన్యోన్యసంబంధముతో అంతర్వ్యాప్తములై యున్నవి. ఈ మూడును కలిసి జీవప్రకృతి యగుచున్నది. ఇవి అప్రత్యక్షమైన ఊహలు కావు. భౌతికమైన ఒత్తిడులు కావు. జీవితము అహంకారము మనస్సు జననమరణములు దృష్టిలో పెట్టుకొని చూడగా తోచెడి సత్యములు. ప్రణవము సత్త్వజ్ఞానములను కూర్చుకొని యుండు సూత్ర మయినట్లు బిందువు నాదకళలను కూర్చుకొనియుండు సూత్రము. జీవితము ఆత్మతో కూడి యుండుటయే దాని పరమరహస్యము. ఆత్మ ప్రకృతి కతీతమయిన విషయము. అది ఆధ్యాత్మికముగా జీవితముతో బద్ధపడి యున్నది. అందుచే అది జీవితమునే ప్రకృతి కతీతమయిన దానినిగా జేయును. మన నరములలో కండరములలో ప్రసరించుచున్న జీవితములో ప్రతివాదనము పునరుత్పత్తి జీర్ణక్రియ అనువాని లక్షణము లున్నవి. ఈ లక్షణములు సామాన్యముగా జంతుజీవితములోను వృక్షజీవితములోను కలవు. ఈ మూడు లక్షణములు ఉన్నవా లేవా అని విచారించుట మొదలుపెట్టి ఒక మానవుని నాడి

ఒక వృక్షమును గాని చూచినప్పుడు రెంటికిని భేద మేమియు ఉండదు. ప్రతివాదనము అనగా నేమి? ప్రతివాదన మనగా ఒక ఉత్తేజనమునకు ఇచ్చు ప్రత్యుత్తరము. ఈ లక్షణము జంతువులలోనను వృక్షములలోను కలదు. నీ వొక తుపాకి చప్పుడును వినుటతోడనే అదరిపడుదువు. ప్రతివాదన మనగా ఇది. నీ వొక చెట్టుప్రక్క తుపాకిని ప్రేల్చినచో చెట్టు అదరి పడదు. అంతమాత్రమున చెట్టునకు ప్రతివాదనము లేదనుటకు వీలులేదు. చెట్టు నీవలెనే స్వేచ్ఛగా నున్నచో సరిగా నీవలెనే అదరిపడి యుండెడిది. కాని దాని వేళ్లు అది కదలకుండ భూమిలో అల్లుకొని యున్నవి. అందుచే అది అదరి పడలేదు. నీ కాళ్లు చేతులు బంధించి నీ కన్నులకు గంతలు కట్టి నిన్నెవరయినను కొట్టినచో నీలో ప్రతివాదన ముండదు. చప్పట్లు కొట్టలేవు. నీ అవయవములను కదలింపలేవు. నీ బాధను గూర్చి నీ వేమియు ప్రకటింపలేవు. చెట్టు ఇదే స్థితిలో నున్నది. అనగా కాలు చేతులు కట్టబడి పడియున్నవాని పగిది. భూమిక్రింద విస్తరించిన నరము అల్లిన బిల్లిన వేళ్ల అల్లిక కలదు. అది చెట్టును అది యున్న చోటును కంటిపెట్టుకొని యుండు నట్లును కదలకుండు నట్లును బంధించి యున్నవి. నీవు వేళ్లను చాలవరకు కోసివేసి దాని ప్రక్కన తుపాకి ప్రేల్చుము. చెట్టు అదరిపడును. మానవున కున్నట్లు చెట్టునకు నరము లున్నవి. మానవున కున్నట్లు మన స్సున్నది. చెట్లకు కూడ బిడ్డ లున్నారు. అందు కూతుళ్లు కొడుకులు కలరు. ఇది పునరుత్పత్తి. జీర్ణక్రియ అనగా నేమి? జీర్ణక్రియ అనగా మనము తిను ఆహారమును రక్తముగా ఎముకలుగా మార్చుట. చెట్లు కూడ భౌతికశక్తులయిన సూర్య కాంతిని నీటిని మట్టిని గాలిని స్వీకరించి వాని శరీరములోని ద్రవ్యములుగా మార్చుకొనును. చెట్లు గాని జంతువులు గాని అన్నియు ఒకే రీతిగా జీవించును. ఒకే రీతిగా గాలిని పీల్చుకొనును. సూర్యకాంతిని ఉపయోగించుకొనును. ఇక ఆత్మ అనునది దానియం దెక్కడ అని

నీ వడుగవచ్చును. దీనికి సమాధాన మే మనగా నీ కొక ప్రశ్న వేసె దను. మానవశరీరములో నీ వాత్మ నెక్కడ చూచితివి? నిజముగా అది మానవశరీరములో ఎక్కడను చూడబడుట లేదు. ఎవ్వరును దానిని హృదయములో గాని మెదడులో గాని చూడలేదు. అయినను శరీరములో ఆత్మ ఉన్నది అనుచున్నాము. ఆ ప్రశ్నకు సమాధానము చెప్పుట గాని, అర్థము చేసికొనుట గాని మన స్తత్వశాస్త్రరీతిగా జరుగ వలసి యున్నది. నేను అను జ్ఞానము నీ అనుభూతిలో ఉన్నది. నేను సుఖముగా నున్నాను, నేను నడచుచున్నాను, నేను దుఃఖించుచున్నాను, నేను నిద్రించుచున్నాను, అని నీవు చెప్పుదువు. ఈ నేను అను జ్ఞానము ఆత్మకు చిహ్నము. కాని అది ఆత్మ కాదు. ఎందుకనగా శరీరము మర ణించినను ఆత్మ కలదు. కాని శరీరము మరణించిన పిదప నేను అను జ్ఞానము పోవుచున్నది. ఆత్మ లేకున్న యెడల నేను అను జ్ఞానము లేదు. ఈ నేను అను జ్ఞానముచేతనే ఈ శరీరభాగము లన్నియు మనస్సు ప్రేమానుబంధములు కూర్పబడి యున్నవి. ఈ శరీరము సూక్ష్మము లయిన అనేకభాగములుగా విభజింపబడి యున్నది. అవి యన్నియు ఒక దానిలో నుండి ఒకటి విడిపడి పోగలవు. వీని నన్నింటిని కూర్చి పట్టి ఉంచగల సూత్రము అవసరము. లేకున్న కండ్లు తలనుండి ఊడిపడును. చేతులు మొండెమునుండి జారిపడును. ఇట్లు జరుగును. ఈ సూత్రము ఊహ కాదు. పరమసత్యము. ఒక స్వయంచేతనద్రవ్యము. అది అక్షరము శాశ్వతము. దానినే మనము ఆత్మ అనుచున్నాము. ప్రాణము గల ఈ శరీరము ఆత్మచే ప్రేరేపింప బడుచున్నది. అదే విధముగ వృక్షములు గూడ ఆత్మచే ప్రేరేపింపబడుచున్నవి. ఎట్లు? వృక్షములు ఆత్మప్రేరి తము లెట్లగుచున్నవి? ఎట్లనగా మనము అన్వేషించుచున్నట్లే అవి కూడ మూడు విషయములను అన్వేషించుచున్నవి. అవి ఏవి అనగా స్వతా దాత్మ్యము స్వక్షేమము స్వావినాశము. ప్రతివాడు తన తాదాత్మ్యమును

నిల్పుకొనుటకు వాంఛించును. నీ జీవిత మంతయు నీవు నీవుగా ఉండు టకే కోరుదువు. ప్రకృతిమాయచేత నీవు రఘుమహారాజుగా మారితి వనుకొనుము. నీవు ఆశ్చర్యపడుదువు. నీవు నీవుగా గాక మఱియొక వ్యక్తిగా ఉండుటకు ఇచ్ఛయింపవు. ఏబదియో అరువదియో సంవత్సర ములు జీవించినను, చచ్చి పరలోకములోని కేగినను తాను తానుగా నుండుటకే తనను తననుగా లోకము గుర్తింపవలయు ననియే ప్రతివాని అభిలాష. తన తాదాత్మ్యమును నిల్పుకొనవలయు ననియే ప్రతిమానవుడు ప్రతివృక్షము దేవులాడుచున్నట్లు కనుచున్నాము. ఇదే స్వతాదాత్మ్యము. ఇక రెండవది స్వక్షేమము. నీకు చలికాలమున కప్పుకొనుట కొక శాలువా కావలెను. తినుటకు కమ్మని ఆహారము కావలెను. నివసించుటకు ఒక చక్కని గది కావలెను. ఇట్లే ఎన్నో కావలెను. నీవు ఎల్లప్పుడు స్వక్షేమమునకు ఎన్నో వెతకుటయే కాక ఇతరులు నీకు కావలసిన వానిని వెతకి పెట్టవలెను. అట్లే జంతువులు, వృక్షములు. నీ వడవిలోనికి పోయి చూడుము. చెట్లు సూర్యుని దిక్కునకు చూచుచుండును. అన్నివైపులకు విస్తరించి యుండును. ఎందుకో తెలియునా? వీలయినంత సూర్యకాంతిని గాలిని లోనికి గ్రహించుటకు. కొండమీద అంచుల నున్న చెట్లు లుంచు లోనికి వంగి యుండును. ఎందు కనగా తుపానుదెబ్బల తట్టుకొనుటకు. నది ప్రక్క నున్న చెట్లు నదిలోని భూమికి ఎక్కువ వేళ్ళను పంపును. ఎందుకు? ఎక్కువ చెమ్మను సంగ్రహించుటకు. ఈ ప్రకారము సహస్ర విధముల సృష్టి అంతయు స్వక్షేమమును అన్వేషించుచున్నది. ఇక మూడవది స్వావినాశము. తాను మరణించుట ఎవ్వడు కోరడు. ఒక కసాయివాడు ఒక గొఱ్ఱెను చంపబోవుచున్నప్పుడు అది యెంత అనిష్ట మును చూపునో ఒక చెట్టును పడవేయునప్పుడు ఎంత కష్టమై అది పడుట కెంత అనిష్టమును చూపునో నీవు చూచియే ఉందువు. నీవు చేపలు పట్టుటను చూచియుండినచో చేప చచ్చుట కెంత కష్టమును అనుభవించునో

చూచి యుందువు. ప్రతివాడును తన జీవితమును దీర్ఘాయుర్వంతము కావలయు నని వాంఛించును. ధనికుడు తన శరీరము నెంత సున్నిత ముగా జూచునో ఎంత శ్రేష్ఠమైన ఔషధము ఉపయోగించునో ప్రతి స్వల్పబాధకును వైద్యవరు నెట్లు పిలిపించుకొని తన శరీరము నెట్లు కాపాడుకొనునో చూడుము. ఇది స్వావినాశకాంక్ష. ఇది సృష్టిలోని ప్రతివస్తువునం దున్నది. ఈ అహంత లేక నేను అను జ్ఞానము ఈ మూడు భావములతో జీవు లన్నింటిలో చేరి కదలించుచున్నది. ఇక మానవుని విషయములో ఈ మూడుభావములు ఎక్కువగా విలువకట్టబడి నట్లు మనకు తెలియును. స్వతాదాత్మ్య మనగా వివేకవంతు డెట్లు అర్థము చేసికొనును ? అత డీ శరీరముతో నున్నను లేకున్నను అతని ఆత్మ అక్షరమై అమరమై దేవునితో చేరి తన తాదాత్మ్యమును నిల్పుకొన వలయు నని ఆశపడును. స్వక్షేమమున కతని తాత్పర్య మేమి ? ఊఱక బ్రతుకుట కాక సద్గుణములు కలిగి జ్ఞానము నార్జించి, దేవుని ప్రేమించి ఆత్మ నెఱుంగుటయే స్వక్షేమ మని అతడు భావించును. ఇక మరణము సంభవించినను దురదృష్టము పైబడినను అతని ఆత్మ ఎన్నటికిని నాశము నొంద దని దుఃఖము నెన్నటికిని అనుభవింప దని అతని విశ్వాసము.

ప్రకృతియొక్క ప్రధానలక్షణము విచ్ఛేదము. అనగా విసంయో గము విద్రావణము. మన శరీరము పుట్టిన త్రుటినుండి క్రమముగా నెమ్మ దిగా దహించుచున్నది. విచ్ఛేదము నొందుచున్నది. ద్రవించిపోవుచున్నది. నిజముగా మానవుడు మృత్యువును పుక్కిట బెట్టుకొని పుట్టినాడు. మనము పెరుగుచున్నా మని జీవించుచున్నా మని పెద్దయగుచున్నా మని చెప్పు కొనుచుందుము. కాని యదార్థముగా మన అల్లిక జీర్ణమగుచున్నది. మన కండరముల సార మయిపోవుచున్నది. మన మెదడు కరగిపోవుచున్నది. వృక్షజాతులకు జంతువులకు మాత్రమే అన్వయమగు సూత్రము కా దిది. ఇది మన గోళము సూర్యగోళము నక్షత్రగోళము మొత్తమున కన్వ

యించు శాసనము. ఎందుకనగా ఈ విశ్వమంతయు చేయబడిన పదార్థ మొక్కటియే. అది విద్రావణద్రవ్యము. ఈ ప్రకారమునుండియే ఈ భూమిపై విషాదాత్మకకవిత్వము ఉత్పన్నమైనది. మన పురాణములు మన కథలు మన కావ్యములు అన్నియు విలాపగీతములు. స్నేహము లంత మగును, ఇండ్లు కూలును, రాజ్యములు విచ్ఛిన్నము లగును. ఆరంభించిన వన్నియు అంత మొందును. కలసి వసింపగోరి వచ్చిన వా రందఱు తుదకు ఎడబాటు నొందుదురు. ఈ మన ప్రకృతిహృదయాంతరాళమున దుఃఖమే కలదు. అందుకే మనము దుఃఖముతో నిండి యున్నాము. పడుచున్న వృక్షము జారుచున్న నక్షత్రము మృతకళేబరము కన్నీరుగార్చుచు వాలిపోవుచున్న మన శీర్షము ఇవి మన మెఱిగిన విషయములు. ప్రతి మానవుడు ఈ వియోగబాధ ననుభవింపవలసియే యున్నది. నీవు ప్రపంచయాత్రచేసి ప్రతిదేశమున ప్రతి గృహమునకు అతిథివై ఆ గృహస్థున కాప్తు లెవరయిన మరణించిరేమో అడిగినచో అవు నన్న మాటయే విందువు. ఈ ప్రకారము ఎడతెగని చరిత్ర కందని శాస్త్రమునకు చిక్కని కాలములో ఈ భూగోళమును మృత్యు వాసించి యున్నది. ఒకానొక నాడు మన పలుకులు మన సంబరములు మృత్యువులో అణగారి పోవును. ప్రకృతి చరితము ఇది. కాని ఆత్మరూపులమయిన మనను అది తాకదు. అగ్ని కాల్చదు. నీరు కరగింపదు. మన విధి భిన్నమైనది. మననుండి ఈ శరీరము దాని సర్వేంద్రియములతో జారి పడిపోయిన పిమ్మట మన మేమో ఎట్టి అనుభవమును పొందుదుమో ఎట్లుందుమో ఊహించుటయే దుర్లభము. మరణానంతరస్థితి ఊహింపలేక పోవుటయే భయహేతువు. ఇట్టి స్థితిలో యోగ మక్కఱకు వచ్చును. ఈ శుద్ధసత్యము నెఱుగుటకు యోగము మనకు శాస్త్రీయమార్గమును చూపుచున్నది. మరణానంతరము ఏ అనుభవమును పొందుట ఎట్లుండుట ఎట్లాచరించుట యను విషయములను యోగ మెట్లు కనుగొనుచున్నది? అది రెండు తీరులు. మొదట

యోగి ప్రకృతి విషయములకు ఆధ్యాత్మికవిషయములకు భేదమును తెలిసికొనును. అత డిట్లనును ' నేను పృధివిని కాను ద్రవ్యమును కాను. ఎందుకనగా పృధివ్యాపస్తేజోవాయ్వాకాశములతో చేయబడిన శరీరమును నేను కాను ' అని. పృధక్కరణ విధాన మిది. విభాగించి ఇట్లు చూచుటచే అతడు ప్రకృతిద్రవ్యములనుండి తనను వేరుగా చూచును. అటుపిమ్మట ఆధ్యాత్మికవిషయములతో తనకు తాదాత్మ్యమును సాధించుకొనుట నేర్చు కొనును. అప్పు డత డి ట్లనును. 'ఈ నా ఆత్మ శాశ్వతముగా సత్స్వ భావము గలది. ఈ నా ఆత్మ నిరంతరముగా శుద్ధమైనది. జ్ఞానము కలది. ఈ నా ఆత్మ అనాదిగా ఉనికి గలది, ఈ ప్రాకృతికాంశములు జారి పోయిన పిమ్మట ఈ నా ఆత్మ శాశ్వతముగా నిలచునది ' అని. కాని ఈ వివేకము సర్వవస్తువులలో ఆత్మను గుర్తింపని వానికి వచ్చునది కాదు. జిజ్ఞాస గల శిష్యుడు ఎక్కడెక్కడ ఆత్మ కలదో అక్కడ ప్రాణ మున్నదనియు, ఎక్కెడెక్కడ ప్రాణ మున్నదో అక్కడ బాధానుభవ మున్న దనియు గుర్తింపవలయును. అందులకే యోగి తనను తాను ప్రేమించు రీతి సర్వవస్తువులను సర్వపదార్థములను సర్వప్రాణమును ప్రేమించును. అందుచేతనే యోగి మనోవాక్కర్మలలో నిగ్రహము గల జీవితమును గడపును. ఎవరికిని హాని చేయడు. ఎవరికిని బాధ కలిగిం పడు. ప్రతివానినుండి నేర్చుకొనును. ప్రతివానినుండి అనుట ఎందులకో తెలియునా ? వస్తు వని యన్నచో నీవు వేరుగా తలతువు. ప్రతిచోట ఆత్మయే కలదు. కాబట్టి ఎల్లయెడల వస్తు వని కాక ఆత్మ అనియే భావిం చుట నేర్చుకొనుము. నీ దేశమునందలి ప్రతిబిడ్డయు ఆత్మభావన చేయుట నేర్చుకొనినచో ప్రతి వస్తువును జీవాత్మనుగా భావించుట నేర్చుకొన్నచో నీ దేశ మొక స్వర్గసీమ కాగలదు. నీ దేశమునుండి ఇతరదేశము లన్నియు నేర్చుకొనును. ఎందుచేత ? అందఱు ఆత్మజ్ఞానమునకై పరి తపించుచున్నా రని యెఱుగుము. మానవు లందఱు ఆత్మ ఎల్లకాలము

ఉండుననియు మరణింప దనియు గ్రహించినచో ఎన్ని పాపములు ఎన్ని హింసలు తొలగిపోవునో యోచింపుము. అప్పుడు ఒకని ప్రాణము నొకడు తీయడు. యుద్ధములు ఆగిపోవును. కాని యిప్పటి కాలమున దేశప్రజల కన్నులలో దుమ్ము నిండినది, వా రాత్మను చూడలేకున్నారు. వా రాత్మనుగూర్చి తలచుటకు శక్తి లేకున్నారు. గతించిన రెండు వందల సంవత్సరములనుండి గొప్పగొప్ప శాస్త్రవేత్తలు ఆత్మసిద్ధాంతమును పూర్వపక్షము చేయుచు గ్రంథములు వ్రాయుచున్నారు. విశ్వవిద్యాలయములలో పాఠ్యగ్రంథములన్నియు ఆత్మయొక్క అస్తిత్వములో విశ్వాసములేని వారిచేత వ్రాయబడుచున్నవి. ఇందుచే యుద్ధము హత్య సర్వపాపము వచ్చుచున్నది. ఇందుచే ఒక పెద్ద అసహనము ఆదర్శ మనునది పూర్తిగా లేకపోవుట సద్గుణము అనున దొక్కటియు లేకుండుట సంభవించినవి. కాబట్టి నీ ఆత్మను ధ్యానించుట నేర్చుకొనుము. నీ ఆత్మనుండి శుద్ధసత్త్వ మావిర్భవించును. చిచ్ఛక్తి పుట్టుకొనివచ్చును. ఆత్మనుండి పుట్టిన బలసంపన్నము లయిన ఈ రెండు దేవతామూర్తుల సహాయముతో ఈ మలినభూమిపైకి కొంత స్వర్గసౌందర్యమును కొని రాగలుగుదువు. నిరంతరముగా నీలో నీ వి ట్లనుకొనుము. ' నే నాత్మను గాని శరీరమును కాదు. నేను కాంతినిగాని చీకటిని కాదు. నేను ప్రేమను గాని ద్వేషమును కాదు ' అని. భారతీయమహర్షులు ఈ విశ్వమును ఒక మహారవిందమునుగా భావించిరి. ఈ విశ్వారవిందమే పరమాత్మ. మన వెన్నెముకలో అరవిందములు ఉన్నవనియు అధోరవిందమును ఊర్ధ్వారవిందము చేరువకు కొనివచ్చుటయే యోగముయొక్క లక్ష్య మనియు ఈ రెండు అరవిందములు కలియుటయే మానవుని మోక్ష మనియు నీ కిది వరకు చెప్పియుంటిని. ఇది ప్రస్తుతము నీకు తెలిసికొనుటకు శక్యము కాని విషయము. అయినను నీవు శ్రమపడుచో ఆత్మయొక్క కాంతితో కృషిచేయుచో మనఃపూర్వకత్వము ధ్యానము అనువాని శక్తులను చక్కగ

వినియోగించుకొనినచో ఈ పరమసత్యము నీకు విశదము కాగలదు. దీనిని అర్థము చేసుకొనిన వానికి పాపము గాని మరణము గాని ఉండదు. ఈ బహిరావరణములో హృదయాంతరావరణ మున్నది. అదియే హృదయా రవిందము. ఈ అంతరరవిందమును ఏకాగ్రముగా ధ్యానింపుము. ఇట్లు అంతరరవిందముపై ధ్యానము నిలుపునపు డెల్ల బహిరరవిందము దాని శక్తిని దానిసౌందర్యమును దాని వైభవమును నీకు సమర్పించును. యోగిని సేవించుటకు ఈ విశ్వము బద్ధపడి నిలచును. వివేకియైన యోగి చూచుచో ప్రకృతిలోని పదార్థము లన్నియు అనుక్షణము తమ రహస్యములను బయల్పరచుచుండును. మోక్షమహానిధిని వినియోగించుట అనగా నిరం తరసమాధియే. పగళ్ళు రాత్రులకు చేర్పగా రాత్రులు ఉదయ కాలము లకు అందింపగా ఈ జీవప్రకృత్యరవిందమును ప్రేమతో ధ్యానింపుము. ఆ అరవిందము మధువును క్రుమ్మరింపగా సచ్చిదానందము లను మూడు నదులు దానిని గొని ప్రవహించుచు నీ ఆత్మ అను సముద్రములో గలియు చున్నట్లు ధ్యానింపుము.

# ఆశ

'నేను రక్షకుడను. నన్నెవరు ప్రేమించినను వారు రక్షింపబడు దురు' ఇది దేవుడు స్వయముగా చేసిన ప్రతిజ్ఞ. మన ఆధ్యాత్మికమైన ఆశకు ఈ మాటలు పునాదిరాళ్లు. ఆయనయే ఇంకను ఇట్లు చెప్పి యున్నాడు. 'నన్ను ప్రేమించు వారలు నేను—కాని దానిని ప్రేమింప రాదు' అని. ప్రేమకు పరీక్ష భక్తియొక్క ఏకాగ్రత. 'నీవు నన్నే ప్రేమింపుము. నేను—కాని దానిని ప్రేమింపకుము.' ఈ వాక్యములో నేను—కానిది అనగా నేమి? నేను—కానిది అనగా ప్రకృతిద్రవ్యము. దేవుడు ఎందుకు మనలను నేను—కాని దానిని ప్రేమింపకుము అని శాసించినాడు? ఎందుకనగా ఈ నేను—కానిది మనకు బాధను మరణమును కలిగించును. అయినను పసితనమునుండి వృద్ధాప్యము వరకు మానవుడు ఈ నేను—కాని ప్రకృతిపదార్థమునే ప్రేమించుచున్నాడు. అతని శరీరము ప్రాకృతికము అతని ఆహారము ప్రాకృతికము. అతని గృహము ప్రాకృతికము. అందుచే అతడు ప్రకృతిని ప్రేమించుటలో వింత లేదు. అతడు యౌవనమందు తన ప్రాకృతికవస్తుసామగ్రివలన సంతృప్తి నొందుట లోనను వింత లేదు. ఏబది సంవత్సరముల వాడు తన ప్రాకృతికసంపద సురక్షితముగా నున్నదనియు దాని రక్షణకొఱకు శాసనసహాయము రక్షకభటసహాయము తీసుకొనవచ్చుననియు యెఱిగి తృప్తితో జీవించును. వార్ధక్యము వచ్చి అతడీ జీవితమును వీడవలసి యున్నప్పుడు 'నే నీ ధనమును గృహమును గుఱ్ఱములను ప్రేమించుచుంటిని. కాని ఇవి అన్నియు నన్నీ మృత్యువునుండి ఇప్పుడు రక్షింప లేకున్నవే' అని యనుకొని నిరాశాహతుడై ప్రాణములు విడుచును. అతడు రక్షింపబడ

లేదు. అతడు దేవుని వాక్యమును అనుసరింపలేదు. అతడు దేవుని ప్రేమింపలేదు. నేను—కాని దానిని ప్రేమించినాడు. అట్టి మానవుడు ప్రకృతివస్తువులను ప్రేమించుట అసహజము కాదు. ప్రకృతిపై దృష్టి తప్ప ఇంకొక దృష్టి అతనికి లేదు, అందుచే అతని ప్రేమ అంతయు ప్రకృతిమీదనే కేంద్రీకరింపబడినది. కాబట్టి ప్రకృతి అతని కిచ్చిన సంతోష మంతటికి బదులుగా అతనిపై అది తెచ్చిపెట్టిన బాధను అనుభవించుచున్నాడు. ఈ ప్రకారము ఒకానొక కాలమునకు అది సుఖప్రదమని తలచుట మానివేయుచున్నాడు. అట్టి మానవుని హృదయాంతరాళమున శుద్ధసత్యస్వరూపమైన ఆత్మ అచంచలముగా నున్నది. ప్రకృతి ప్రవాహతరంగములచే త్రోయబడి అత డీ జన్మకు వచ్చినాడు. అట్లే ఆ ప్రకృతితరంగముచే త్రోయబడి అత డీ జన్మనుండి ఆవలకు పోయినాడు. అట్టి మానవులు కేవలము ప్రాకృతికాణువులు. ఇ ట్లెందుకు జరుగుచున్నది? ఆలోచనాపరుడైన ప్రతివాడు జాగ్రత్తగా ఆలోచింపవలసిన విషయ మిది. మానవునకు తాను శరీరమే అని అనుకొనుట సహజమగుచున్న దెందుచేత? 'పూరణము' అను ప్రకృతిధర్మము ననుసరించి ఇట్లు జరుగుచున్నది. పూరణ మనగా నేమి? మనము జన్మించిన క్షణమునుండియే రక్తము హృదయము నరములు ఊపిరితిత్తులు శరీరములోని ప్రతిసూక్ష్మరంధ్రము క్రమముగా ఒక ప్రకృతిధూళిప్రవాహముచే నింపబడుచున్నది. ఈ క్రియ బాహ్యప్రకృతిలో కూడ మనము చూడగలము. నదులు సరస్సులు పర్వతములు సయితము ఈ ధూళిచే పూరింపబడుచున్నవి. మానవశరీరములోని గ్రాహకభాగము లన్నియు క్రమక్రమముగా ఈ ప్రకృతిధూళితో నిండిపోయి ఆత్మభావమునకు తావు లేకపోవుచున్నది. ఈ కారణముచే మానవుడు బాల్యమునుండియే యోగబోధకు అలవాటు పడని యెడల ఆత్మనుగూర్చిన భావనను పెంపొందించుకొనుట కడు దుర్లభ మగును. రక్తనాళకేంద్రములలో పేరుకొనిన

మాలిన్యము నంతటిని తుడిచివేయుట దుస్సాధ్యమైన పని. ఈ పూరణ క్రియకు దోహదము లయిన మార్గము లనేకము లున్నవి. కొంత మన స్నేహితులు దోహదము చేయుదురు. ఒక స్నేహితుడు నిన్ను ధనము సంపాదింపు మనియో ఐశ్వర్యమును పెంచు మనియో సలహా చెప్పినా డనుకొనుము. అప్పుడు నీలో ఈ పూరణక్రియ వేవేగ పనిచేయును. లేక నీవే ఇతరుల విజయమును జూచియో వైభవమును జూచియో తీవ్ర కాంక్షను పెంచుకొందువు. అప్పుడు నీ వాంఛ ప్రకృతిని ఒత్తిడిచేయును. ఆ ఒత్తిడికి నీలోని ఆధ్యాత్మికజీవితప్రవాహనాళికలు ఎండిపోవును. ఈ పూరణక్రియ జరుగు మఱియొక సూక్ష్మమైన మార్గ మున్నది. ఇది నక్షత్రములు గ్రహములు మొదలయిన వానివలన జరుగు దోహదము. వీనిని మనము సామాన్యముగా నిగ్రహింప లేము. కొందఱు ఉన్నతమైన విషయములు నేర్చుకొన వాంఛింతురు. ఉత్తమజీవితమును గడుప కాంక్షింతురు. కాని పరిస్థితులు వారి నట్టి ఉద్యమములు సాగింప నీయవు. వారు నూతనోద్యమ మేదియైన ఆరంభించినపు డెల్ల అనాలోచిత మేదో అంతరాయము వారి నడగించును. వా రాగిపోదురు. అట్టి మానవుల జీవిత మొక దుర్దినము, అనగా మేఘచ్ఛన్నమైన దినము. తారారహి తము చంద్రవిహీనము. తుదకు వారు గుండె పగిలి చనిపోదురు. వారి ఈ అపజయమునకు కారణ మేమి ? అ య్యంతరాయములు బహుదూర మునుండి మన నిగ్రహశక్తులు పోరాని స్థలమునుండి వచ్చినవి. ఇతర దేశములందలి విశ్వవిద్యాలయములలో చదువుట కెందఱు విద్యార్థులు పంపబడుట లేదు ? పిల్లవా డమితోత్సాహముతో పెద్ద ఆశతో బయలు దేరి పోవును. బాగుగ చదువవలె ననియు, చదువులో పెద్ద పట్టములు పొందవలె ననియు దీక్షతోనే పోవును. కాని అత డచటికి పోవుటతోడనే చెడు సావాసములు ఏర్పడును. లేదా ఒక ఆడపిల్లవలపువలలో చిక్కి ఆమెను చేబట్టి తా నెందుకు వచ్చినది మఱచి పోవును. పిమ్మట ఆ

వివాహము విషయించి విషాద మొంది భ్రష్టజీవనుడై బాగుపడు అవ
కాశము లన్నియు జారిపోయి పతితు డగును. ఆధ్యాత్మికమైన యోగ
జీవితమునందును ఇదే స్థితి. యోగాభ్యాసము చేయువాని మార్గమునందును
వేలకొలది విఘ్నము లాసన్నము లగును. కాని ఈ విఘ్నములు వచ్చు
టలో గల తత్త్వ మేమి? అది అర్థ మగుట మిగుల కష్టము. దాని నీ
తీరున అర్థము చేసికొన వచ్చును. ప్రకృతిలోని ప్రతిపదార్థమునకు రెండు
విధములయిన శక్తు లున్నవి. ఒకటి ఆకర్షించు శక్తి. రెండవది నిద్ర
బుచ్చు శక్తి. ఒక వసంతసాయంతనమున వాహ్యాళికి బోయి కోకిలా
రావమును విందువు. ఆ ధ్వని ఆకర్షణీయముగా నుండును. దానిని విను
చుండగా నీ నరములకు సుఖవిశ్రాంతి అబ్బిన ట్లుండును. భౌతికముగా
కాకున్నను రసాత్మకముగా నీవు నిద్రపోవుచున్నా వనవచ్చును. నీకు
తెలియకుండగనే పికీగానము నిన్నా వైపు మరలించుకొనుటలో కృతార్థ
మైనది. నీ వా పారవశ్యమున ఉన్నంత సేపు నిద్రించి యున్నట్లే. మరి
యొక విషయము. నీ తమ్ముని ఒక్కని హార్వర్డు విశ్వవిద్యాలయమున
అయిదేండ్లు చదువు మని పంపినా వనుకొనుము. ధనమును కూడబెట్టుటకు
నీ పష్టకష్టములు పడితివి. అతడు చక్కగా చదివి ఇంజనీరై వచ్చునని
విశ్వసనీయముగ పలికినాడు. అతడు ధనము గొని ప్రయాణమై వెడలి
నాడు. ఆ పిమ్మట నీ కే వార్తయు లేదు. సంవత్సరములు గడచినవి.
అతడు గతించినా డని భావించితివి. బహుకాలమునకు నీకు సంగతులు
తెలిసినవి. ఏ మని? ఒకనాటి సాయంకాల మతడు హోటలులో ఒకని
కలిసినాడు. అతడు అలాస్కాలో బంగారుగనులు కలవనియు అచ్చటికి
బోయిన లక్ష్మిని వెంటగొని రావచ్చు ననియు చెప్పినాడు. ఈ వాని మా
మాటలకు వశుడై వానితో ఆ మరునాడే అలాస్కాకు ప్రయాణమైనాడు.
అక్కడ వానితో పాటు గనిలో కూలిపని చేయుట కారంభించి బహు
సంవత్సరములు గడపి విసిగి వేసారి పడరాని పాట్లు పడి వచ్చెనేని

వ్యర్థుడై యింటికి చేరినాడు. తనను క్షమింపుమని నీ కాళ్లపై బడి సూటిగా ఏడ్చెనను మొదలుపెట్టుదు ననియు ఈ సారి చెప్పిన మాట వింద ననియు వాగ్దానము చేయును. కాని కాలము మీరినది. అతని జీవితము వ్యర్థమైనది. బంగారములోని ఆకర్షణశక్తి అతనిని విధులు మఱచునట్లు చేసినది. మన మతనిని దూషింపవచ్చునా? అతని విషయమేమియు తెలియనప్పుడు చెడు సావాసములు మరిగి పాడైనా డని నీ స్నేహితులతో చెప్పియుందువు. కాని నిజము తెలిసిన పిదప ఏమి జరిగినది? ఆ మనుష్యుడు చెప్పిన బంగారమును గూర్చిన మాటలు అతని మనసును నిద్రబుచ్చినవి. ఆ నిద్ర మనము రాత్రివేళ నిద్రించు నిద్రవంటిది కాదు. అది కొంతకాల ముండును. అతని ఇక్కట్లు అతనిని కొట్టి ఆ నిద్రనుండి మేల్కొల్పినవి. అతడు జాగ్రత్తలోనికి వచ్చినాడు.

ఈ ఉదాహరణను పరిశీలించి దీని నుండి సారమును గ్రహించితివా నీకు జీవితములోని రహస్యము సొంతము అర్థమగును. ప్రతిజీవి విషయమున ఇదే జరుగుచున్నది. పసిబిడ్డ పుట్టిన క్షణము నుండియు గాలిని పీల్చవలసి యున్నది. గాలి ప్రకృతిపదార్థము, కావున దానికిని రెండు శక్తు లున్నవి. ఆకర్షించుట, నిద్రబుచ్చుట. బిడ్డడు మొదట గాలికి దాసు డగుచున్నాడు, తరువాత నీటికి, అట్లే క్రమముగా అన్నిటికి. మన శరీరముపై తమ ప్రభావమును జూపు ఎన్నిటినో మనము చూచుచున్నాము. వేడి గాలి చలి వెలుతురు ఆహారము వ్యాయామము స్నేహము ప్రీతివి మన జీవితముపై దాని భౌతికప్రభావమును కొంత పడవేయుచునే యున్నవి. పై సోదరుని కథలో బంగారము యొక్క ప్రభావమును మాత్రమే చూచితిమి. కాని ప్రతిమానవుడు సూర్యచంద్రాగ్నిపృథివ్యాపోవాయునక్షత్రవృక్షాదులచేత ప్రభావితు డగుచున్నాడు. ఫలితముల సంపుటీకరణమే మానవశరీరము. శరీరములోని ప్రతిభాగము అనగా చర్మము రక్తము మాంసము ప్రతిసూక్ష్మరంధ్రము ప్రతిసూక్ష్మాంశము

కూడ ఒక విధమయిన నిద్రలో మునిగి యున్నది. కాని దైవసంబంధమైన మెలకువ ఈ శరీరమునకు రానంతవరకు మానవునకు జాగ్రత్త లేదు. అట్టి మెలకువతో ఈ విశ్వమునకు వ్యష్ట్యాత్మకు ప్రాధాన్యత తగ్గును. ఇదొక కఠినమైన తత్త్వము. దీనిని గూర్చి నీ విప్పుడు బాధపడ నవసరము లేదు. యోగముయొక్క లక్ష్యము మానవుని మేల్కొల్పుట అని మాత్రము గ్రహింపుము. ఈ నిద్ర మిక్కిలి బాధాకరమైనది భయంకరమైనది. ఈ నిద్ర పాప మని ఈ మెలకువ ఆత్మజ్ఞాన మని చెప్పినచో అతిశయోక్తి కానేరదు. ఈ పూరణధర్మమువలన శరీరము దేవుని యొక్కయు ఆత్మ యొక్కయు ప్రభావమున కెల్లెల్లు దూర మగునది చూచియున్నావు. ఆత్మధర్మమే మెలకువ. యోగభాషలో చెప్పుచో మెలకువ వచ్చినయెడల మనకు బాధ అనునది తదాది కలుగదు. మనకు మెలకువ కలిగిన యెడల జన్మించితి మనికాని, మరణించితి మనికాని అనుకొనము. జననమరణములు స్వప్నభావములు మాత్రము. వానిలో ఆధ్యాత్మికసత్యము లేదు. ఆత్మకు జననమరణములు లేవు. ప్రకృతిలో రక్షకసూత్రములు కొన్ని పనిచేయుచున్నవి. దేశకాలములకు సంబంధించినట్టియు పృథివ్యాపస్తేజోవాయ్వాకాశములకు సంబంధించినట్టియు అణువులు ఈ ఆకర్షించుట నిద్రపుచ్చుట అను ధర్మములను కలిగియున్నవి. ఈ మోసము చేయుచున్న వవియే. అవి నిరంతరముగా మన శరీరము లోనికి ప్రవాహరూపమున ప్రవేశించుచున్నవి. మన కిష్ట మున్నను లేకున్నను అనుక్షణము మనశరీరము వానితో నిండిపోవుచున్నది. అగుటచే ఇక మీరు నాలోనికి ప్రవేశింపవలదు అని చెప్పుట దుర్లభము. రక్షక సూత్రములు మూడు ప్రకృతి కతీతములు పనిచేయుచున్న వంటివి. అవి శుద్ధసత్త్వము చిచ్ఛక్తి ప్రణవము. ఇవి కూడ నిరంతరముగా మన లోనికి ప్రవాహరూపమున ప్రవేశించుచున్నవి. అవి మూడును కలసి జీవిప్రకృతి యగుచున్నవి. అవి భౌతికములు కావు కాని దివ్యమైనవి.

గాని తమకంటె గొప్పవారితో సంబంధములు కలిగియున్నవారే. వీరి నుండి వారు సచ్చిదానందప్రవాహము నందుకొని యుండిరి. ఒక గొప్ప వాని జీవితకథను నీవు జాగ్రత్తతో పఠించి యుంటివేని, అతడు బాల్య మున ఒకరియొక్కగాని అనేకుల యొక్క గాని ప్రభావమునకు వశుడై యుండినట్లు కాంచగలవు. వారితనికంటె పలు మడుంగులు గొప్పవా రని యెఱుంగ గలవు. వారితో సాక్షాత్సంబంధమును ప్రత్యక్షముగా గాని లేఖల మూలమున గాని లేక గురుభావమున ఆదర్శముగా నుంచుకొని గాని సచ్చిదానందప్రవాహము వారిశరీరములనుండి ఇతనిలోనికి అందింప బడి యుండును. ఈ అమూల్యమైన సూక్ష్మమైన శక్తిప్రవాహము లేక ఏ శాస్త్రజ్ఞుడైనను ముందునకు సాగలేడు. యోగజీవితమున ఇది అత్యం తావశ్యకము. యోగజీవితములో శిష్యునకు మొట్టమొదట అన్యప్రభావముల నుండి ముక్తుడగుటకును గురువుతో సాక్షాత్సంధము కలిగియుండుట కును ఇది మిక్కిలి అవసరము. ఇందుకొఱకే యోగిహృదయమున దేవునిపై భక్తి పెల్లుబుకుచుండును. క్రమక్రమముగా యోగాభ్యాసి ఈ వికృతమైన ప్రకృతినిద్ర నుండి మేల్కొనును. యోగికి కావలసిన మహావిషయము ఆత్మశక్తి. ఈ శక్తిచే జ్ఞానము తనంతనే అతనికి వ్యక్తమై అతడు 'నేనాత్మను నేనమరుడను' అని భావించును. యోగి విశ్వసనీయముగా దేవుని ప్రేమించినప్పుడు తనను తాను దేవుని కంకి తము చేసికొనును. ప్రకృతిపదార్థము లన్నింటిని త్యజించును. వినయ పూర్ణు డగును. శుద్ధహృదయు డగును. సత్యజ్ఞానము పెంపొందినకొలది న్యాయజీవనమునే గడపును. ఎవ్వనికిని బాధ కలిగింపడు. అప్పు డతని ఆత్మ ఒక స్వతంత్రసత్యముగా భాసించును ప్రకృతిసంబంధము లేని శుద్ధసత్యముగా తేజరిల్లును, స్వేచ్ఛకంటె గొప్పది లేదు. మన హృద యమునందు హత్తుకొనిన ప్రతిదానిని తీసి యిచ్చి మనము స్వేచ్ఛను కొనవలెను. నీవు విశ్వము నిచ్చిన దేవుడు వచ్చును. స్వార్థత్యాగమునకు

కొఱత ఏమియు పనికిరాదు. నిద్రను త్యజించినగాని ఆత్మకు స్వేచ్ఛ లభించదు. ఒకమారు మనము బాటపై ప్రయాణము నారంభించితిమా గమ్యస్థానము మారము కాదు. యోగి మోక్ష మను గమ్యస్థానము చేరుట తథ్యము. దేవుడు ఈ బహూకృతిని ఇచ్చుటకు వాగ్దానము చేసియున్నాడు. యోగియొక్క కృషిలో కష్టములో చెంత నుందునని కూడ దేవుడు వాగ్దానము చేసియున్నాడు, నామటుకు నేను అభ్యాసముచేయుచుండిన కాలమున ఒక తప్పుపనిని చేయదలచినను చేయలేకపోయెడి వాడను. తిరిగి తిరిగి ఒక వాణి 'ఈ పనిని చేయవలదు' అని చెప్పుటను వినెడి వాడను. అట్లు చెప్పినను నేను చేయబూనితినా ఎవరో వచ్చి వలదని చెప్పెడి వారు. కాకున్న ఆ పని జరుగకుండునట్లు ఏదో ఆటంకము వచ్చెడిది. ఈ ప్రకారము దేవుడు తన భక్తులకు తోడుపడుచుండును. ఆయన భక్తుల నెన్నడును విడిచి పెట్టడు. యోగికి ఒక్కడే ఒక్కడు స్నేహితుడు కలడు. ఆయన దేవుడు. ఇది ఆలంకారికభాష కాదు కావ్యభాష కాదు. సత్యవిషయము. ఇది నా జీవితానుభవములో సత్యముగా తేలిన విషయము. నే నభ్యసించినట్లు నీవును కష్టించి యోగము నభ్యసింతువేని నీకును అట్టి నిదర్శనములు కలుగును. యోగిని నిద్రబుచ్చుటకు ఈ భౌతిక శక్తులకు బలము లేదు. కొంచెము కొంచెముగా నీవు మెలకువ నందుచున్నావు. నీవు పసితనమునం దున్నప్పుడు తలిదండ్రుల వశములో నుంటివి. ఆదినములలో వా రెన్నటికిని మరణింప రనియు ఎల్లప్పుడు వారిచే రక్షింపబడుదు ననియు తలచితివి. కాని వారు చనిపోయిరి. నీవు మేల్కొంటివి. ఒంటరిగనే నిలచి జీవితరణము నెదుర్కొనవలె నని తెలిసికొంటివి. మొదట ఇది లాభము లేని యుద్ధ మనుకొనినను క్రమ క్రమముగా నీవు బలము కూర్చుకొంటివి. పోరునకు నిలబడితివి. అప్పుడు బహుశ నీవు ఒక స్త్రీ ప్రభావమునకు లోనై ఆమె నీ కాపురాలని తలచి ఏవో కలలు కనుచు నీ నూతన గృహము ప్రవేశించితివి. ఆమె అదృశ్య

యైనది. నీ మెలకువ ఎక్కువ యైనది. అప్పుడు మొదటిసారి నీవు ఈ మహావిశాలప్రపంచమున ఒంటరివాడ వని తలచితివి. మిగిలిన జీవితమున నీ పైగుడ్డ తప్ప నీకు మిత్రులు లేకుండిరి. మొదట దిగులుపడితివి. కాని క్రమముగా నీ ఒంటరితనములో మిక్కిలి బలము కలదనియు అంతరాత్మసహాయ మున్నదనియు భావించితివి. యోగము నభ్యసించి నీ జీవితమును బలవత్తరము చేసికొనవలయు నని నీ హృదయములో గాఢముగా నిశ్చయించితివి. ఇట్టి భావము దేనివలన వచ్చినది? స్వేచ్ఛ వలన. నీ బంధుమరణము వలన నీ కే రణము లేకయే స్వేచ్ఛ లభించినది. నీ జీవితమున అదే మత మయినది. ఇప్పుడు నీ శరీరమే నీది కాదను అనుభవమును పొందుచున్నావు. ఏ క్షణముననైనను ఈ శరీరము రాలిపోవచ్చును. నీ తలిదండ్రుల శరీరములు నీ భార్య శరీరము అట్లే రాలిపోయినవి. ఇక మిగులున దేమి? ఈ ప్రశ్నకు సమాధానము దాని ప్రతిధ్వనియే. ఇక మిగులున దేమి? ధ్యాన మొక్కటియే మిగులు దానిని గూర్చిన విశ్వాసమును కలిగించును. ఒక వేయి సారులు నేనాత్మ మిగులు నని చెప్పినను నీకు విశ్వాసము కుదరదు. నీ ఆత్మ మిగులునని నీకు అనుభవము రావలెను. దేవుడు మిగులు నని నీవు చూడగలుగవలెను. కాబట్టి యోగి గురువాక్యముపై ఆధారపడి కొండలలో తిరిగి గుహలో కూర్చుండి దీక్షతో యోగము నభ్యసించును. అటు పిమ్మట హఠాత్తుగా ఒకనాటి ప్రొద్దుట అతని మనసునుండి 'ఇదిగో ఆత్మ, ఇదిగో దేవుడు' అని సత్యము ఉద్భాసించును. ఆ పాఠము నాతడు మఱువడు. దేవు డతనిని విడువడు. ఇప్పటి నుండి ఆ జ్ఞానము నార్జించుటకు కృషిచేయును. ఈ విశాలప్రపంచమున యత్నించి సాధింపవలసిన దేదియు లేదు ఆత్మజ్ఞానము దైవభక్తి తప్ప.

# ప్రవర్తన

ఆలంకారికభాషలో చెప్పినచో ఆత్మకు రెండు ముఖములు నాలుగు నేత్రములు ఉన్నవి. ఒక ముఖము స్వర్గమువైపునకు పైకి చూచుచున్నది. మఱియొకటి క్రిందికి భూమివైపునకు చూచుచున్నది. కాబట్టి ఆత్మ మనకు కొన్ని వేళలయందు స్వర్గదృశ్యములను చూపుచున్నది. కొన్ని వేళలయందు పృథివీకంథాశములను వినిపించుచున్నది. భూమివైపున నున్న ఆత్మముఖమును స్వర్గమువైపునకు తిరుగునట్లు చేయుటకు ఒక విధాన మున్నది. అది రహస్యపద్ధతి. దానిని మనము నేర్చుకొనవచ్చును. వెలుపలికి చూచు మనస్సు లోపలికి చూచునట్లు చేయు ఈ విధానము కడు ముఖ్యమైనది. అంతర్గోళముపై మనస్సును ఏకాగ్రము చేసి నిల్పుట చాల మందికి అసాధ్య మని చెప్పుదురు. అంతరాకాశములో నున్న విషయముల గూర్చి ఆలోచించుట జంతువులకు చేతగాదని చెప్పుదురు. యోగ భాషలో దీనిని ద్వివిధనిగ్రహమని చెప్పవచ్చును. ప్రతియోగియు దీని నభ్యసింపవలయును. ద్వివిధనిగ్రహములో ఇచ్ఛాశక్తికి సంబంధించినవి రెండు విషయము లున్నవి. మొదటిది బాహ్యప్రపంచవస్తుజాతమును ఉపయోగించుకొనవలె ననెడి ఇచ్ఛను నిరోధించుట, రెండవది భౌతిక విషయముల చరించు ఇచ్ఛ పనిచేయుట మాని తనకు తానే అదృశ్య మగుట. అటు పిమ్మట యోగికి మాత్రమే అనుభూతిలో నుండునట్టి అద్భుతమైన నైశ్చల్యజ్ఞానము ఉదయించును. యోగాభివృద్ధికి ఈ ద్వివిధనిగ్రహము పునాది. నీ ఇచ్ఛాశక్తి ఏమి చేయుచున్నదో నీవు వివరముగా తెలిసికొనవలయును. అప్పుడు నీలోని దోషము లేవియో నీ కవగతము లగును. ఇచ్ఛాశక్తి అనునది వెనుక ముందు చూడక అమితవ్యయము చేయు

ఖార్యవంటిది. ఈ ఇచ్ఛ ఎందుకు తనకు తానే వ్యయ మగుచున్నది? కేవలము ఇచ్ఛించుట వలననే. నీవు రూపొందించు ప్రతివాంఛయు నీ శక్తిలోని ఒక ఖర్చుపద్దు. నీవు చూచిన ప్రతిదానిని ఉపయోగించుకొనుటకు వాంఛింతువు. నీ పిత్రార్జిత మయిన గృహమును నీ పొరుగువా రాక్రమించినట్లు విందువు. వెంటనే నీ కాగ్రహము హెచ్చును. దానిని తిరిగి పొందుటకు న్యాయస్థానమున కేగుదువు. ఎందుచేత ? నీ ఇచ్ఛ దేనిని ఇదివరకు ఉపయోగించుకొనెనో దానిని ఇతరులు ఇచ్ఛించుటను తిరస్కరించుచున్నది. ప్రతిమానవుడు ఇతరుల ఇచ్ఛలను తిరస్కరించుటలో తన యిచ్ఛాశక్తిని వ్యయముచేయుచున్నాడు. ఇదెల్లందుచేత ? ఎందుచేత ననగా ఆత్మయొక్క ఒక ముఖము భూమివైపున కున్నది. భూమివైపు చూచుచున్న రెండు కండ్లు, భూమివైపు వినుచున్న రెండు చెవులు, భౌతికద్రవ్యముపై ఆసక్తము లైనవి. ఇచ్ఛ వాని ప్రాబల్యమున ఆకర్షిత్వమైనది. ప్రకృతిద్రవ్యమునకు అంటుకొనినది. అప్పు డా యిచ్ఛను లాగి యథాస్థానమునకు ప్రవర్తింపజేయుట కడు కష్టము. ఆధ్యాత్మిక పతనమున కిదే కారణము. భౌతికద్రవ్యాసక్తము లయిన మనస్సులు కలవారు యోగాభ్యాసము చేయుట దుర్లభ మనుటకు ఇదే కారణము. మన ఇచ్ఛాశక్తిని రక్షించుకొనుట ఎట్లు ? కేవలము ఇచ్ఛించకుండుటవలననే, ప్రోగుచేయుట అను విలాసముతో యోగి బాధపడడు. భౌతిక ద్రవ్యములను కదలించి యెత్తుకొనుటలో గల విపత్తులు యోగికి తెలియును. తన శక్తికి మించిన బరువును ఒక డెత్తుకొనినచో కాలుగాని చేయిగాని గుండెగాని దెబ్బతినును. ఆ నొప్పివలన అతడు జీవితాంతము బాధపడును. అట్లే కొందఱు మానవులు అధికేచ్ఛచే అంతశ్శరీరము దెబ్బ తినునట్లు చేయుచున్నారు. ప్రాపంచికవస్తుసంగ్రహము చేయుటకు తీవ్రముగా ఇచ్ఛను పనిచేయించుటచే అనేకుల అంతశ్శరీరములు దెబ్బతిని కోలుకొనలేకున్నవి. యోగ మట్టివారికి కాదు. ఈ నిగ్రహము అను

దానిని యోగి ఎట్లారంభింపవలెను ? మొదట ఒట్టు పెట్టుకొనవలయును. లేక లోపల నిశ్చయము చేసికొనవలయును. లోన దృఢమైన నిశ్చయము చేసికొనుట ఇచ్ఛకు గల ఆశను అణచుటకు మిగుల సాయపడును. మంచి విషయములనే నేను వాంఛింతును అని మొదట సామాన్యముగా నిశ్చయించుకొనవలయును. పిమ్మట విశిష్టము లయిన నిశ్చయములు చేసికొనవచ్చును. నీకు నీవే ఇట్లు చెప్పుకొనవలెను 'అశాశ్వత మయిన సంపత్తిని సంగ్రహించుటకు నా యిచ్ఛ కృషిచేయదు' అని. వాగ్ద్వారమున ఇచ్ఛాశక్తి మిక్కిలి వ్యయ మగుచున్న దని భారతీయుల భావన. నీ నాలుకను ఎక్కువ మాటలాడునట్లు విడిచితి వేని ఎక్కువ అబద్ధములాడునట్లును ఎక్కువ నిందలు చేయునట్లును ఎక్కువ పరుషవాక్యములు పలుకు నట్లును అవకాశ మిచ్చితివని గ్రహింపుము. అబద్ధములు కాని పరుషవాక్యములు గాని పలికిన యెడల బయలుదేరు దుష్టకంపనమునకు యోగి ఎప్పుడును తా వీయరాదు. కాబట్టి యోగి తీసికొనవలసిన మొదటి ప్రతిజ్ఞ వాఙ్నియమము. రెండవది మనోనిగ్రహము. దుష్టములైన విషయములపైకి ఊహలను పోనీయరాదు. కాంతాకనకాదులయొక్కయు ఇతర భౌతికవస్తువులయొక్కయు మూలమున ఏ భోగములను శరీరము గతకాలమున అనుభవించి యుండెనో వానిపైకి మనస్సును ప్రసరింప జేయరాదు. మనోభావములను గట్టిగా ఆత్మవశమునం దుంచవలెను. ఇక మనస్సు భవిష్యత్తులో ఏవో భౌతికభోగములను పొందవలె నను ఆశతో భావిపథమున సంచరింపనేరదు. ఇట్టి భవిష్యదూహలు విపత్కరములు. ఎట్లనగా విలాసము మనలో ఎట్టి చిత్రములను నిర్మించునో ఆ ప్రకృతి నీ కలవడును. సద్గుణసంపత్తి జారిపోవును. దివ్యత్వము నష్ట మగును. కావున మనోనిగ్రహము రేబవళ్లు అభ్యసింపదగినది. నీ భావముల నెప్పుడు నిగ్రహింతువో అప్పుడు నీ స్వప్నములు కూడ నిగ్రహింపబడును. ఇక నీవు చేయు కర్మలను నిగ్రహింపవలెను. ఏ కర్మ చేయుట

నైనను నీ చేతులను గాని కాళ్లను గాని శరీరమందే భాగమును గాని నీ వాజ్ఞాపించుటకు పూర్వము అనేకపర్యాయము లాలోచింపవల యును. ఒక వృత్తిని నీ వెన్నుకొనవలసి వచ్చినప్పుడు నీవు కడు జాగ్రత్తతో యోచింపవలయును. సారాయి మొదలయిన వానిని తయారు చేయుట గాని విషపదార్థములు అమ్ముట గాని ఇతరులను నొప్పించి ధనము గొనుట గాని చెట్లను జంతువులను బాధించుట గాని —ఇట్టివి కూడవు. నీవు ప్రతిదానిని నీ ఆత్మతో తుల్యమయిన విలువ కలదానినిగా తలపవలెను. నీ వెన్నుకొను వృత్తివలన న్యాయమార్గమున నీ జీవన భృతిని నీవు సంపాదించుకొనుటయే కాక ఇతరులకు బాధ గాని పరాభ వము గాని దాస్యముగాని సిద్ధింపరాదు. ఈ ప్రకారము వాఙ్మనఃకర్మలను నిగ్రహించుటవలన క్రమముగా లక్ష్యము అంతర్ముఖముగా తిరుగును. మితవ్యయము ప్రకృతిలోని గొప్ప ధర్మము. యోగి గొప్ప ఆర్థికతత్త్వ జ్ఞుడు. వైహికశక్తిని అతడు మితముగా వ్యయముచేయును. నీ ఇచ్ఛాశక్తిని నీవు మితముగా వ్యయముచేయుటను నేర్చుకొనవలయును. అప్పుడు నీలో పరిణామము యొక్క రెండవ దశ ఆరంభ మగును. ఇచ్ఛ పనిచేయు టను ఆపినప్పుడు నీవు గొప్ప మనశ్శాంతిని అనుభవింతువు. అందుచే యోగమునకు నిగ్రహము సింహద్వారము. యోగాభ్యాసి మనోవాక్క ర్మలను నిగ్రహించుటయే గాక అతని స్వభావములో సహనమును కూడ నిరోధింపవలెను. నీ స్వభావములోని సహనమును కూడ నిరోధింపు మనుటలో అర్థ మేమి? అనగా నీ చెవులను నిందావాక్యములను విన నీయకుము. నీ కండ్లను అశుచివస్తువులను చూడనీయకుము. నీ శరీ రమును దుష్టమయిన దాని ఒత్తిడి పాలు గానీయకుము. నీవు మంచివాడ వయినచో కర్మణ్య మయిన నీ ఇచ్ఛను నిగ్రహింప గలవు. కాని మంచి వారు సామాన్యముగా చేయు పొరపా టేమనగా అకర్మణ్య మయిన ఇచ్ఛను నిగ్రహించుటలో నిర్లక్ష్యము చేయుదురు. ఇది మిగుల అపాయ

కరము. నన్ను గురించి ఎవ్వడయినను నిందావాక్యములు పలుకుచున్నచో ఆ ప్రదేశమును వెంటనే విడిచి పొమ్ము. ఆ వాక్యములలో ఒక్క అక్షర మైనను నీ చెవుల బడనీయకుము. అట్లే నీ కండ్ల విషయమున గూడ. శరీరావయవములు ప్రతిదాని విషయమున గూడ ఇట్లే. కావుననే దీనిని ద్వివిధనిగ్రహ మనుట. మన స్వభావములోని కర్మణ్యము అకర్మణ్యము అయిన భాగముల రెంటిని నిగ్రహించుటయే ద్వివిధనిగ్రహము. ఇట్లే రెండు విధము లయిన నిగ్రహమును సాధించినవాడు యోగబలమును కొంచెము అనుభవములోనికి తెచ్చుకొనగలడు. నీ శక్తుల నన్నింటిని నిగ్రహించుట నేర్చుకొనుము. ప్రతి ప్రాతఃకాలమునను పెందలకడ లేచి ఏ ఆలోచనములను చేయక నీకు వీలయినంత కాలము కూర్చుండుము. ఏ కోరికలను మనసులోనికి రానీయకుము. శరీరమును కదలింపకుము. మనశ్శాంతిని పొందుటకు యిది చాల ముఖ్యమయిన అభ్యాసము. బాహ్య ప్రపంచమున తమ అదృష్టము నందుకొనుటకు లోనుండి వెలిక్రి దూకు చున్న ఈ సహజశక్తుల నన్నింటిని ఎందుకు నిగ్రహింపవలయును అని నీ వడుగవచ్చును. నిజమే. ఈ శక్తుల నిగ్రహింప కుండుట సహజమే. కాని అట్లయిన అవి బాధామరణముల త్రోవకు లాగును. నిగ్రహింపక ఆ శక్తులను అనుగ్రహించితిమా అవి భావశూన్యతను కలిగించును, భావశూన్యత విపత్తును మృతిని తెచ్చిపెట్టును. నిగ్రహములేని మానవుడు గడపు జీవితమునకు లక్ష్య ముండదు. నీవు నిగ్రహమును నేర్చుకొనుచో నీ ఆవేశముపై ప్రేమపై ఊహపై ఆత్మకు పెత్తన మిచ్చుచో నీ అంత శ్శరీరములోనికి గొప్ప జ్ఞానమును శాంతిని ప్రవేశ పెట్టగలుగుదువు. అప్పుడు నీ ఆత్మనిగ్రహము మూలమున తమ ఆత్మలను నరకకూప ముల ద్రోయుచున్న అనేకులను నిగ్రహింప గలవు. నాగరకుల నిగ్ర హమే నాగరకతను నిర్మించినది. పెద్ద పెద్ద నాగరకతలలో అనేక అంత స్థులలో నిగ్రహము పొడకట్టును. కాని యోగములో అది పూర్ణరూపము

నంది పరిణతమైనది. ఆత్మజ్ఞానము నిగ్రహపరులకే లభించును. నిజమయిన నిగ్రహము కలవానిలో నిజమయిన ప్రేమ నిండియుండును. ఈ విశ్వముయొక్క హృదయాంతరాళమున ఒక అనశ్వర పదార్థమున్నది. ఆ పదార్థము తోడనే ఆత్మ చేయబడినది. అది భౌతికము కాదు. ప్రకృతి కతీతమైనది. విశ్వగతమైన ఆ పదార్థమును వీలయినంత సాధించుటయే యోగి లక్ష్యము. భౌతికపదార్థములను తన వశములోనికి తెచ్చుకొనుట కతడు యత్నించును. ఈ బాహ్యశరీర మొక్కటియే మన కున్న శరీరము కాదు. ఒకదానిలో నొకటిగా మన కింకను రెండు శరీరము లున్నవి. ఇంద్రియప్రపంచమున నిత్యము నివసించు మానవుడు అన్నముచే పోషింపబడు ఈ మూడవ శరీరమున నివసించుచున్నాడు. కాని పై జెప్పిన ద్వివిధనిగ్రహము మూలమున ఎవడు భౌతికభోగానుభవమునకు విముఖుడగుచున్నాడో అతడు జ్ఞానముచే పోషింపబడు రెండవ శరీరమ్మున జీవించుచున్నాడు. అనేకుల జ్ఞానదేహము మశకము వలె చిన్నదిగా నుండి వారి అజ్ఞానదేహము హస్తిపరిమాణమున నుండును. కాని యోగియొక్క జ్ఞానదేహము హస్తిపరిమాణమున నుండి వాని అన్నదేహము అణుపరిమాణమున నుండును. ఈ రెండు దేహములకు మించినది మూడవదేహము కలదు. దానిని నీ విప్పుడు దర్శనము చేసికొనలేవు. అది అనశ్వరపదార్థముతో నిర్మితమయినదని మాత్రము నీవు గుర్తుంచుకొనవలయును. యోగముయొక్క మొదటిదశలో రెండవ దేహము యొక్క పోషణమును గూర్చి మిక్కిలి శ్రద్ధ చూపవలసి యున్నది. ఈ మూడు దేహములలోని పదార్థము నశించిపోవునది కాదు. అన్నదేహము సయితము మార్పునొందినను మరణమొందినను నశించిపోవుట లేదు. మనదృష్టి కది అదృశ్యమైనను దిగ్దిగంతరాళములలో నివసించును. ఒక దేహ మభివృద్ధి బొందినయెడల అది యింకొక దేహమును అత డధిరోహించుటకు సోపానమగును. అందుచే నీ అన్న

దేహమును శుభ్రముగా పవిత్రముగా బలముగా నుంచుకొనుటకు యత్నింపుము. అన్నదేహమును నిర్లక్ష్యము చేయరాదు. సరియైన వ్యాయామము సరియైన భోజనము సరియైన విశ్రాంతి సరియైన నిద్ర సరియయిన శ్వాసము వలన దానిని చాలినంత బలసంపన్నమునుగా చేయవచ్చును. అప్పు డది జ్ఞానదేహాభివృద్ధికి తోడ్పడును. నీ లోనికి విరుద్ధభావములు విరుద్ధప్రేమలు విరుద్ధేచ్ఛలు ప్రవేశింపనీయ కుండునట్లు జాగరూకుడవై యుండుము. ఈ లోకమునగాని పరలోక మునగాని నిన్నుగూర్చి దయారహితమైన తలపు లెవ్వరును తలచనట్లు వర్తింపుము. అది యోగమునకు గొప్ప అంతరాయము. కాబట్టి నీ కీ లోకమునగాని పరలోకమునగాని ఎవ్వరయినను శత్రువు లున్నయెడల వారితో సంధిచేసికొనవలయును. నీవు యోగ మభ్యసించుటకు ముందు ఆదివర కెవ్వరికైనను మనోవాక్కర్మలచేత అపకారము చేసి యుంటివా వారిని క్షమాపణ కోరుము. విశ్వములోని సమస్తాణువులతో స్నేహ్నమును పొందకున్న యోగము సిద్ధిబొందుటకు అవకాశము లేదు. మానవుడు స్నేహద్వారమున తన చెంతకు రావలెనని దేవుని అభిలాష. ఆత్మ సత్యమును దర్శించుట నిగ్రహవర్తన గల వానికే సాధ్యము. నీవు నీ వనవాటిలో చరించుచున్నప్పుడు ఒక రెమ్మనుగాని ఆకునుగాని త్రుంప కుము. వేళ్లపై అడుగులు వేయకుము. అది వాని కిష్ట ముండదు. అవి బాధపడును. నీవు వసించు ప్రదేశ మాధ్యాత్మికవాతావరణమును కలిగి యున్నదా లేదా చూచుకొనుము. నీవు ఒక ప్రదేశముయొక్క స్థితిని కనుగొను మనశ్శక్తివి పెంపొందించుకొనవలయును. అవినీతికరములైన భావములచేతగాని కర్మలచేతగాని కలుషితమైన వాతావరణము గల గదిలో యోగాభ్యాసము చేయువా డెన్నడును నివసింపరాదు. నిద్రింప రాదు. అట్టివి ఆత్మకు తాకి మాలిన్యము నంటించును. జంతుహింస జరుగు చోట నివసింపరాదు. ఎట్టి పరిస్థితిగాని నీ లోభమును కామమును

క్రోధమును పెంచునదిగా ఉన్నచో నీవు ముందు పోవుట కాశ ఉండదు. దిక్సూచికాయంత్రములోని ముల్లు త్రుప్పు పట్టినయెడల అది ఉత్తర దిక్కును చూపింప జాలదు. అట్లే నీ మన స్సను ముల్లునకు శారీరకము లయిన కామక్రోధాదులచేత త్రుప్పు పట్టిన యెడల అది ఆత్మకు దివ్య మార్గమును చూపజాలదు. అందుచే నీ వెల్లప్పుడును అప్రమత్తతతో జాగరూకుడవై యుండవలెను. నీ అజాగ్రత్తచే ఆత్మనాశమును తెచ్చి పెట్టుకొందువేని మోక్షమును పొందుటకు నీ కీయబడిన ఈ అవకాశ మును ఈ జన్మను జారవిడుచుకొనినవాడ వగుదువు. ప్రాపంచికవిజ యముల గూర్చిన శారీరకభోగముల గూర్చిన భావము లెవ్వరి వయి నను నీమీద తమ ప్రభావమును జూపరాదు. మానసికముగా గాని భౌతి కముగా గాని ఎవ్వరిపైనను నీ ఆధిపత్యము నిల్పుటకు యత్నింపకుము. ప్రతిదినము ఆత్మయొక్క స్వభావమును దాని ఏకాంతతను దాని స్వేచ్ఛను దాని ప్రశాంతిని అనుభవములోనికి తెచ్చుకొనుము. నీ లోని అరవిందములలో సచ్చిదానందశక్తి కలదని విస్మరింపకుము. దేవుడు లోపల ఉన్నాడు కాని వెలుపల కాదు. మన నిజమైన ఆత్మ ఆ దివ్యమూర్తి కౌగిటిలో నున్న శైశవంగును. ఈ జన్మకు ఇంకొక జన్మకు దూరము శూన్యము, ఆత్మ రెండులోకముల మధ్య నున్నది. ఆ రెండవ లోకముయొక్క జీవితప్రమాణమునకు ఈ లోకపు ప్రమాణము సరి పోవుట లేదని తెలివిగల యోగి తాను వసింపబోవు లోకపు ప్రమాణము నకు అర్హ మగునట్లు జీవితము నెరపుము. ఏ మానవుడు పేరునకు మాత్ర మీ లోకమున నున్నను నిజముగా పరలోకమున నివసించు చున్నాడో వానికి భయ మనునది లేదు. ఉచ్చజీవితమును గడుపవలె నను ఇచ్ఛయే మఱియొక జీవితముయొక్క స్థితిని ముందుగా సూచించును. స్వప్నావస్థలో ఎవడు పరలోకమును చూచి దాని వైభవమును జాగ్ర దవస్థలో స్మరించునో ఆ మానవుని ఆత్మలో విషయసంసక్తి ఉండ

జాలదు. ఐహికదృష్టి వృద్ధిజెందిన కొలది పరలోకము మసకమసకగా గోచరించును. మానవుడు తన శరీరములోనికి ప్రకృతియందలి జడపదార్థములను నింపుకొనినకొలది పరలోకమునందలి విశ్వాసమును పోగొట్టు కొనును. భౌతికజీవితము భోగము కాదు, అవసరము. రాబోవు కాలమున దుర్భరపాపము లొనర్పక జీవించుట దుర్లభము కాగలదు. ఏమేమి జరుగనున్నదో మన మెఱుగుదుము. మానవానీకముపై ఏమి విపత్తు పడనున్నదో మనకు తెలియును. కారణ మేమి? వారి దుష్టజీవనము అనాత్మేచ్ఛ. అందుచేత మా శిష్యులను ఆదర్శమును వ్యాపింపజేయుటకు విధేయుతతో పాటుపడుమని కోరుచున్నాము. భౌతికతను విడనాడు కళను దేశప్రజలు నేర్చుకొనుటయందు మీరు తోడ్పడవలెను. ఎందుకన, ఈ భౌతికజడపదార్థములతో తమను తా మిట్లే నింపుకొనుచు పోయిన వారు బరువెక్కిపోదురు. ప్రకృతిధర్మము ననుసరించి బరు వెక్కువై సుకుమారమైన జీవితకోశము బ్రద్దలగును. కాబట్టి నేను చెప్పిన పనిన్ని బహుశాసక్తితో ఆరంభింపవలసియున్నది. మృత్యుపీడితులు దుఃఖపీడితులు బాధాపీడితులు అయిన మానవుల క్షేమముకొఱకు విధేయతతో ప్రేమతో పనిచేయు ఎవ్వనికైనను భారతీయయోగిబృందము ఆశీర్వదించి తోడ్పడును. కావున నేను ప్రార్థించున దేమనదా 'యోగులకు విజయము లభించు గాక! ఈ భూగోళమున ఆదర్శజీవితము దైవీసంపద శాశ్వతముగా నెలకొనుగాక! సచ్చిదానందము మనకు మార్గదర్శకమగుగాక' అని.

# క్రమాభివృద్ధి

కాంతి సూర్యకాంతి ఈ విశ్వములో గన్పట్టు మహోన్నతసత్యము. ఈ సూర్యునియొక్క రెండు లక్షణములు మన కన్నులకు పరిచితములు ప్రతిదినోదయము ప్రతిదినాస్తమయము. రేయెల్ల మనలను సుఖనిద్రలో నిల్పుచున్న దేది ? మఱునాటి ప్రొద్దుటికి తిరిగి సూర్యు డుదయింపగల డని మన ఆత్మలో విశ్వసనీయముగ నున్న ఆశ. ఈ ఆశ బహువిచిత్ర మయినది. ఈ ఆశ కేమైనను మూలహేతు వున్నదా ? లేదు. ' మరల సూర్యు డుదయించు నన్న ఆశ నీ కే కారణమున కలిగినది ? ' అని ఎవడయిన నిన్నడిగినచో ఏమి చెప్పుదువు ? నిన్న ఉదయింపలేదా అని మాత్రమనగలవు. ఇది తార్కికమైన సమాధానము కాదు. ఈ ప్రకృతిలో అనేకవిషయములు ఒక సారి లేక రెండు సార్లు లేక మఱికొన్ని సారులు మాత్రమే సంభవించి తిరిగి సంభవింపనివి ఉన్నవి. అందుచే రేపు సూర్యు డుదయించునని నమ్ముటను తార్కికముగ సమర్థింప లేము. కాని మన ఆశను ఆపలేము. మన ఆశకు తగినట్లు సూర్యుడు ప్రతిదినము ఉదయించుచునే యున్నాడు. ఈ సూర్యుడు కాక విశ్వములో ఇంకొక మహోన్నతసత్యమయిన కాంతి ఉన్నది. అది చైతన్యకాంతి. ఈ చైతన్య కాంతి మన శరీరములో నున్నది. ఆ సూర్యకాంతిని గమనించుటకు ఈ చైతన్యకాంతి మన కుపయోగపడుచున్నది. ఈ చైతన్యకాంతికినయితము ప్రతిదినోదయము ప్రతిదినాస్తమయము అను రెండు లక్షణము లున్నవి. మనము మేల్కాను గడియ చైతన్యమున కుదయవేళ. మనము నిద్ర కొరగు గడియ అస్తమయవేళ. నిద్రించునప్పుడు తిరిగి చైతన్య కాంతి ఉదయింపగలదను ఆశను కలిగియే యుందుము. తిరిగి

మేల్కొనగలమను ఆశతో నిద్రించుచున్నాము గాని ఈ ఆశకు తార్కిక మయిన కారణము లేదు. అయినను ప్రతిమానవుడు గట్టిగా ప్రాతః కాలమున తిరిగి మేల్కొనగలనను ఆశతోడనే నిద్ర కొరగుచున్నాడు. దీనికి చెప్పబడు కారణ మేమన ఇదివర కనేకపర్యాయములు అట్లు జరిగినది అని. అతడు పుట్టినదిమొద లట్లే జరిగినది. ఈ సమాధానములో ఒక సంఘటనకు అనేకసంఘటలను ముడివేయుటయే గాని యథార్థముగా తర్కసహమైన కారణము కన్పట్టదు. ఈ రెండు కొంతులకు తోడుగా అనేకాంశములు దృశ్యాదృశ్యములై ఉదయాస్తమయ లక్షణములకు దృష్టాంతములుగా గలవు. ఋతువులు వచ్చుచున్నవి పోవు చున్నవి. వసంతవర్షముల రాకడపోకడలను చూచుచున్నాము. ఆ పోకడను గమనించుచు అది తిరిగి రాగలదనియే నమ్ముచున్నాము. నక్షత్రములు గ్రహములు అన్నియు ఉదయాస్తమయధర్మమునే ప్రకటించు చున్నవి. మన శరీరధర్మములో గూడ అదే సూత్రముయొక్క అనుభూతిని పొందియున్నాము. ఒక పసిబిడ్డను జూచినప్పుడు ఆ శరీరములో యౌవన ముదయించి అస్తమింపగలదని చెప్పగలము. అందుచే ఈ భౌతికశరీరజీవితములో గాని మానసికజీవితములో గాని లేక ఈ బృహద్విశ్వజీవితములో గాని ఒకే వస్తువుయొక్క దృశ్యాదృశ్యములయిన ఉదయాస్తమయములను మనము విలోకించుచునే యున్నాము. ఏది అదృశ్య మగుచున్నదో అది తిరిగి దృశ్య మగునని నమ్ముటకు ఈ ఆశయే మనకు ప్రోద్బలక మగుచున్నది. ఇదే విషయము ఆత్మను గూర్చి చెప్పవచ్చునేమో పరిశీలింతము. మతముయొక్కయు తత్త్వముయొక్కయు మహా సమస్య ఇదే. శరీరము మరణించిన పిమ్మట ఆత్మ తిరిగి పుట్టును అని మనము చెప్పుచో అది ఉపమానముపై ఆధారపడి చెప్పిన ట్లగును. ప్రకృతిలో ప్రతిదియు పుట్టును గిట్టును. కాబట్టి ఆత్మకూడ ప్రకృతి లోనిదే గనుక అదికూడ పుట్టును గిట్టును. కాని మనము ఈ జననపున

ర్తనన ప్రణాళికనుగూర్చి చర్చించుటకు పూర్వము ఆత్మయొక్క స్వభావ మును అర్థము చేసికొనవలసియున్నది. ఆత్మ అనగా నేమి ? అది యొక దివ్యగానమని ఇదివరకు చెప్పియుంటిని. అది యొక కాంతి లేక జ్యోతి అనికూడ చెప్పియుంటిని. మఱియొక చోట అది శాశ్వతము అనశ్వరము అయిన ద్రవ్యము అని ఉద్ఘాటించి యుంటిని. కాని ఈ ఆత్మను గూర్చి ఏదైన ఒక అభిప్రాయమును రూపొందించుకొనగలమేమో యత్నించి ఆలో చింతము. మన మనసులో ఆత్మ అను పదమువలన ఎట్టి రూపకల్పన మును చేయలేకున్నా మనుట స్పష్టము. మఱి ఆత్మనుగూర్చి ఎట్లాలో చించుట ? నిరంతరము నేను నిన్ను ఆత్మధ్యానము చేయుమనియు ఆధ్యా త్మికజీవనమును నెరపుమనియు ప్రబోధించుచున్నాను. ఆరంభకునకు ఈ ఆత్మస్వభావమునుగూర్చి తలచుట మిక్కిలి దుష్కరమని నాకు తెలి యును. మన మాత్మనుగూర్చి తలపలేకున్నా మేమి కారణము ? అదియే యెల్లప్పుడు మననుగూర్చి తలచుచున్నది. తలపును తలచు దానిని గూర్చి మన మెట్లు తలప నాశపడగలము ? ఆత్మయొక్క స్వరూపమును మనము పొందు దుర్లభమగుటకు మఱియొండు కారణము కలదు. మన మూహించు ప్రతిదానిని కొన్ని రూపములలోనో కొన్ని చిహ్నములలోనో ఊహిం తుము. నీ స్నేహితులను నీవు తలచినప్పుడు వెంటనే అంతరంగములో నీవు వారి ఛాయాచిత్రములను వారి స్మృతిచిహ్నములను చూతువు. నీ స్నేహితుడు మంచివా డనియో చెడ్డవా డనియో నీవు తలచినపుడు మొదట వాని ఆకృతిని తలతువు. పిమ్మట వాని ప్రవర్తనమును స్మరిం తువు. అతడు మంచివా డెందుకనగా ఒకతూరి నీకొక గడియారము నిచ్చి యున్నాడు. లేక అతడు చెడ్డవా డెందుకనగా అత డొకసారి నీ కపకారము చేసియున్నాడు. కావున స్త్రీపురుషులనుగూర్చి నీవు తలచి నప్పు డెల్ల వారి భౌతికరూపమునుగూర్చి మొదట తలతువు. తరువాత ఆ భౌతికరూపముతోపాటు ఒక ప్రత్యేకమైన పని లేక పనులను తలతువు.

ఆ పనులుకూడ నీచే పరిశీలింపబడినవి. కాబట్టి సామాన్యమైన తలపు ప్రతిది ఇంద్రియవిషయచ్ఛాయ. అనగా త్వక్చక్షుశ్శ్రోత్రజిహ్వాఘ్రాణ ములయొక్క పరిశీలనముచే ఏర్పడిన స్మృత్యంకము. ఇట్లు రూపచ్ఛాయలు కాక కేవలచిహ్నములచే ఊహించు విధానము మఱియొకటి కలదు. గణితము కలదు. అది చిహ్నములతో తలచుట. తాత్త్వికముగా తలచుట భావస్మరణము. కాని ఈ తలచుట లేవియు ఆత్మనుగూర్చి తలచుటకు ఉపయోగపడు మార్గములు కావు. ఆత్మనుగూర్చి మనము తలచలేక పోయినయెడల అది ఓగులును అని ఎట్లాశపడగలము ? భారతీయ తాత్త్వికు లీ సమస్యనుగూర్చి మిక్కిలిగా విచారించిరి. ఒక పక్షమువా రిట్లందురు— 'మనము ప్రతి ఇతరద్రవ్యములను తలచినట్లే ఆత్మద్రవ్య మునుగూర్చి కూడ తలపవలెను. ఆత్మనుగూర్చి తలచుట కింకొక నూతనవిధాన ముండదు.' సామాన్యమార్గమున ఆత్మనుగూర్చి మన మెట్లు తలతుము ? వా రిట్లందురు —'ఆత్మ చైతన్యముయొక్కయు కర్మలయొక్కయు ప్రవాహము.' అనగా వారి అర్థ మేమి ? వారి భావ మేమనగా— 'ఈ విశ్వములో ప్రతిది ఒక ప్రవాహము— అనగా నది వలెగాని సెలయేరువలెగాని గాలివలెగాని కాంతివలెగాని విద్యుత్తువలె గాని, విశ్వములోని ప్రతిశక్తియు నిరంతరగమనము గలది. ఒక రేఖ వలె ముందునకు ఆగక పోవుచునే యుండును. అట్లు ప్రతిశక్తి ఒక రేఖవలె అనంతముగా పోయిపోయి వెనుకకు మూలస్థానమునకు తిరిగి వచ్చును, సూర్యుని కాంతిరేఖ సూర్యునినుండి బయలుదేరి వచ్చి తిరిగి అక్కడికే చేరును. అట్లే మనోభావరేఖ పుట్టిన తావునకే చేరును. చైతన్యరేఖ తిరిగి చైతన్యమునే పొందును. ఈ సిద్ధాంతము ననుసరించి చూచినచో నీ వెవరు ? ప్రవర్తన అలవాట్లు మనస్తత్వము— ఇవి అన్నియు కలసి సాగుచున్న ఒక ప్రవాహము. ఈ ప్రవాహము అనంత మయినది. ఈ నీ వర్తమానశరీరము భూమిపై పుట్టినప్పుడు అది ఆరం

భము కాలేదు, దాని కారంభము లేదు. నీ వీ ప్రవాహములో అలవంటి వాడవు. ఈ శక్తిప్రసారము లేక ఈ భావప్రవాహము అనంతములో కన్పట్టి అనంతములోనికి పోవుచున్నది.' ఈ సిద్ధాంతము ప్రకారము ఆత్మ మనస్సు ఇచ్ఛ శరీరము— ఇవి అన్నియు చలనస్వభావముగల అణువులు. ఇవి ఎల్లప్పుడు ముందునకు పోవుచు ఒకప్పు డొక రూపమును నామమును ధరించి ఒక విశిష్టప్రవర్తన కలిగి యుండును. నీ క్రియల చరిత్రమే నీ ప్రవర్తన. ఈ సిద్ధాంతమునుబట్టి నీ ఊహకు నీ క్రియకు ఆరంభము లేదు గనుక శరీరావసానముతో అంతము కాదు. అది శాశ్వతముగా పోవుచునే యుండును. అనేకపర్యాయములు ఈ ప్రవాహము వేఱు నామములతో వేఱు రూపములతో తిరిగితిరిగి పుట్టుచుండును. దాని ననుసరించి నీవు మంచిగనో చెడ్డగనో జీవితము నెరపుచున్నావు. ఇది ఒక పక్షము.

ఇంతకు భిన్నమైనది మఱియొక పక్షము కలదు. అది అనుసదేమనగా — 'ఆత్మ తెలిసికొనరానిది. దానికి రూపము లేదు వర్ణములేదు జననము లేదు మరణము లేదు. అది శుద్ధసత్త్వము శుద్ధానందము శుద్ధ చైతన్యము. ఆత్మను గూర్చి మనసు భావించుటకు దానిని చెప్పగల పదము భాషలోనే లేదు. అందుచే భావన కందునది కాదు ఆత్మ, దానికి పూర్వము మాత్రమే ఊహ వర్తించును; ఈ సిద్ధాంతమును అవలంబించు వారితో ఆత్మయొక్క అస్తిత్వమునుగూర్చి మీకు ప్రమాణమేమి? అని అడుగునెడల వా రందురుగదా 'శాస్త్రీయమయిన సాక్ష్య మేమియు లేదు. ఎవరికి వారుగా విశ్వసించుటకు విషయమైనది ఆత్మ' అందురు. 'ప్రతిమానవు డేదోవిధముగ తా నాత్మ నను అనుభూతిని బొందుచున్నాడు. మరియొక ప్రమాణము శ్రుతి. శ్రుతి దేవవాక్కు. మానవు డాత్మ అని దేవవాక్కు. ఆత్మయొక్క అస్తిత్వమునకు మరియొక ప్రమాణములేదు. ఆత్మ శుద్ధానంద మందు వెందువలన ? అని నీవడుగుచో వా రిట్లు చెప్పు

దురు - 'ఈ విశ్వమునకు గల లక్షణములు భౌతికములు మారునవి తాత్కాలికములు. కాని సచ్చిదానందములను లక్షణములు భౌతికమున కతీతములు. ఆత్మ విశ్వమున కతీతమైనది. కనుక అది శుద్ధానందముగా శుద్ధ సత్త్వముగా శుద్ధ చైతన్యముగా భావింపవలెను.' ఇంకను ఆత్మ అనంతమని చెప్పుదురు. నే ననంతుడనా అని నీ వడుగుచో 'ఆత్మ శరీరముతో కూడి యుండుటచే అది అంతవత్తుగా భావించును గాని నిజముగా అది అనంతమయినది' అందురు. ఎందుచేత? ఇట్లాలోచింపుము- 'నీ వేయే పనిని చేయుచున్నావో ఆపని ఒక భావముచే ప్రేరేపింపబడు చున్నది. పనిచేయు వేళ ఆ భావముతో నీవు తాదాత్మ్యమును పొందు చున్నావు. అయినను ఈ భావమున కతీతమైన దేదో కలదను అనుభూతిని పొందుచున్నావు. కావున జననము మొదలు మరణము వరకు మానవుడు ఒక కోటి భావములతో తాదాత్మ్యమును పొందుచున్నాడు. అయినను ఈ కోటి పర్యాయములు ఈ కోటిభావములలో భాసించు నేదో అను అనుభూతినే కలిగియున్నాడు. కాబట్టి ఈ మన అసంఖ్యాకములయిన భావ తాదాత్మ్యములలో అవతరించి భాసించు నెద్దియో అది అనంతము. ఆత్మ అనంతమయినను దాని కొక విశిష్టప్రవర్తన కలదు. నీ ఆత్మ అనంతమయినను నీ వేర్పరచుకొనిన భావకర్మల మూలమున ఒక విశిష్టప్రవర్తనతో వ్యక్తమగుచున్నది. ఈ అనంతమై విశిష్టప్రవర్తన కలదైన ఆత్మనే జీవుడు అనుచున్నారు. అనగా అనంతమైన ఆత్మతో సంబంధపడి జీవించువాడు.' ఈ సిద్ధాంతము ననుసరించి అనంతము విశిష్టము అయిన ఆత్మ సహజముగా స్వేచ్ఛకలది. కాని దాని కర్మధర్మమును బట్టి అనగా దాని ప్రవర్తన పనులు భావములు - వీనినిబట్టి ప్రాకృతికముగా బద్ధమైనది. ఈ వ్యష్టి స్వీయప్రేరణచేతనే నిరంతరముగా తిరిగి తిరిగి పుట్టుచున్నాడు. చచ్చుచున్నాడు. కాబట్టి ఈ సిద్ధాంత మంగీకరించితి మేని నీ వనేక పర్యాయములు జీవించియుందువు మరణించియుందువు. నీ జన్మను నీవే

కోరి సృజించుకొంటివి. నీ కర్మ అనగా నీ తల్లిదండ్రులు. అమృతత్వ మనగా అనంతమయిన విశిష్టమయిన ఆత్మ. పైకి కనబడుచున్న జీవితము నశించినను ఎన్నడును మరణించునది కాదని అర్థము. ఈ జీవితము యొక్క మరణము ఆ అనంతవిశిష్టాత్మపై ఎట్టి ప్రభావమును పడవేయ లేదు. కొందఱు ఈ ఆత్మ జననమునకు పూర్వము లేదు అని మరణానంతరము ఉండదు అని భావింతురు. ఇది భౌతికశాస్త్రదృష్టి. మరికొందఱు ఆత్మ ఈ శరీరముతో పాటు పుట్టునని శరీరము మరణించుట తోడనే అది నిద్రించునని చెప్పుదురు. పుడమిక్రింద చలిలో చీకటిలో అనేక కోట్ల సంవత్సరములు అది అట్లే నిద్రించును. ఈ విశ్వము మహా ప్రళయమును బొందినప్పుడు దేవదూత భేరీనాదమును చేయును. ఆత్మ లన్నియు అప్పుడు తమ సమాధులనుండి లేచిపోవును. అప్పుడొక న్యాయ విచారణ జరుగును. ఆస్తికులు స్వర్గమునకు పంపబడుదురు. నాస్తికులు నరకమునకు పంపబడుదురు. ఈ సిద్ధాంతమును శాస్త్రీయముగా సమర్థించుట కెక్కడను అవకాశము కనబడుట లేదు. ఇటీవల కొందఱు వేదాంతసిద్ధాంతముల విశ్వాసము లేనివారు భూతవిద్యాప్రచారము చేసి మరణానంతరము ఆత్మ జీవించునని ఋజువు చేసితిమని చెప్పుచున్నారు. కాని వారు చెప్పుదానికి తార్కికమయిన ఆధారము గాని శాస్త్రీయమైన విలువ కాని లేదు. మరణానంతరమనో విషయముల గూర్చి చెప్పువారు ఆ ప్రాకృతికధర్మములు ఆ సందేశములు మొదలయినవి భౌతికములే యనియు మన యింద్రియముల నవి మోసగింపవచ్చుననియు గమనింపవలసి యున్నది. అవి భౌతికధర్మములకు ఒక్కొక్కప్పుడు సరిపడినట్లు తోచినను భౌతికములే. కావున యథార్థమైన మనస్సునకు ఆత్మకు సంబంధించినట్లుగా వానిని తత్త్వశాస్త్రము గుర్తింపలేదు. ఈ ప్రాకృతికాంశములను వేదాంతస్థాయికి కొనిరావలయు ననెడి కొందఱి వాంఛ ఈ యుగపు భౌతికసంస్కృతిని మాత్రమే చాటగలదు. మన

స్సును శరీరమును సర్వేశ్వరుని ఈ పుష్పోద్యానమును భస్మముచేయు నారకశక్తులను ఆకర్షించుటకు ఉపయోగపరుపవేని ఈ భూతశక్తుల వలలో పడకుండ రక్షింపబడుటకు నిత్యము ప్రార్థనము చేతువు. విశ్వ విద్యాలయాచార్యుల హస్తములలో ఈ భూతవిద్య పడి ఒక శాస్త్ర మన్నట్లు వృద్ధిపొందినను దాని స్థాయి శాస్త్రవీధిలో ఉల్కా-శాస్త్రమునకంటె క్రింద నుండును. దాని నొక మతముగా లేవనెత్త జూచినను అది జ్యోతిశ్శాస్త్ర మునకంటె క్రిందికే చేరును. అది ఒక నాగరకతగా బయలుదేరినను దానినుండి విడదీయరాని స్త్రీప్రభావము భావితరములవారి పౌరుషమును ఉన్మూలించును. ఇంకను అది సాహిత్యశాస్త్ర సాంఘికశాస్త్రాది నిర్మా ణము లన్నింటిలో గల విజ్ఞానముద్రను తుడిచివేయును. కాని దానిని గూర్చి మనము భీతినొంద పనిలేదు. పురుషుని హృదయము ఇంద్రుని వజ్రాయుధతుల్యమైన బలము గలది. ఆత్మను గూర్చి లోతుగా విచారిం చిన వేత్త లెల్లరు భారతీయపునర్జన్మసిద్ధాంత మొక్కటియే ఆత్మ యొక్క అమరత్వమును చక్కని తార్కికపద్ధతిలో నిరూపించగల దని వక్కాణించి యున్నారు. ప్రకృతిలోని భౌతికవిషయము లన్నియు దానిని బలపరచుచున్నవి. భౌతికములే కాక మానసికనైతికవిషయములు కూడ దానిని రూఢిపరచుచున్నవి. ఈ సిద్ధాంతమునకు బల మెక్కడ ? చైత న్యములో హేతువులో మానవుని ఆశలో దీనికి బల మున్నది. మన చైతన్య మిట్లు చెప్పుచున్నది. ఒక మానవుడు చేసిన పుణ్యకార్యమునకు బహుమతి లభింపవలెను. పాపకార్యమునకు శిక్ష సత దనుభవింపవలెను. అతనికి బహుమతి గాని శిక్షగాని ఒక జన్మలో రాకున్నను మఱియొక జన్మలో రావలయును. ఈ ప్రకారము పునర్జన్మ చేతనయొక్క తీర్మా నమును బలపరచుచున్నది. ఇక మనలోని హేతువు చెప్పున దేమనగా ఒక మానవుడు విద్యచేతగాని ధ్యానముచేతగాని ప్రేమదయాదిసుగుణ ములచేతగాని పొందిన అభివృద్ధి వ్యర్థము కారాదు. అది యింకను అభి

వృద్ధిపథమును దాని ముందునకు కొనిపోవలయును. పునర్జన్మ హేతువు చేయు తీర్మానమును బలపరచుచున్నది. ఆత్మ ధారావాహికముగా నున్న దని చెప్పుటలో పూర్వగుణములు క్రమముగా వికసించి పూర్ణత నందుట కది సాయపడుచున్నది. ఇది ఈ పునర్జన్మ సర్వప్రపంచధర్మముతో సమన్వయపడుచున్నది. ఏ మా ధర్మము ? ఒకమారు దృష్టమైనది తిరిగి దృశ్యమగుట. ఆత్మను గూర్చిన ఈ సిద్ధాంతము ఒక్కటే ప్రపంచము నకు ఆశాజనకమై నిల్చినది. తాను చేసిన పాపకార్యములకు శిక్ష ననుభ వించి తీరవలయు నని మానవుడు నిశ్చయించుకొని నప్పుడు అత డా పాపకార్యములనుండి వెనుకకు తగ్గును. పుణ్యకార్యములు చేసిన యెడల రాబోవు జన్మలో తనకు తగిన బహూకృతి లభించునని అత డెఱిగినచో సత్కార్యాచరణమునకు అత డమితముగ ఉత్సాహమును పొందును. ప్రపంచమున నేడు కావలసినది నిస్స్వార్థముగా పనిచేయువారు ముందు నకు వచ్చుట. ఈ పునర్జన్మను గూర్చిన బోధ ఒక్కటియే ఈ జన్మలో ఫల మాశించక నిస్స్వార్థముగ పనిచేయుటకు మానవుని ప్రబోధింపగలదు. ఎందుకనగా చేసిన పుణ్యము వ్యర్థము కాదని అతనికి విశ్వాస మేర్పడి యున్నది. గతించిన జన్మలను గూర్చిన స్మృతిని తిరిగి పొందుటకు యోగము సాయపడును. రాబోవు జన్మలను గూర్చిన జ్ఞానమును ముం దుగా పొందుటకు యోగము ఉపకరించును. ఇట్టి జ్ఞానమును పొందుటకు నీవు యోగజీవితమును గడపవలెను. అనగా నిజముగా నీవు అను దాని యర్థముగా నిలచినట్టియు అనంతమూర్తి అయినట్టియు నీలోనున్న జ్యోతిని గూర్చి నీవు నిరంతరధ్యానమును చేయుచుండవలయును. ఇంద్రియ విషయభోగములనుండియు బాధాకర క్రీడలనుండియు నీవు దూరమగు చున్నకొలది ఆత్మసమీపమునకు చేరుచుండగలవు. నీ లక్ష్య మెట్లుండ వలె ననగా — మధురమయిన విచిత్రమైన ఆధ్యాత్మికజీవితము గడుప వలయు నని. దాని మూలమున ఈ జన్మ తరువాత యింకను ఉత్తమ

మయిన జన్మము రావలయును. అట్లు మేధస్సు యిప్పటికంటె అప్పుడు ఉత్తమమయినది కావలయును. దాని మూలమున దివ్యసత్యములు మహోత్తమము లయినవి లభింపవలయును. అప్పు డీ భూమిని దివ్యముగా చేయవలయును. యోగము నభ్యసించువానికి ఇట్టి లక్ష్య ముండవలయును. ఈ ఒక్క జన్మతోడనే మన జీవితము సర్వము శూన్యమగుచో ఇప్పుడుగాని ముందుగాని ఈ అనంతవిశ్వములోని అసంఖ్యాకములైన రహస్యసత్యములను గ్రహించుటకు మన కవకాశము లేకపోవును. మనలను సృష్టిచేయుటలో దేవుని భావము సర్వశూన్యమై యుండదు. పురుగులతో పాటు కోట్ల సంవత్సరములు నేలక్రింద చీకటిలో తేమలో బాధింపబడి క్రుగ్గిపొమ్మని కూడ అయియుండదు. కావున ఈ రెండు సిద్ధాంతములు అనగా శూన్యసిద్ధాంతము సమాధిబంధనసిద్ధాంతము నిస్సంకోచముగా వికారమయినవి నవ్వును పుట్టించునవి. రాబోవు నవయుగమున నే నిప్పుడు బోధించుచున్న సనాతనభారతీయప్రబోధమును ప్రతిచోట బోధించు మానవులు పుట్టగలరు. నే నిప్పుడు నీకు చెప్పున దేమనగా — నిరంతరధ్యానము చేయుము, నిరంతరము ఓర్పు వహించి యుండుము, నిరంతరము సన్మార్గమున చరింపుము. తాత్త్వికప్రశాంతి, నిరవధిక త్యాగము, నిరంతరక్షమము — వీనితో నిర్మితమయిన సత్పథమున నీవు నెమ్మదిగా ప్రయాణ మొనర్తువేని నీ విప్పు డెవడవో పూర్వ మెవడవో ముం దెవడ వగుదువో దర్శింపగలవు.

# అర్పణము

ఆత్మతో జోడింపబడిన ప్రాణము ఈ భౌతికప్రపంచములో ఒక భాగ మగుటచే ఇందలి కష్టసుఖములను అనుభవించును. ప్రకృతిరాజ్యమున ఏది సంభవించినను ప్రాణము ఏకతాళత్వధర్మము ననుసరించి పాల్గొనక తప్పదు. భౌతికప్రవాహము లన్నింటిలో ప్రాణప్రవాహము కడు సున్నితమైనది. ఎరుసగా కొన్ని భౌతికప్రవాహములు కదలినప్పుడు ప్రాణప్రవాహము వానితో పాటు కదలకుండలేదు. ఈ కారణముచేతనే ప్రకృతినుండి ఒక సంజ్ఞ బయలుదేరుటతోడనే ఒక ప్రతిస్పందనము ఒక ప్రతిసంజ్ఞ లేక అట్టి అనుభూతి మనసులో రేగును. ప్రకృతిలో భూకంప మొకటి కలిగిన దనుకొనుము. లేదా ఒక తుపాను రేగినది. కాక ఒక మెఱుపు తళుక్కున మెఱసినది. వెంటనే మనస్సులో భయము కలుగును. కాని ఈ భయము ఆత్మను స్పృశింపలేదు. ఎందుకనగా ఈ ప్రకృతికంటె తా నతీతమైన దాన నను జ్ఞానముతో నుండునది ఆత్మ. అమృతత్వము దాని సహజధర్మమని అది యెఱుగును. ప్రాణము ప్రకృతి దయకు పాత్రమై యున్నను ప్రకృతిశక్తులకు లేని కొన్ని అవకాశములను కలిగియున్నది. ప్రకృతిప్రాణము సర్వశ్రేష్ఠ మగుటచేతనే ఇది సంభవము. ఆత్మతో జోడింపబడియున్న ప్రాణము ప్రకృతిశక్తు లన్నిటికిని లేని అవకాశములను కలిగియున్నదంటిమి. అవి యేవి? అవి మూడు (1) సంబంధము (2)సమర్పణము (3)సమైక్యము. ఒక ప్రాణ మింకొకప్రాణముతో సంప్రతించు శక్తిని కలిగియున్నట్లు చూచుచున్నాము. అది భౌతికము కావచ్చును లేదా మానసికము కావచ్చును. ఈ సంప్రతింపు మాటలాడుకొనుట వలనగాని ఉత్తరములు వ్రాయుట మూలమునగాని టెలిఫోను టెలిగ్రాఫు

మొదలయిన వాని ద్వారమున గాని జరుగుచున్నది. కాబట్టి ఏ ప్రాణి
మైనను ఈ సంబంధము లేనిది బ్రదుకజాలదు. సమస్తజంతువులు పిట్టలు
చేపలు ఒకదానితో నొకటి తమ భాషలోనో సంజ్ఞలతోనో సంప్రతించు
కొనుచున్నవి. ఈ సంప్రతింపువిషయమున మానవుని శక్తి గొప్ప
దిందుకు కాని నాకు సందేహము. కొన్ని జంతువులను పిట్టలను పరిశీ
లించిచో అవియే మిన్నగా తోచును. కాని నాగరకత వృద్ధిచెందిన కొలది
కొన్ని యంత్రముల కొన్ని సాధనముల మూలమున మానవు లొకరితో
నొకరి సంబంధము సంప్రతింపు ఎక్కువైనవి. యథార్థముగా ఏ మాన
వుడు గాని ఈసంబంధము లేక జీవింపనేరడు. ఎందుల కీ సంబంధము?
విలాసముకొఱకు, రక్షణకొఱకు. అట్లే జంతువులుకూడ. అయితే మాన
వుని సంబంధములోని ప్రణాళిక చిక్కుతో కూడినది. ప్రాణముయొక్క
రెండవ శక్తి సమర్పణము. ఈ సమర్పణ మనగా నేమి? మాన
వుడు తన కోర్కెలను ఏ శక్తితో దేవునికి నివేదించునో లేక దేవుని
సన్నిధికి చేరునో అది సమర్పణము. ఈ శక్తి జంతువులకు లేదు. ఈ
సమర్పణమే మతము. ఒకడు ధ్యానము చేయుచున్నాడనగా అతడు తనను
దేవునికి సమర్పించుకొనుచున్నాడని అర్థము. ఈ సమర్పణశక్తిని పరి
పక్వదశకు తెచ్చుటయే యోగముయొక్క లక్ష్యము. యోగములో కేవ
లము ప్రార్థనచేయుటయే కాదు. ఆ ప్రార్థనల కొసంగబడు ప్రత్యుత్తర
ములను కూడ విందుము. ఈ సమర్పణప్రక్రియలో ప్రార్థన కాక మఱి
కొన్ని పద్ధతు లున్నవి. యోగి ప్రార్థనము చేయక నిశ్శబ్దముగా దేవునకు
తనను అర్పించుకొనును. ఇతరపదార్థములకు ఇతరజీవకోటికి దూరముగా
ఏకాంతముగా యోగి ధ్యానమునకు గూర్చుండును. అట్లు ధ్యానము
నకు కూర్చున్న పిదప అతడు బ్రతికి యున్నట్టిగాని చచ్చినట్టిగాని
జీవులతో సంప్రతింపడు. దేవుని కనేకులు తమను సమర్పించుకొను
చున్నారు. ఎందులకు? ఇతరమానవుల ప్రాణములతో సంప్రతింపు

లకు దిగుటతో తమ శక్తి సంతతిని వ్యయపఱుచుచున్నారు. కాని యోగి దేవునికి తనను అర్పించుకొనినప్పుడు అతని మనసు శూన్యమగును. నిశ్శబ్దనిశ్చలప్రదేశమువలె నగును. ఆ సమర్పణకాలమున అతడు దేవునిలోనికి పోయిన ట్లుండును. ఇది కొందఱు విశ్వసింపలేరు. అయినను సత్యము. మానవుడు ఎక్కువగా వృద్ధిచేసికొనిన సంబంధశక్తి మూలమున క్రింద ఈ ప్రకృతిలోననే నిల్పబడి యున్నాడు. అతడు మనోమూలకముగ ప్రతిక్షణము ఇతరమానవులతోనో జంతువులతోనో ప్రకృతిశక్తులతోనో ఆధ్యాత్మికజీవులతోనో సంప్రతించుచునే యున్నాడు. అందుచే ఒకానొక ఆకర్షణ సృజింపబడినది. ఆ య్యాకర్షణశక్తిచే అతని ప్రాణము ఈ భూమితో బంధింపబడి యున్నది. ఈ సంబంధ శక్తి నె ట్లాపుటయో యోగికి తెలియును. అతడు తన శరీరమును మనస్సును ఈ సమస్తవిశ్వమునుండి వేఱుచేయగలడు. ఆ దశలో అతడు సమర్పణశక్తిని వృద్ధిచేయును. దానికి ఫలితముగ అతడు దేవుని సన్నిధికి పోవును. ఈ సమర్పణము మూడు మార్గముల జరుగును. దేవుని ప్రేమించుటవలన దేవునియందు లక్ష్యమును నిల్పుటవలన దేవుని తెలిసికొనుటవలన. యోగిమనస్సు ప్రేమతో నిండినప్పుడు దేవు డతనిని తనవైపున కాకర్షించును. దేవునికొఱకైన ప్రేమ కడు వింతయైనది. అది మానవుని ప్రేమించుట వంటిది కాదు. మానవుడు నిజముగా దేవుని ప్రేమించునెడల అతని సర్వప్రాణము శక్తి దేవుని దిక్కుయియే యుండవలెను. అది యొక విచిత్రమయిన ఆత్మార్పణము. అందుచే యోగి మానవునికొఱ కెట్టి కార్యము నిర్వర్తించుచున్నను ఆ కార్యము దేవుని కొఱ కయినదిగనే భావించును. అది సేవకంటెను గొప్పది. అది యొక అనుభూతి. ఆ అనుభూతిలో సమస్తమయిన ప్రాణము శరీరము ఆత్మ అన్నియు కరగి దివ్యప్రవాహమై ప్రవహించుచున్న ట్లుండును. ఇది దేవుని ప్రేమించుట లేక భక్తి.

ఇక సమర్పణముయొక్క రెండవ విధానము లక్ష్యము నిల్పుట. ఇచ్ఛాశక్తి దేవుని వరించి ఆ దివ్యత్వమును లక్ష్యభూతమునుగా జేయును. యోగి ఈ శరీరమును గాని ఈ ప్రపంచమును గాని తలపక తన మనసును ఈ ప్రాపంచికపదార్థము ప్రతిదాని నుండియు దూరముచేసి దేవునిపై నిల్పును. అది బాధామయమైన అభ్యాసమే. దేవుని ప్రేమించుట దీని కంటె సులభమైన పని. కాని తగిన కాలములో లక్ష్యము పక్వదశ నొందగా మనసు శరీరమువైపు గాని ప్రకృతివైపు గాని ప్రసరింపదు. తన మనసును దేవునియందు నిల్పుటకు శారీరకపరిస్థితులను అతడు వినియోగించుకొనును. అతడు సరిగా కూర్చుండును. భ్రూమధ్యమున దృష్టి నిలుపును. తక్కువగా భుజించును. ఇట్లెన్నో చేయును. ఈ దైహిక సహాయము లన్నియు దేవునిపై మనసు నిల్పుటకు సాధనములు మాత్రమే. నిజముగా దేవునియందు లక్ష్యమును నిల్పుటలో ఉత్తీర్ణుడయిన వానికి ప్రపంచములో ఎంత కష్టమైన దైనను అసాధ్య మన్నది లేదు. వా డేది చెప్పిన అది నిజమగును. వా డేది కోరిన అది అతని చెంతకు వచ్చును. యోగియొక్క ఇచ్ఛకు అడ్డముగా నిలువ గలిగినది లేదు. కాని యోగి భౌతికమైన దానిని దేనినిగాని కోరడు. అతడు తన లాభమును తన సౌఖ్యమును తన భోగమును ఎన్నడును కోరడు. అత డేదైన భౌతికవస్తువును వాంఛించినా దనగా అది యోగవిద్యాబోధ కనుకూలించు నిమిత్తము కావలసిన దానికయి యుండును. యోగులు ఇరుతెగల వారున్నారు. కొందఱు మిక్కిలి ఒంటరిగా జీవింతురు. అహోరాత్రములు వారి గుహను వీడక మానవుని ముఖము చూడక దేవునిపై మనసు నేకాగ్రముగ నిల్పి యుందురు. వారి శరీరము ప్రాణము దేవుని దయచే రక్షింపబడుచుండును. వారి కషాయము దూర మగును. అట్లు సంవత్సరములకొలది ఆహారము లేకయే జీవించుచుందురు. వీ రొక తరగతి వారు. ఏకాంతముగా మౌనముగా గుహలలో నివసించువారు. మఱియొక

తరగతివా రున్నారు. తమ శిష్యులపట్ల తమ కొక విధి కలదని భావించి ఈ తత్త్వమును పూర్ణముగ పఠించి మానవలోకమునకు పోదురు. ఆ శిష్యులు పూర్వస్మృతియొక్క శక్తిచే ప్రేరేపింపబడిన వారై వారి చెంతకు వత్తురు. వారి బోధలను విందురు. ఈ ప్రకారము ఈ మహా విజ్ఞానము ప్రపంచములో భద్రముచేయబడినది. తమ పని నిర్వర్తింపబడి నదని వారు తలచినప్పుడు వారు తిరిగి తమ గుహలకు చేరి దేవుని ధ్యానిం చుచు తాము కోరినంతకాలము జీవింతురు. యోగుల శ్రమఫలితముగ యోగబోధ నిలిచియున్నది. వారు నోటిమాటలతో చెప్పియు గ్రంథములు రచించియు బోధింపరు. వారు ఈ ఆకాశావరణమును తమ భావముతో నింపుదురు. వారి శిష్యులు విద్యలో సిద్ధులైనప్పుడు అ య్యాకాశావరణ మున నిక్షేపింపబడియున్న సందేశములను స్వీకరింతురు. అ య్యాకాశా వరణమునకు దేశకాలభేదము లేదు. కాబట్టి నే నెచ్చట నున్నను హిమ వత్పర్వతగుహలలో ఎక్కడనో ఉన్న వారి సందేశములను వినుచుం దును. నీకు బోధించిన దానిని నీవు విధేయతతో అభ్యసించితివా నీవు కూడ వారి శబ్దములను విని అనుభవములోనికి తెచ్చుకొనగలవు.

కాని అన్నిటికంటె ఉత్తమమయినదియు ఆత్మతో బద్ధమయిన ప్రాణము కలిగియున్నదియు అయిన శక్తి సమైక్యము. యోగులు ఈ సమైక్య మనగా ఏమి అర్థము చేసికొనిరో అది నీ కిప్పు డర్థము కాదు. యోగియొక్క అభ్యాసకాలమందు ఒకానొక వేళ వచ్చును. అప్పు డతడు తా నొక విశిష్టవ్యక్తిగా భావింపడు. అతని ప్రాణముగూడ దేవుడు గాక వేఱుగా ఉండదు. ఇదెట్లు జరుగు ననునది వర్ణించుటకు వీలులేనిది. అట్లు జరుగునని విశ్వసింపుము. తన శబ్దమున విశ్వాసము పొందువానిని తనలో సమైక్యము చేసికొనుట దేవుని ఉద్దేశము. ఈ దేవునితో సమైక్యము సాధించుట యోగములోని చరమదశ. ఈ సమైక్యము భక్తిచేగాని ఏకా

గ్రముగ లక్ష్యమునందు మనస్సుంచుటచేగాని సాధ్యపడునది కాదు. ఇది జ్ఞానముచే సిద్ధించును. ఇక్కడ జ్ఞానమున కర్థ మేమనగా ద్వైతములేని అద్వైతము. ఆత్మజ్ఞానరూపము. దేవుడు జ్ఞానరూపుడు. వేఱుగా ఆత్మ జ్ఞానము లేనప్పుడు దేవజ్ఞానమే మిగులును. భారతీయతత్త్వమున జ్ఞాన మనగా ఇది అర్థము. యోగము నారంభించువాడు మొదట దేవుని ప్రేమింపవలెను, దేవుని ఎప్పుడును ధ్యానింపవలెను. ఆయననుగూర్చి ఎల్లప్పుడును స్తోత్రములు గానము చేయవలెను. ఇదంతయు హృదయ పూర్వకముగ కొంతకాలము చేసినపిదప నీలో ఒక మధురమైనట్టియు నిన్ను పైకెత్తుచున్నట్టియు ఒక ఉద్రేకము కలుగును. అది నిన్ను ఉద్ధ రించునది. ఆ ఉద్రేకము నిన్ను దేవుని సాన్నిధ్యమునకు లాగికొని పోవును. నీవు ప్రపంచమును వెనుకకు వెనుకకు త్రోయుచుందువు. దేవుని స్తోత్రముచేయుట ధ్యానముచేయుటతో పాటు ఒక ఆశను ఒక నమ్మకమును ఒక సమర్పణమును ఒక త్యాగమును అభ్యసింపవలయును. చాల కొలది మందికి ఆశ కలుగును. ఇంకను కొలదిమందికి నమ్మక ముండును. ఒకడైనను త్యాగము చేయడు. కాబట్టి ఆశను కలిగియుండుట నేర్చుకొనుము. ఆశ అనగా అర్థ మేమి? దేవుడే నీ కన్ని వస్తువులను సర్వసుఖమును సర్వజ్ఞానమును ఈయగలడని తలపవలయును. దేవుడు మహోత్తమవస్తువుల నన్నింటిని నీకీయగలడని సహజముగనే నీ ఆత్మకు ఆశ ఏర్పడినప్పుడు ఆశాజ్ఞానము నీలో వృద్ధిపొందినదని వచ్చును.

నమ్మక మనగా నేమి? నమ్మక మనగా మనలో ఒక శక్తి పల్లి ఇట్లు చెప్పును 'ఈ ప్రాణమును దేవుడు ప్రసాదించి యున్నాడు. ఆయన ఇది ఉండదగునని అనుకొనినంత కాలము దీనిని రక్షించును' అని. పూర్ణమైన నమ్మకము దేవునిలో కలిగియుండుట యోగాభ్యాసము

నకు మొదటి నిబంధన. ప్రతి దినోదయమున దేవునితో ఇట్లు చెప్పవల యును— 'ప్రభూ ! అనంతమైన నీ మహాశక్తిలో నాకు నమ్మకము కలుగునట్లు ప్రబోధింపుము' అని ప్రాపంచికజీవితముపై నీ కాంక్ష యంతయు ఒక్కసారిగా కడముట్టును.

త్యాగ మనగా నేమి ? త్యాగ మనగా దేహమును ప్రాణమును ఆత్మను బుద్ధిపూర్వకముగా దేవుని చేతిలో నుంచి తిరిగి ఒక్కసారి యైనను వానిని కోరకుండుట. ఇట్లు త్యాగము చేసిన వా దేమను ననగా 'ఈ దేహముపై నా కధికారములేదు. ఈ దేహముయొక్క సౌఖ్యమును వాంఛించుటకు నా కధికారము లేదు. ఈ దేహమందు గాని, ఈ ప్రాణ మందు గాని పనికివచ్చున దేదియైనను ఉన్నచో అది దేవుని విలాసము కొఱకు' అని. ఇవి మిక్కిలి కఠినమయిన గుణములు. వీనిని వృద్ధి బొందించుట అభ్యసించుట కడు కష్టము. ఎందుకనగా ప్రతివాడును నిరం తరము ఆత్మను వ్యర్థము చేయుచున్నాడు. వ్యయపరచుచున్నాడు. దిగ లాగుచున్నాడు. కావున నేను చెప్పున దేమనగా – 'మిక్కిలి ఆసక్తితో ఆలోచింపుము. ఈ మృత్యువాతావరణము నుండి నీ వెట్లు పైకి పో గలవో ఆ మార్గమును గూర్చి భావింపుము. పరిస్థితులు నీ కెంత ప్రతి కూలముగ నుండునో వాని నధిగమించుటకు నీ కంత బలవత్తరమయిన నిశ్చయ ముండవలయును. ఆ సంఘర్షణ కఠినముగా నున్నయెడల అది నీ కొక శక్తి నిచ్చును. అది ఏమనగా నీ ఆదర్శమునకు విధేయుడవై వర్తించు బలము. సంఘర్షణ బలము నిచ్చి ప్రాణము పోయును. ఈ యుద్ధమును సాధించుటకు నీకు బలమును తేజమును ప్రసాదింపు మని నిరంతరము దేవుని ప్రార్థింపుము' అని.

# సూర్యోపాసన

సత్యభాసితములయిన నేత్రములు విశ్వాసతప్తమయిన హృదయము — ఈరెండును యోగికి చిహ్నములు. వా దేది చూచినను దానిలో సత్యమును చూచును. వా డేది చేసినను విశ్వాసప్రేరితుడై చేయును. తోడి మానవులతో అతని సంబంధబాంధవ్యములు నీతిశాస్త్రమున అతనికి గల విశ్వాసమునుండి ఉద్భూతములై యుండును. విశ్వప్రకృతిధర్మమునకు మానవకర్మధర్మమునకు గల సంబంధము నెఱుగుట ఆవశ్యకము. ఎందుకనగా మన సౌఖ్యము నిస్స్వార్థములయిన కర్మధర్మములపై ఆధారపడి యున్నది. నిస్స్వార్థములయిన భావములు విశ్వనైతికసూత్రముచే నిశ్చయింపబడుచున్నవి. ఇతరులకు మంచి చేయుటయే చాలదు. ఇతరులకు చేయు మంచి సార్థకము కావలయు నన్నచో మనము చేసట్టు ప్రకృతిశక్తుల పూర్ణజ్ఞానముపైన ఆ మంచి ఆధారపడి యుండవలయును. ఈ భూమిపై గల వస్తువులను కావలసినవారికి యోగి విశ్వాసపూర్ణుడై యిచ్చును. అనగా అతని విశ్వాసమే మనగా అతడు దేనిని యిచ్చుచున్నాడో అది అతనిది కాదు. అట్లు ఈయబడుటకే అది అతనికి పంపబడినది అని. ఒక వస్తువును దానము చేయుచున్నప్పుడు హృదయములో ఒక ధ్వని 'దానిని దానము చేయకుము' అని యనును. అట్టిదానము అవినీతితో కూడిన దానము. ఒక దానము చేయుచున్నప్పుడు హృదయములోని ఆత్మ సంతోషము ననుభవించి ఉల్లాసమును వెల్లడి చేయును. అట్టి దానము నీతియుక్తమయిన దానము. అందుచే నైతిక మార్గమున ఈయబడిన దానమువలన ఆత్మ లాభించును. ఈ దానములు చేయుట ఒక చిక్కైన నైతిక కర్మ. నే నొక చిన్న కథను చెప్పెదను.

జ్ఞానము కలిగి దానము చేయవలెనని అది బోధించును. శాంతిదేవు డను నొక దరిద్రుడు కలడు. ఎవడు కష్టములో నున్నను వాని కతడు సహాయము చేయుచుండెను. ఒక దినమున చుట్టుప్రక్కల వసించువా డొకడు వచ్చి పస్తుండి బాధపడుచున్నానని శాంతిదేవునితో మొఱపెట్టుకొనెను. తాను పస్తుండి ఆ చెంతనున్న బియ్యమును శాంతిదేవు డతని కిచ్చెను. ఆ పురుషు డా బియ్యమును కొంపోయి వాని నొక కోమటి దుకాణమున అమ్మి వచ్చిన ధనముతో ఒక కత్తిని కొనెను. దానితో అతడు దారిదోపిడి దొంగయై త్రోవన బోవు నమాయకులగు వారలను అనేకులను దోచి, చంపి, జీవించుచుండెను. ఈ లోపల శాంతిదేవునకు అవసానము సంప్రాప్తించినది. యమభటులు ఉగ్రులై వచ్చి అతనిని నరకములోనికి కొంపోయిరి. అక్కడ శాంతిదేవుడు తా నెఱిగినంతలో పాపకార్యము చేయలేదనియు పవిత్రజీవితమును మాత్రమే గడవుటకు యత్నించియుంటి ననియు చెప్పి తనను నరకమునకు కొనివచ్చిన హేతువేమని యడిగెను. అప్పుడు చిత్రగుప్తుడు తన గ్రంథమును జూచి అత డొకప్పు డొక దుర్మార్గునకు కత్తి కొనుటకు బియ్యము నిచ్చి సహాయము చేసియున్నాడనియు అత డా కత్తితో అనేకుల నమాయకులను చంపెననియు ఆ పాపమున శాంతిదేవునకు భాగము సంక్రమించిన దనియు చెప్పెను.

నీ వొక మానవున కేదయిన వస్తువును దానము చేయుచో నీకును తిరిగి అత డిచ్చును. ఆ యిచ్చునది కనబడదు. అతడు మంచివాడైన అతని పుణ్యములో కొంత నీ కిచ్చును. దానివలన నీ ఆత్మకు లాభము కలుగును. కాని అతడు చెడ్డవాడైన అత డేమి ఈయగలడు ? న్యాయము ప్రకారము అతని చెంతనున్న చెడ్డతనమును లేక పాపమును నీ కిచ్చును. కాబట్టి దానము చేసిన దాత ప్రతిగ్రహీత యొక్క పాపములో పాల్గొనవలసి వచ్చెను. శాంతిదేవుని స్థితి యిది. దానశాస్త్రరహస్య మొక్కటి

కలదు. యోగాభ్యాసము చేయదలచిన ప్రతివాడు దానిని నేర్చుకొనవల యును. ఆ శాస్త్రము యొక్క సారాంశ మేమనగా—నీ వెందుకు దానము చేయవలయును? నీలో గల విధ్యుక్తధర్మజ్ఞానము నిన్ను ఆదేశించు చున్నది. ఆ దానమును నైతికమైన దానినిగా చేయుటకు పాపరహితునకే దానము చేయుట అవసరము. ఈ నైతికదానమును గూర్చి యింకను రెండు విషయములు నీవు తెలిసికొనవలసి యున్నది. గ్రహముల ధూళిప్రవాహములను గూర్చి నీవు నేర్చుకొనిన పిమ్మట అవి బోధ పడగలవు.

మన సూర్యగోళమున కావలనుండి నిరంతరము వచ్చి పడుచున్న ఒక అతిసూక్ష్మద్రవ్యము గలదు. ఈ ద్రవ్యము మిక్కిలి సున్నితమైన ధూళిరూపము గలది. విద్యుత్తరంగముల కంటెను రేడియం ప్రవాహము కంటెను సూక్ష్మమైనది. అది యెంత సున్నితమైన దనగా ఎంత కఠిన పదార్థములోనికైనను రాయి ఉక్కు వజ్రము మొదలయిన వానిలోనికై నను చొచ్చుకొని పోగలదు. అందుచే ప్రపంచములోని ప్రతివస్తువు నిరం తరము మారుచునే యున్నది. ఎందుచేత? ఈ అతిసూక్ష్మభౌతికాణు వుల యొక్క అంతఃప్రవేశము వలన. శరీరములోనికి ఈ ధూళి ప్రవే శించి శరీరముయొక్క స్వభావమును మార్చును. ఈ ధూళి శరీరములో నుండి వెలికి వచ్చునప్పుడు ఆ ప్రవేశపువేళ నున్నదానికంటె పూర్తిగా విరుద్ధమైన దగును. ఈ ధూళియొక్క నిరంతరప్రవాహము మన శరీ రముగుండ జరుగుట వలన మన జీవశక్తిని పూర్ణముగా మార్చును. ఇందువలన మన రక్తము మన ఎముకలు మొదలైనవేకాక మన మెదడు మన భావములు మన రాగద్వేషములు మార్పునొందును.

ఈ ధూళి మూడు విధము లయినది. మొదటిది కాంతిధూళి. ఇది కాంతివలె నుండును. దీని మూలము ఆకాశము. నక్షత్రగోళముల పైన

ఎంతో ఎత్తున ఆకాశమునందు కలదు. ఈ ధూళి మన శరీరములో ప్రవే శించినప్పుడు మనమెంతో మనశ్శాంతిని అనుభవింతుము. పరిశుద్ధమైన జీవితమును గడపవలయు నని వాంఛ పొందమును. ఆధ్యాత్మికభావములు మనలో ఉద్భవించును. ఈ ధూళి ప్రాతఃకాలమున వచ్చును. అందుచే యోగులు ఉన్నతసత్యమును ధ్యానించుటకు ప్రాతఃకాలముల నుపయోగించుకొందురు.

రెండవ విధమైన ధూళి కంపనధూళి. ఈ ధూళి మన శరీరములోనికి ప్రవేశించినప్పుడు మన మేదో కార్యకరజేచ్ఛను పొందుదుము. మన విషయేచ్ఛలు ఉద్రేకమును పొందును. ఈ ధూళి సూర్యోదయమైన పిమ్మట మూడు నాలుగు గంటలకు భూమిపైకి వచ్చును. దాని విజృంభణ వేళలో మనము మన కార్యముల రూపొందింతుము.

మూడవది తమోధూళి, ఈ ధూళి మన శరీరములో ప్రవేశించినప్పుడు మనము బరువుగా మాంద్యముగా నిద్ర వచ్చుచున్నట్లుగా అనుభూతి పొందుదుము. వ్యతిరేకగుణము లన్నియు ముందునకు వచ్చును. ఈ ధూళి మన గోళముపైకి సూర్యాస్తమయవేళ ప్రవేశించి రాత్రి యంతయు నిలచును.

ఈ ప్రకారము ఈ మూడు విధములయిన ధూళిప్రవాహములు ఒక కాలక్రమపద్ధతి ననుసరించి సంచరించును. నే నా యా కాలములను స్థూలముగా చెప్పితిని. ఇంకను స్పష్టముగ చెప్పవలయునన్న ప్రతిప్రవాహము నలుబది నిమిషములు ప్రవహించును. నూటయిరువది నిమిషములలో ఒక ఆవృత్తి ముగిసి రెండవది ఆరంభమగును. ఈ భూగోళమున కొన్ని ప్రత్యేకస్థలములపై ఈ ధూళిప్రవాహములలో ఒక్కొక్కటి విజృంభించును. అట్టి ప్రదేశము నైతికమార్గమును వర్ధిల్ల జేయుటకు అనుకూలమైనది. ఎందుకనగా కాంతిధూళి అక్కడ మిక్కుటముగా ప్రవహించును.

అట్టి ప్రదేశములు భారతదేశములో త్రివిష్టపములో కొన్ని మాత్రమే గలవు అని యోగులు చూచి నిర్ధారణము చేసిరి. ఈ కాంతిప్రదేశము లలో జంతువులయొక్కగాని మానవులయొక్కగాని హింస సృష్టి అయి నది మొదలు జరిగియుండలేదు. ఈ ప్రదేశములు మానవజాతికి ఆశాజన కములు. అవి యోగధామములు. ప్రేమపూర్ణమైన మతములను స్థాపించి నవారెల్లరు ఆధ్యాత్మికసత్యములను గ్రహించినది గాని అభ్యసించినది గాని ఈ ప్రదేశములలోనే. నియమముగా ఈ కాంతిధూళి ఉత్తరము నుండి ప్రవహించును. కంపనధూళి తూర్పునుండి ప్రవహించును. అందుచే ధ్యానము చేయునప్పుడుగాని అభ్యాసము లాచరించునప్పుడుగాని యోగి ప్రాఙ్ముఖుడై కూర్చుండును లేదా ఉత్తరాభిముఖుడై కూర్చుండును. భోజనము చేయునప్పుడుగాని విశ్రాంతి తీసికొనునప్పుడుగాని అతడు ప్రాఙ్ముఖు డగును. దక్షిణము ఆగ్నేయము విసర్జింపవలసినవి. ఎందు చేతననగా ఈ దిక్కులనుండి తమోధూళి ప్రసరించును. ఈ తమోధూళి ప్రవాహములు పైనుండిగాని క్రిందినుండిగాని కాక సర్వదిక్కులనుండియు ఒకేసారి పేటవాలుగా ఊర్ధ్వాభిముఖముగా ప్రవహించును. అందుచే యోగి తన ఆశ్రమమును ఉత్తరమునకు వాలుగా కట్టుకొనును. దక్షిణాగ్నేయ ములు వర్జింపదగినవి. యోగియొక్క ఆసనమైనను కొంచెము ఉత్తరము నకును కొంచెము తూర్పునకును వాలిన ట్లుండవలయును. సామాన్యు లయినను ముఖ్యముగా ఈ దిక్కుల ప్రాముఖ్యతను ఈ ప్రవాహముల సంచారవేళలను గూర్చి తెలిసికొని ఉండవలయును. నీ యింటిని దక్షిణ మునకు గాని ఆగ్నేయమునకుగాని పెంచుట కూడదు. ఇంటిని పెంచ వలసివచ్చినప్పుడు తూర్పునకుగాని ఉత్తరమునకుగాని పశ్చిమమునకుగాని పెంచవచ్చును. మిత్రులను కలిసినప్పుడు వారు దక్షిణాభిముఖులగుట కూడదు, నీ వేదయినను నూతనకార్యమును ఆరంభించునప్పుడు తమో ధూళి ప్రవహించు వేళలు పనికి రావు. సాయంకాలము మూడుగంటలు

ఏడుగంటలు పనికిరావు. ఒక విధమయిన ధూళిప్రవాహము తన శరీరము లోనికి ప్రవేశించునప్పుడు తా నేమి చేయుచున్నాను ఏమి చేయవలయును అని యోగి జాగ్రత్తతో ఎల్లపుడు గమనించుచుండును. తమోధూళి మన గోళమును ప్రవేశించుచున్నప్పుడు ఒక సత్కార్యమును చేయుచున్న యెడల సత్ఫలితము రాక దుష్ఫలిత మేర్పడును. ఆ కాలమున సత్కార్యము వర్ధిల్లుటకు తమోధూళి ఆటంక మగును. కావున సత్కార్యము సత్ఫలితము నీయజాలదు. యోగి తన శ్వాసమువలన వర్ణమువలన నాడి వలన తన శరీరములోని కే ధూళి ప్రవేశించుచున్నదియు తెలిసికొనగలడు. కాబట్టి దినమందు ప్రతిగంటలో కూడ నీ వే పని చేయుచున్నను చదువుచున్నను ధ్యానముచేయుచున్నను ధర్మకార్యము చేయుచున్నను ఆ పని ఆ వేళకు తగినదా కాదా అని గమనింపవలెను. నీవు వీలయినంతవరకు నీ శరీరమును కాంతిధూళితో నింపుకొని కంపనతమోధూళుల నుండి తప్పుకొనవలెను. ఈ జీవిత మున్నంతవరకు ఈ మూడు విధములయిన ధూళులు శరీరములో ప్రవేశించుచునే యుండును. కాని యోగాభ్యాసముచేత నీవు కంపనతమోధూళులను శరీరారోగ్యమునకు కావలసినంత వరకే స్వీకరింతువు. ప్రకృతిద్రవ్యము అని చెప్పబడినది ఈ త్రివిధ ధూళియే. ఇది ఆకాశములో ఎంతో దూరమునుండి మన గోళమునకు వచ్చును. యోగి ఈ ధూళులను కావలసినంతవరకు తన యిష్టప్రకారము లోనికి స్వీకరించి నూతనలోకముల సృష్టిచేయుటకు ఈ కాంతికంపన ధూళులను ఉపయోగించును. సత్యరాజ్యస్థాపనముచేయు తలంపుతో అతడి ట్లొనర్చును. ఈ వర్తమానప్రపంచమును మార్చుటకు వీలుకాని యప్పుడు యోగులు దీనిని నిర్మూలింతురు. నూతనలోకమును సృజింతురు. ఈ విశ్వచరితమున ఇట్లనేకపర్యాయములు జరిగినది. అది తిరిగి జరుగగలదు. ప్రాతబడిన లోకమును నిర్మూలింతు రనగా మొదలు లేకుండ చేతురని అర్థము కాదు. అందు కలిసిన ధూళులయొక్క పాళ్ళను

మార్చి వేతురని అర్థము. నీవు ధ్యానము చేయునప్పుడు కాంతిధూళిని ధ్యానించుటకు యత్నింపుము. దానివలన కాలక్రమమున నీ బుద్ధి మూల సత్యములను మూలసూత్రములను గ్రహింపగలదు. వానిని నీ వంతకుముం దెన్నడు ఎఱిగియుండవు. నీవు క్రమపద్ధతిలో మహోన్నతాకాశసీమల నుండి వచ్చు కాంతిధూళిని ధ్యానింతువేని నీకు గొప్పనైతికగుణము లలవడును. బలము చేకూరును. నీ హృదయము విశ్వప్రేమతో పొంగి పోవును. నీ బుద్ధి కడు సూక్ష్మము నిశితము అయి సులభముగ విషయ విచక్షణము చేయగలుగును. కొందఱిలో దానగుణ ముండదు. కొందఱు అపాత్రదానము చేయుదురు. కారణ మేమనగా వారు తమోధూళి ప్రవ హించువేళ పనిచేయుదురు. అనేకు లీ రీతి అంధప్రాయముగ భౌతికముగ జీవింతు రేల ననగా వారు తమోధూళివేళల ధ్యానింతురు. కాంతిధూళి వేళల నిద్రింతురు. జీవిత మెట్లో మరణముకూడ అట్లే. మరణవేళ ఆత్మ శరీరమును ఎట్టి ముహూర్తమున విడుచుచున్నది అనున్నది అతి ముఖ్యము. కాంతిధూళి ప్రవహించువేళ శరీరమును ఆత్మ వీడుచో అది జీవితానంతరము సుఖమును పొందును. ఆనందమయములయిన ఊర్ధ్వ లోకములను చేరును. ఒక మానవుడు కంపనధూళి ప్రవహించుచున్న ప్పుడు మరణించునెడల వాని ఆత్మ బాధల ననుభవించుచు అసహ్యాసీమల సంచరించును. ఒకడు తమోధూళివిజృంభణవేళ మరణించుచో వాని ఆత్మ అధోలోకములకు చేరును. అందుచే యోగి సరియైన వేళలలో తన శరీర మును విడువవలయును. మానవుడు తన జీవిత మంతయు సరియైన పనిని సరియైన కాలమున చేయుట అను మంచియలవాటును చేసికొనిన యెడల అతని ఆత్మ అతని శరీరమును సరియైన వేళలో విడచును. అందు వలన ప్రాతఃకాలమునందును సాయంకాలమునందును ధ్యానము చేయుము. ఆ వేళలలో యోగులు నీకు ఏ గంటలో ఏ ప్రవాహము ప్రవహించునో తెలిసికొనుటకు సాయపడుదురు. ఈ శాస్త్రముప్రకారము నీ వాచరించితివా నీ వనేకవిపత్తులను అనేకదుఃఖవిషయములను తప్పించుకొనగలవు.

కాలము దేశము ధూళిప్రవాహములు వీని పరస్పరసంబంధము యోగికి తప్ప మఱియొకనికి గోచరము కానివి. వీని రహస్యమతని కొక నికే తెలియును. ఈ సూక్ష్మమైన సత్యము నెఱుగు శక్తిని నీవు వృద్ధి చేసికొనినయెడల వీనిని నీవు తెలిసికొనగలవు. నీ జీవితములో దుర దృష్టవిషయములు దౌర్భాగ్యములు సంభవించుటకు కారణము ఈ సత్య మెఱుగకపోవుటయే. నీతో సంబంధ మున్న వారిపై వీని ప్రభావమును గూర్చి నీ వెఱుగకపోవుట యింకను ఘోరమైన విషయము. అదృష్టము గాని దురదృష్టముగాని తోడిమానవుల మూలమున వచ్చుచున్న ట్లేది కన బడుచున్నదో అది నిజముగా ఈ సూక్ష్మములయిన విశ్వాతీతశక్తుల నుండి వచ్చుచున్నది. అనగా ఈ శక్తుల ప్రసారమున కెదురుగా మనలను మనమే ఉంచుకొను పద్ధతినిబట్టి సంభవించుచున్నది. ఈ రహస్యమును మనము గుర్తించి మన కపాయము కలుగజేయు వారినిగూర్చి ద్వేషభావ మును పూనరాదు. అ య్యగోచరశక్తుల చేతులలో వారు జ్ఞానరహిత సాధనములుగా మాత్రమే ఉందురు. ఎల్లప్పుడు ప్రజలతో నూతనసం బంధము లారంభింపుము. పూర్వపు పైశాచికాతిక్రమణలను మఱచి పొమ్ము. మానవులయొక్క విధులను దిద్ది తీర్చు ఈ శక్తులయొక్క నాటకమును ప్రతివాడును అర్థము చేసికొనవలయునని మా అభిలాష. ఒక మానవునియెడ మఱియొక మానవుని బాధ్యత గొప్పది. ఎగతాళికైనను ఇతరునికి దుఃఖము కలిగించుటకు ఎవ్వనికిని అధికారము లేదు. మనకు గాని ఇతరునికిగాని దుఃఖమును కలిగింపకయే మనము జీవింపవలెను మరణింపవలెను. నేను దుఃఖముతో నుండవలయునని వాంఛింపను కద. కావున నా జీవితములో ప్రతిక్షణము అజ్ఞానముచేతగాని అజాగ్రత్తచేత గాని ఇతరునికి దుఃఖమునుగాని బాధనుగాని కలిగింపకుండునట్లు చూచుట నా ముఖ్యధర్మమై యుండవలయును.

తాను చేసిన కర్మకు ఫలితము రావలయునను వాంఛ లేకయే ఆచరించుచో ఆ కర్మకు బహూకృతిగా నిజమయిన విశ్వాస మబ్బును. ఏదో స్వార్థమును పొందు దృష్టితో సత్కార్యాచరణ మొనర్చినచో నిజ మయిన విశ్వాసము నీ ఆత్మలో ప్రవేశింపనేరదు. విశ్వాసము లేనిది జ్ఞానము లేదు. కాబట్టి నీవొక సత్కార్యమును చేయుచున్నప్పుడు నీ వొకరికి సహాయము చేయుచున్నప్పుడు ఒకరికి దానము చేయుచున్న ప్పుడు నీ కేదో ప్రతిఫలము రావలయునన్న భావముతో నెన్నడును చేయకుము. మనము ముఖ్యముగా స్మృతియం దుంచుకొనవలసినది ఏమనగా— ఈ మానవరూపమును స్వీకరించుటలో మన లక్ష్యము దేవుని యందు విశ్వాసమును పొందుట అని. కాబట్టి నీవు విద్యార్జనలోగాని వ్యాపారములోగాని సంఘసేవలోగాని ఏ పని చేయుచున్నను సర్వకార్య ములను దేవునియందు విశ్వాసము బలమొందవలెనని ధ్యాన మొనర్చుచు చేయుము. విశ్వాసముకంటె ఉత్తమమయిన దింకొకటి కలదని ప్రయోగు లకు తెలియును. అది యేదో చెప్పుటకు దానిని వర్ణింపగల శబ్దములు భాషలో లేవు. నీ వొక త్యాగమయజీవితమును ధ్యానమగ్నజీవితమును జరుపుట కారంభించి పోవుచుండగా ఒకానొకనాడు ఆ విశ్వాస మను అద్దములో ఆ మహోన్నతవస్తువు నీకు సాక్షాత్కరింపగలదు.

దేవుని దయతో అవిరుద్ధములైనవి ఈ మూడు ధూళిప్రవాహములు అని నిరూపించుట దుర్లభము. ఈ కాంతిధూళిని సృజించిన దేవుని మన స్సులో గల భావము మిగిలిన రెండు విధములయిన ధూళులను సృజించు టచే విచ్ఛిన్నమైనదా యేమి అని తోచును. ఎందుకనగా ఈ రెండు ధూళి ప్రవాహములవలన మన మనస్సులో భయంకరములయిన భావములు రేగి మొదటిదానివలన కలిగిన భావములను అతిక్రమించును. ఈ విష యము లన్నియు యోగ మెఱుగని సామాన్యులకు అర్థము కానివి. అనే కులు తాత్త్వికులు ఈ ప్రపంచములోనికి చెడుగు ఎట్లు ప్రవేశించుచున్న

దని వివరింప యత్నించిరి, కాని వారి యత్నములు నిరర్ధకము లయినవి. నిజమయిన వివరణము యోగసిద్ధిని పొందినవాడే చెప్పగలడు. మంచి చెడ్డల సమస్యను ఎవనికి వాడే పరిష్కరింపవలసియున్నది. కనుక నేను చెప్పున దేమనగా నీవు ప్రతిదినము దేవుని చేరువకు వచ్చునట్లుగా బ్రతుకుము. అట్లు నీ వాయస సన్నిధికి రానియెడల ఆయన ధ్వనిని వినలేవు. ఆయన ధ్వనిని వినకున్న నీ సంశయము లెన్నటికిని విడజాలవు. కాని ఓర్పు కావలయును. ఈ సంవత్సరము నీవు కృతార్థుడవు కాకున్న రాబోవు సంవత్సర మెట్లుండునో చూడవలయును. ఈ జీవితములో కృతార్థుడవు కాకున్న రాబోవు జీవితపరిణామముకొఱకు సంతోషముతో వేచియుండవలయును. ఓరిమి లేకుండుట అల్పబుద్ధుల పాపఫలము. పవిత్రాత్మ చేయు ప్రార్థనము భగవానుని కర్ణములకు సోకునని రూఢిగా నమ్ముము. దేవుడు గురువులలోని కెల్ల గురువు. యోగి దేవుని పాఠశాలలోని శిష్యుడు. నీ హృదయమునుండి అసంతుష్టికరములగు భావములను పారద్రోలుము. అవి తమోమూలములనుండి యెగసి వచ్చినవి. అవి నీ హృదయమును దుఃఖాగ్నిలో బడవైచి భస్మముచేయును. నీ మనస్సులో తమోభావరేఖలు స్పందించుచున్నంత కాలము నీకు యోగము నభ్యసింపగల ఆశకు తావు లేదు. నీ గతమును పూర్ణముగ మఱచి పొమ్ము. ఈ నూతనజీవితము కాంతిని ధ్యానించు జీవితము కాగలదు.

# అమృతరహస్యము

మానవుని ఆత్మ అమర్త్యము. అది దేవునికంటె వేఱు కాదు. మానవానీక మంతటియొక్క ఆత్మకు దానికి విభిన్నత లేదు. ఐనను సామాన్య జ్ఞానము అది ఇతరమానవుని ఆత్మకంటె వేఱైనట్లుగా దేవుడు సర్వ మానవానీకముయొక్క ఆత్మకంటె వేఱయినట్లుగా మనను నమ్మించు చున్నది. వేదాంతముయొక్క విధి ఏమనగా ఈ విషయముల లోతు నెఱుగుట. ఆత్మ ఒకటియా అనేకమా ? ఒకనిలోని ఆత్మకు ఇంకొకని లోని ఆత్మకు భేద మున్నదా ? అను విషయములను నీవు చక్కగా విచారించినయెడల ప్రతిఆత్మ వేఱనియు ఆత్మ సంఖ్యాత్మకమైన దనియు అంగీకరింప జాలము. భౌతికదేహములకు గణితపద్ధతులు సరిపడును. ఇవి రెండనియు ఇది యింత పొడుగనియు ఇది యింతకాల ముండుననియు— ఇట్టి గుణములు ఆత్మకు సరిపడవు. కాబట్టి ఆత్మను గూర్చి ఏకమని అనేకమని చెప్పుట తాత్వికపద్ధతి కాదు. అట్లైన ఆత్మను గూర్చి తలచుట ఎట్లు ? ఆత్మ కొక గుణము ఒక లక్షణము లేదు. ప్రకృతిద్రవ్యమునకు గుణ మున్నది లక్షణ మున్నది. ఆలోచించుట ఇచ్ఛయించుట అనుభవించుట ఇవి మనస్సుయొక్క గుణములు. కాని మనస్సు ఆత్మకాదు. మెదడు మనస్సు కాదు. వ్యాధి మరణము శరీరమున కాపాదించును. మనస్సున కాపాదించునవి కర్మ నైతికశక్తి. క్రిములు శరీరమును బాధించును. కర్మ మనస్సును బాధించును. ఆత్మ రుజామరణములకు కర్మకు అందక ఆవల ఉండునది. ఆత్మకు ఏ లక్షణము దొరకనప్పుడు మనము ఆత్మను ధ్యానించుట ఎట్లు ? ఇది క్లిష్టమయిన సమస్య. ప్రతిసమస్యను భేదించు మార్గ మున్నది. ఆత్మను ధ్యానించు విధానమును యిట్లు వివరింపవచ్చును.

మొదట నీ దేహమును గూర్చి తలంచుకొనుము. అది ఈ ప్రకృతి గతము లయిన పంచభూతములతో చేయబడిన దని భావింపుము. అటు పిమ్మట గాఢముగా ఆ పంచభూతములయిన పృధివ్యాపస్తేజోవాయ్వాకాశములను భావింపుము. ఈ పంచభూతముల కలయికవలన ఈ భౌతికశరీరము నిర్మింపబడినది. పిదప ఈ శరీరము కాలములో పుట్టి కాలములో అంతమగునని భావింపుము. తరువాత కాలములో పుట్టి కాలములో అంతమగునది యేదియు సత్యమైనది కాదనియు అది ఆత్మ కాజాలదనియు భావింపుము. ఈ భావనావిధానమును ప్రకృతిగతభూతము లైదింటికిని సమన్వయము చేసి నీ లక్ష్యమును ప్రతిభూతమునందును అనగా పృధివ్యాపస్తేజోవాయ్వాకాశముల యందు ప్రతిదాని యందును వేర్వేరుగా నిలుపుము. అప్పుడు ఈ పంచభూతములు కాలమున పుట్టి కాలములో అంతమగునని తలచి అట్లే కాలమునపుట్టి కాలములో అంతమగు ప్రతివస్తువును సత్యము కాదని భావింపుము. అటుపిమ్మట నీభావనను ఒక నూతనమైన ఉన్నత స్థాయికి ఎత్తుము. కాలమును ధ్యానింపుము. కాల మనగా నేమి ? విచారింపగా భావనలుచేయుచున్న అహంకారము విశ్వమును అర్ధముచేసికొనుటకు కాలమును సృజించుచున్నదని ఎఱుగుదువు. అప్పుడు నీవు కాలముపై మనస్సు నేకాగ్రముచేయుచో ఆ కాలము అహంకారమును విశ్వప్రకృతిని కలుపు కొక్కెముగా తోచును. అహంకారము కాలము లేనిదని భావింపుము. ఈ భౌతికప్రపంచముయొక్క అస్తిత్వము కాలభావము పైననే ఆధారపడి యున్నది. కాని అహంకారము కాలరహితముగా నున్నట్లు తనకు తాను భావింపగలదు. ఈరీతిగా ధ్యానముచేయు స్థితి ఉన్నతమైనది. ఈ స్థితిలో కాలమునకు ప్రకృతికి శరీరమునకు అంటక అహంకారము ఉండగలదు అని యోగి గ్రహించును. ఇది అద్భుతమైన పరిణామము. కాని ఈ స్థితికి వచ్చుటకు ప్రకృతికి అంటక స్వతంత్రముగా అహంకార ముండునని భావించుటకు చాల కాలము పట్టును. ఈ స్థితికి వచ్చినప్పుడు యోగాభ్యాసము

చేయువానికి పూర్ణత నందని స్థితిలో వ్యాధిగాని శరీరబాధగాని మరణము గాని సంభవించును. వానిని అతిక్రమించుట ఎట్లు? ఇది పెద్దరహస్యము. మానవుడు మొదట వ్యాధిబాధామరణములను పరిశీలించి ఆలోచించుచో నది యొక విచిత్ర విషయము. ఈ మూడు దౌర్భాగ్యములు అతనిని భయ పెట్టుకున్నచో అతని మనసుపై గాఢమైన ముద్రను పడవేయకున్నచో అతని లక్ష్య మెన్నడును ఆత్మవైపునకు మరల్పబడదు. అత డొక రాయివలె నుండును. కాని ప్రతిదెబ్బ అతనిని అతిప్రాకృతిక చింతనమునకు పురి కొల్పును. అందుచే దురదృష్టములను వ్యాధిని మరణమును మనము కవాట ఘాతములనుగా నిద్రించుచున్న మానవుని మేల్కొల్పుటకు ప్రయోగింప బడిన వానినిగా భావింపవలెను. కాని చాలమంది ఎన్ని దెబ్బలు కొట్టినను మేల్కొనరు. ఎన్ని దురదృష్టములు వ్యాధులు మరణములు సంభవించి నను అతడు నిద్రించుచునే యుండును. కాని మరణము వ్యాధి కేవలము తలుపుపై దెబ్బలని యోగి గ్రహించినంతనే ఆ వ్యాధిగాని ఆ మరణము గాని ఇక అతని చేరువకు రావు. ఎందుచేతననగా లోపలనుండి సమాధా నము వచ్చినపిమ్మట ఎవ్వరైనను తలుపుపై నిక దెబ్బలు కొట్టరు. అంతియే కాక నీ రాకకు కిటికీలోనుండి చూచుచు మేల్కొని యున్నప్పుడు తలు పుపై కొట్టనవసరమే యుండదు. ఒకానొక కాలము వచ్చును. ఈ ఆత్మ ఒకనా డీ అశాశ్వతమైన గూటిని వీడి మాయాసముద్రమును దాటి దివ్య సీమ నధివసించుటకు సిద్ధముగా నుండవలయునని జ్ఞాపకము చేయుటకు వచ్చు మిత్రులని యోగి తనచెంతకు వచ్చు వ్యాధిమరణములను భావిం చును. వ్యాధిమరణములను యోగి జయించుచున్నా డనగా వానివలన గలుగు భయమును జయించుచున్నాడని యర్థము. ఇందుల కతడు దేవు నికి తన నర్పించుకొనును. ఈ శరీరము మఱియు ఈ ప్రకృతిలోని సర్వ ద్రవ్యములు అశాశ్వతములని నీవు నిశ్చయించుకొనినప్పుడు శాశ్వతము కాని వస్తువులను ప్రేమించుచు ఆధ్యాత్మికశక్తిని వ్యయపఱచుకొనుట

శ్రేష్ఠము కాదని నీవు నిశ్చయించుకొనినప్పుడు నీవు ఉత్తమోపదేశమును నేర్చుకొనినవాడ వగుదువు. ప్రకృతిద్రవ్యముయొక్క నిజమైన విలువను యోగి యెట్లు నిర్ణయింపగలుగుచున్నాడు? అతడు తన కాంక్షను ప్రేమను ప్రకృతియొక్క గాఢ పరిష్వంగమునుండి యెట్లు వదలించుకొని వచ్చునట్లు సిద్ధముచేయుచున్నాడు? వైరాగ్యము నభ్యసించుట వలన వస్తువుల నిజరూపములు చూడనేర్చుటవలన ఇది సిద్ధించును. ఒకసారి నీ వీ ప్రపంచము ఆత్మ కాదని భౌతికమని నీవు లక్ష్యము నిల్పదగినది కాదని తెలిసికొనినప్పుడు నీ ప్రేమ దానివైపునకు ప్రసరింపదు. ప్రకృతిని ఇట్లు జయింపవలెను. వ్యాధిని బాధను మరణమును జయించు మార్గ మిది. అందుచే ప్రతిదినము నీ లక్ష్యమును ఆత్మపై అదియే ఏకైకసత్యమని ఏకైకానందమని నిన్నెన్నడును వీడని ఏకైకమిత్రమని తలచి నిలుపుము. క్రమముగా నీవు అహంకారమునకు సర్వాత్మకు భేదమును గ్రహింతువు. పంచభూతములకంటె అహంకారము భిన్నమైనదని నీవు గ్రహించినపుడు అహంకారము మఱియొక శాశ్వతమైన సత్యమైన విశ్వమయమైన దానిపై నాధారపడియున్నదని గ్రహింపగలుగుదువు. అహంకారమనగా అర్థమేమి? నేను అనునది. నేను అని భావించుట. నేను ఉన్నాను నేను అనుభవించుచున్నాను నేను తలచుచున్నాను అని మనమనుకొనుచున్నాము. కావున దీనిని నీవు ధ్యానించుచున్నావు. అప్పుడు నీ మనోగగనమున ఒక జ్ఞానము తళుక్కున మెఱుపువలె ఉద్భవించును. ఈ నేను కూడ సత్యము కాదని అదృష్టమునకే నేను యజమానిని కాదని వెనుకనున్న దేనిచేతనో ఇది కదలింపబడుచున్నదని ఆ జ్ఞానము చెప్పును. అంతట అహంకారమునకు వెనుకనున్న శక్తిని కనుగొనుటకు నీవు నిశ్చయము చేసికొందువు. ఇదే ప్రకారము భౌతికప్రకృతిని గూడ పరీక్షింతువు. పృధివిని తీసికొనుము. ఈ పృధివిపైనను సమస్తవస్తువులు ఇండ్లు చెట్లు పర్వతములు మొదలైనవి భూమియే ఆధారముగా నున్నవి. అందుచే మనము మన లక్ష్యమును

ఏ వస్తువుపై నుంచినను అది భూమియొక్క ఆధారము లేక నిలువగలు గుట అసంభవమని సహజముగ తలతుము. ఆ పైన దానిని దాని స్థాన ములో నిల్పునది మనకు గోచరము కానట్టి భూమ్యాకర్షణశక్తి అని తీర్మా నింతుము. ఇంతవరకు ఇది సరియే. ఇకపై మనమాలోచించున దేమి? భూమిని దానిస్థానములో నిల్పుచున్న దేది అని. ఈ ఆకాశములో భూగోళ మును నిల్పునది మఱియొక గొప్ప ఆకర్షణశక్తి ఉండి యుండవలెను. అప్పుడు పైకి చూతుము. సూర్యు నాలోకింతుము. సూర్యబింబము భూమి కంటె పెద్దదిగా కనబడుటచే అది భూమి కాధార మనుకొందుము. అప్పుడు ఈ భూమియొక్క ఉనికికి సూర్యాకర్షణశక్తి కారణమని చెప్పుదుము. అదేవిధముగా ఈ మన శరీరము దీని ఆలోకములు ఆలోచనములు మొదలయిన సమస్తముతో అహంకారముచే కూర్పబడియున్నది. ఇందు ప్రతిది దాని స్థానమున అహంకారము కారణముగా నున్నది. మన మింకను ఆలోచించినచో ఈ అహంకారము దాని స్థానమున విశ్వాత్మ కారణముగ నున్నది. కాబట్టి చక్కగా విచారణ చేయనివారు ప్రపంచ ములో అహంకార మున్నదని అహంకారములో విశ్వాత్మ ఉన్నదని మాత్రమే భావించినను పరిణతబుద్ధిగల యోగిదృష్టికి ఈ సమస్తము విశ్వాత్మయొక్క ఆకర్షణశక్తివలననే కూర్పబడియున్నట్లు కనబడును. విశ్వాత్మ చిన్నదియైన అహంకారమునకంటె భిన్నమైనది కాదు. ఇది యెట్లు అను విషయము ధ్యానముచేతనే అర్థము కాగల విషయము. ఎంత చదివినను ఎంత ఆలోచించినను ఎన్ని ఉపన్యాసములు విన్నను ఈ సత్యము నెఱుగుటకు అవి సాయపడవు. ఇక్కడ కూడ ఉపాసన అవసరము. పూజోపాసనలు చేయు వారు ప్రపంచమును త్యజించు వారు నిర్మలమైన పవిత్రమైన జీవితముల నెరపుదురు, ఈ మహైకసత్యము వారికే వ్యక్త మగును. ఎంతకాలము బహిరాకాశగతవస్తువులపై నీ మనస్సు నిల్పబడునో అంతకాలము నీవు ఈ మహాద్భుతతత్త్వరహ

స్యమును గ్రహింపజాలవు. నీ ఆత్మలోని దీపమును వెలిగింపుము. నీ నేత్రముల కా మహాసత్యసందర్శనము కాగలదు. అప్పుడు ఒక నామముతో ఒక రూపముతో నుండు వ్యష్టిజీవిత మనునది ఒట్టి మాయ యని నీకు వ్యక్తమగును. ఒకానొకనాడు గాఢధ్యానములో నీ ఆత్మ ప్రకృతిబంధములను త్రెంపివేయును. విశ్వాత్మలో నిలీనమగును. విశ్వాత్మను నీవు దర్శింపవలసిన విధి యున్నది. విశ్వాత్మను దర్శించుటయే జీవితలక్ష్యము. విశ్వాత్మను మన మెందుకు దర్శింపవలెను? ఎందుకనగా మనము దానిని చూచుటతోడనే విశ్వాత్మయే యగుదుము. అప్పు డిక జననమరణసంబంధమైన బాధలు మనకు ఖేదమును కలిగింపజాలవు. వ్యక్తిత్వము వదపోయబడిన బాధ. కాని నిరంతరపూజోపాసన విశ్వప్రయత్నము లేక ఈ వ్యక్తిత్వబాధనుండి ఈ మృత్యుగహ్వరము నుండి ఎవ్వడును విడుమర నొందజాలడు. కావున మార్గదర్శకులయిన యోగిజనులను విశ్వసింపుము. వారు నిన్ను సురక్షితమార్గముల సుజ్ఞానగిరిశిఖరమునకు కొంపోగలరు. నీ వా పర్వతశృంగమును జేరి ఉదయించుచున్న భానుబింబమును గాంచి ' ఈ విశ్వాత్మరవిబింబమును దర్శించునట్లు నాకు సాయపడిన యోగిజనులు జయింతురుగాక ' అని వినుతింతువు. విశ్వాత్మను దర్శించినవారే అవతారపురుషులు మహాప్రవక్తలు అగుదురు. ఒకసారి మానవుడు తనలోని విశ్వాత్మను దర్శించెనా అతడు యుగములకు కన్పట్టు ప్రదీపము కాగలడు. ఇతరులకు మోక్ష మొల్లే అబ్బును. మోక్ష మనగా నేమి? జననముయొక్క జీవితముయొక్క మరణముయొక్క బాధనుండి తప్పించుకొని స్వేచ్ఛ నందుటయే మోక్షము. అందువలన విసుగునొందని హృదయముతో ఆగని ఉత్సాహముతో గట్టిగా కృషిచేయుము. నీ హృదయమును ఆశాతప్తమునుగా నుంచుకొనుము. నీ మార్గమం దపజయము లేదు, ప్రపంచమునకు యోగి అవసరము. యోగులు కానివా రనేకు

యున్నారు. వారు కీటకములవలె పుట్టుచుందురు, చచ్చిపోవుచుందురు. నీ చైతన్యమునకు పునర్నిర్మాణమును కల్పింపుము. ఈ చైతన్య మిప్పుడు మాయాజాలములో చిక్కుకొని యున్నది. అందుచే నీవు సత్యమును చూడలేకున్నావు. చైతన్య మొక అద్దమువంటిది. ఆ యద్దమును నీవు నిర్మలముగా కాంతివంతముగా నుంచకుంటివా నీ ముఖమును నీవు చూడ లేవు. ఆ చైతన్యము ప్రకాశమానముగా స్వచ్ఛముగా నిర్మలముగా నుండెనా నిజమైన ఆత్మను నీవు చూతువు. విశ్వాత్మను తెలిసికొనుటలోని ఆనందము వర్ణనాతీతము. కాలుచున్న యిసుకలో తపించు చేపను నీ వెన్నడైనను చూచితివా? దానిని చూచినచో ఈ ప్రపంచములోని మన జీవితమును నీ వర్థముచేసికొనగలవు. ఇచ్చటి జీవితము దాని ధూమా గ్నులచేతనే ఉక్కిరిబిక్కిరి యగుచున్నది. నీ వొకసారి గాఢధ్యాన ములో విశ్వాత్మను సాక్షాత్కరించుకొంటివా ఆ తపించుచున్న చేపను లోతునీళ్లలో బడవైచినయెడల ఎంత సంతోషమును పొందునో, అంత సంతోషమును పొందుదువు. మన శైశవమున క్రీడించిన స్వగృహము విశ్వాత్మ. అదే మనది. ఈ తత్త్వము భూలోకములో గాని స్వర్గలోక ములోగాని సర్వోత్తమ మయినది. ఈ తత్త్వమును అవివేకులకు నమ్మ కములేనివారికి ద్వేషాత్ములకు బోధింపకుము. దీనిని పవిత్రముగా రహ స్యముగా నుంచుకొనుము. ఎవరు ఉన్నతమనస్కులో ఎవరు ధర్మహృద యులో ఎవరు ధ్యానాత్ములో వారికి మాత్రమే దీనిని చెప్పుము. మాన వుని ఉద్ధరించునది ఈ తత్త్వ మొక్కటియే.

# సాక్షాత్కారము

మానవు డాత్మవైపునకు ప్రయాణముచేయుచున్నాడు. కాని ఆత్మ కదలకయే యున్నది. ఆత్మ అహంకారము కాదు మానవుడు కాదు అక్షరము దివ్యము ఏకము. ఈ ప్రయాణ మెప్పు డారంభమైనది? ఎప్పుడంతమగును? అను విషయములను అహంకార మెఱుగదు. మన సమస్తకర్మలు సమస్తభావములు సమస్తాశలు ఈ పరమావధి నందుకొనుటకే ఆరంభమయినవి. కళ భూతదయ సంఘసేవ మతము తత్త్వము ఇవి అన్నియు దేవనగరమునకు పోవు మనకు మార్గమును చూపించుటకు దివిటీలు పట్టుకొని సాయపడునవి. ఆత్మ ఆకాశములో లేదు కాలములో లేదు ప్రకృతిలో లేదు. దానికి స్థానము లేదు. దానికి రూపము లేదు. అహంకారమునకు ఆత్మ విశ్రమస్థానము. మనము నిద్రించునప్పుడు ఆత్మ చెంతకుపోయి అహంకారమును మఱచిపోదుము. మేల్కొనినప్పుడు మన మాత్మ నుండి ప్రపంచమునకు తిరిగి వత్తుము. మనము మన తల్లిని తండ్రిని మానవానీకమును ప్రేమించునప్పుడు నిజముగా వారిని ప్రేమించుట లేదు. మనలోనను వారిలోనను గల ఆత్మయొక్క ప్రేమను అనుభవించుచున్నాము. మన మొక వస్తువును కోరినప్పుడు మనము నిజముగా ఆ వస్తువును కోరుట లేదు. ఆత్మయొక్క ఆనందమును అనుభవించుటకు కోరుచున్నాము. మన మొక బొమ్మను వ్రాయునప్పుడు గాని, గగన సౌందర్యమున కాశ్చర్యము నొందుచున్నప్పుడు గాని, ఒక వింతపనిని చేయుచున్నప్పుడు గాని. ఆత్మోచ్ఛ్వాసముచే కదల్పబడుచున్నాము. ఆత్మోచ్ఛ్వాసమునుండియే వేదములు ఉత్పత్తిల్లినవి. తేజోమూర్తులయిన మహర్షులు ఆవిర్భవించిరి. మనఃప్రపంచమును భరించునది భౌతికజగత్తును

మోయునది ఆత్మయే. అయినను అది కదలదు నెమ్మదిగా నుండును. చలన మెఱుగదు కలత నొందదు. గాఢధ్యానములో లోతులలో నీ వాత్మను దర్శించితివా దేని నెఱుగవలయునో దాని నెఱిగినవాడ వగుదువు. దేనిని చూడవలయునో దానిని చూచినవాడ వగుదువు. ఈ తత్త్వము పురాతనకాలమున బోధింపబడినది. ఆ బోధ నిరాటంకముగా వేల సంవత్సరములవరకు సాగినది. ఈ తత్త్వము నెవరు నేర్చుకొందురో వారు గ్రహణశక్తికలవా రగుదురు. విశ్రాంతి నెఱిగినవా రగుదురు. ఈ తత్త్వమును పఠించినవారు మానవానీకమును ప్రేమింతురు. మానవానీకమునకు సాయము చేయుదురు. మానవానీకముకొఱకు పనిచేయుదురు. వారు ఇతరమతములను గాని ఇతరప్రవక్తలను గాని విమర్శింపరు ద్వేషింపరు. మానవు లందఱిలో ఆత్మ కలదని వా రెఱుగుదురు. అందుచే వారు ప్రపంచమందలి సర్వమతములను సర్వతత్త్వములను గౌరవముతో పఠింతురు. గౌరవముతో వానిని గూర్చి విందురు. కాబట్టి నీవు సమస్తములైన ప్రాచీననవీనమతతత్త్వకళాసిద్ధాంతములను ప్రేమతో పఠింపవలయును. వానిలో గల బోధలయొక్క సారమును సంగ్రహించుట నేర్చుకొనవలయును. ప్రతియుగములో ప్రతిజాతిలో ప్రతిమానవుని లో గల శ్రేష్ఠతమమగు విషయమును నీవు గ్రహింప నేర్చుకొనవలయును. ఇతరమతములలో ఇతరజాతులలో ఇతరమానవులలో గల దోషములచే ద్వేషములచే నీ హృదయమునకు నొప్పి కలిగినప్పుడు మౌనము వహింపుము. నీలోని ఆత్మతో రహస్యముగా నిట్లు చెప్పుము ' దేవుని విన్యాసములు పలుతీరులు ' అని. మన చర్మచక్షువులు అపక్వమేధస్సు క్రమరీతి లేని వంశానుక్రమణిక సమస్తపదార్థములను తామసమైన అసమ్మోలముగలవానిని మంచివానిని గానే చూచును. చెడుగుచే ఆకర్షింపబడి నీ ఆత్మయొక్క నెమ్మదిని వీడకుము. ఇంకను వెలుగు రావలెననియు ప్రేమ గెలుపొందవలెననియు న్యాయము జయింపవలెననియు అంతరంగి

కముగా ప్రార్థనచేయుము. దేవుడు మన శ్రేయస్కరప్రార్థనలను అంగీకరించునని ఎల్లప్పుడు స్మృతియం దుంచుకొనుము. ఈ యోగమార్గమున మన కున్న విధి నంతటిని సూచించు పద మొకటి కలదు. ఆ పదము 'నిర్మాణము' అనునది. నీ మనసులో ఆదర్శమును సత్యాదర్శమును దయాదర్శమును సౌదర్యాదర్శమును శాంత్యాదర్శమును నిర్మాణము చేయుము. నీ మనసును ఆదర్శముపై ఎంత ఏకాగ్రముగ నిల్పుదువో అంత వింతగా నీ ఆదర్శము సత్యము కాగలదు. యోగి నేడు దేనిని ఆదర్శముగ కల గనునో అది రేపు సత్య మగును. కావున ప్రపంచములో నేటి చెడుగుయొక్క విజృంభమును జూచి నిరుత్సాహపడకుము. చెడుగును జూడకుము చెడుగును వినకుము. చెడుగును తలపకుము. మానవునకు మూడవ కన్నున్నది. ఆ మూడవకన్ను తెఱువబడినప్పుడు యోగి మంచియొక్క ప్రాబల్యమును గాంచును. మూడవ కంటిని తెఱచుటకు యత్నింపుము. అప్పుడు నీవు మంచినే చూతువు. మంచి అప్పుడు భౌతికరూపమున భాసించును.

యోగజీవితమున దేవుని సన్నిధికి పోవు బాటలు మూడు కలవు. మొదటి బాట కర్మమార్గము. కర్మ అనగా నేమి ? ఏది చేయుటవలన నీ హృదయము పవిత్రము ఉత్తమము అయిన సంతోషము నొందునో అది కర్మ. కర్మ అహంకారమును పరోపకారముచేయుటయందు ఉత్సాహము ననుభవించునట్లు చేయును. వ్యష్టి మనస్సులో విశ్వాత్మభావమును అభివృద్ధిచేయుటకే కర్మయోగి కర్మ లాచరించును. నీవు స్వయముగా స్వార్థత్యాగముతో కూడిన కర్మ లాచరించుచు మఱియొక్క మానవుని హృదయములో విశ్వసౌభ్రాతృత్వజ్ఞానమును ఉద్బుద్ధము చేయగలిగినచో అప్పుడు దేవుడు కర్మ నెందుకు సృజించెనో ఆ లక్ష్యమును సార్థకము చేసినవాడవు కాగలవు. మానవానీకములోని భిన్నభిన్నజాతుల మధ్య మిక్కిలి సమన్వయమును మిక్కిలి సామరస్యమును తీసికొనివచ్చుటయే

ఈ కర్మాచరణముయొక్క లక్ష్యము కావలయును. ఒక మహాకర్మ చేయు నప్పుడు జాగ్రత్తగై కొనవలసిన చిన్నచిన్న కర్మలను ఓర్పుతో సుంద రముగా నిర్వర్తించుట నేర్చుకొనవలయును. ప్రతిదియు కర్మయే. నీ వీ కర్మజీవితము నారంభించునప్పుడు నీ ఆత్మతో రహస్యముగా నిట్లు చెప్పుము ' కర్మయే పూజ. దేవుడు కర్మకు అధిపతి ' అని. నీ దినచర్య ముగిసినప్పుడు తిరిగి యిట్లు చెప్పుము ' పూర్తిచేయబడని కర్మలకు దోష ములున్న కర్మలకు క్షమాపణ ఉండునా ? నా కర్మను దేవు డంగీకరిం చునా ? ' అని. ఈ ప్రకారము చేయుచో నీవు నీ కర్మరంగమున దేవునే మార్గదర్శకునిగా గైకొందువు. కాని ఒకటి గుర్తుంచుకొనుము. ఆత్మ కర్మ నాచరింపదు. అది అకర్మకముగాను ఉండదు. కర్మ నాచరించుచున్న ప్పుడు నీవు స్మృతియం దుంచుకొనవలసినది ఏమనగా నీ నిజమైన ఆత్మ పనిచేయుట లేదనియు దేశకాలములయందున్న నీ భౌతికప్రకృతియే కర్మల నాచరించుచున్నదనియును. కాబట్టి చింతనచేత పవిత్రతచేత్త అను భవమునకు తెచ్చుకొనుటచేత, జీవనోపాధికై నీవు కర్మ లాచరించు చున్నను, శాంతిసాధనకై దేవుని దయ ప్రసరించినంతకాలము నీ వీ భూమిపై నుందువు.

ఇక రెండవమార్గము భక్తిమార్గము. నీ హృదయమునకు విశ్రాంతి లేనప్పుడు కర్మయొక్క తాపము నీ ఆత్మశక్తిని శోషింపజేసి నప్పుడు దేవుడు తప్ప నీకు వేఱు ఆశ్రయము లేకుండును. మన భౌతికజీవితము యొక్క స్వభావ మేమనగా ఇతరకర్మ లన్నియు ఎంత గొప్పవైనను ఎంత కొద్దివైనను చేయబడకయో అసంపూర్ణముగా చేయబడియో నిలచి పోవును. అప్పుడు మన హృదయము చేదుగ మన జీవితము శూన్యముగ నగును. మన మేమి చేయవలెను ? మన హృదయమును దైవభక్తితో నింపవలయును. తల్లికై పసిబిడ్డ ఏడ్చునట్లు మనము దేవునికై ఆక్రం దించుట నేర్చుకొనవలయును. మన హృదయరహో మంటపమున ఆయ

నను పూజించి మన ప్రార్థనము ఆయనకు నివేదించుకొనవలెను. ప్రతి వాడును దేవుని ప్రేమింపలేడు, ధ్యానింపలేడు, ప్రార్థింపలేడు. అనేక వేలలో ఒక్కనికి నిజమయిన పూజారహస్యము తెలియును. అతనికైనను సరిగా తెలియదు. దేవుడే తనను సరిగా పూజించు పద్ధతిని నేర్పును. ఆయనయే తనను ప్రేమించుటను సయితము నేర్పును. ఈ భక్తితత్త్వము ఏ దేవాలయమునందు గాని ఏ గ్రంథములో గాని ప్రకృతిలో ఎక్కడైనను గాని నిక్షిప్తమై లేదు. ఇది ఒక దివ్యవిషయము. అందుకొనలేని ఉన్నతశిఖరమున నున్నది భక్తి. ఎవడు తన నేత్రములనుండి నిద్రామోహమును దులిపివైచునో ఎవడు దివ్యగానముతో తన జీవనమునకు శ్రుతి గలుపునో ఎవడు సర్వవ్యాపకుని ఇచ్ఛ కనుగుణముగా తన ఇచ్ఛను మలుపుకొనునో వానికి దైవభక్తి దత్తమగును. ఎవడు జీవితమును ప్రేమించునో వాడు దేవుని ప్రేమింపలేడు. ఏ హృదయము స్వార్థముపై దృష్టిని నిలుపునో అచ్చోట ప్రేమ లేదని నమ్ముము. అహంకారమును ఎవడు వర్జింపలేడో అతడు ప్రేమింపలేడని నమ్ముము. మనము సంపూర్ణముగా దేవుని హస్తములోనికి మనలను సమర్పణము చేసికొనినప్పుడే ఈ ప్రేమ వచ్చును. వచ్చి మన హృదయమునకు తాకి వేడి కలుగజేయును. కాబట్టి దేవుని ప్రేమింపగలుగుటకు మనము జీవితమును త్యజింపవలెను. మన మాయనకు మనలను సమర్పించుకొనుట నేర్చుకొనవలెను. మనము పూర్ణముగ అహంకారవాసనను పరిత్యజింపవలెను. మన హృదయములోనికి ప్రేమ ప్రవేశించి నప్పుడు జీవితము ఒక దివ్య కవితాప్రబంధముగా నగును. దానిలో భక్తుడు నక్షత్రప్రపంచమున కావల దాగున్న సర్వవిజ్ఞానమును పఠింపగలడు. నిరంతరముగా శ్రద్ధతో నీ హృదయాంతరాళమున నీ భక్తిని పెంపొందించుకొనుము. అది ఒక స్వభావముచేతనే సిద్ధించు, తనంతతానే వచ్చిపడు సహజజ్ఞానము కాదు. వంశానుక్రమముగా వచ్చునది కాదు. అది ఎట్లో సంపాదించుకొనునది

కాదు. ఎవనిని దేవుడు వరించునో ఎవనిపై దేవుని కరుణ ప్రసరించునో అతడే భక్తి చేయగలడు.

ఇక మూడవ మార్గము ఆత్మజ్ఞానమార్గము. ఎవనిలో విశ్వచైతన్యము సర్వాత్మబోధ ఉన్నతస్థాయిలో వృద్ధి చేయబడునో అతడు దేవుని సాక్షాత్కరించుకొను మార్గమున నడువగలడు. ఈ మార్గ మన్ని మార్గములకంటె కఠినమైనది. ఇది కర్మమార్గమునకంటె భక్తిమార్గమునకంటె భిన్నమైనది. ఇది ఏ కొలదిమంది యోగులకో మాత్రమే తెలియును. దీనికి నిశితమైన వివేచనశక్తి గొప్ప ఆలోచనశక్తి సర్వశ్రేష్ఠమైన ఏకాగ్రత కావలయును. యోగమున ఇది చివర మెట్టు. ఎవడు ఈ చరమము ఉన్నతము అయిన యోగాభ్యాసమున సిద్ధిబొందునో అతడీ భవబంధమునుండి శాశ్వతముగా విముక్తుడు. యోగి ఈ విధమయిన యోగమార్గమును అభ్యసించెనా సర్వజీవసమైక్యతను దర్శించును. వ్యష్ట్యహంకారమును ఇక స్మరింపడు. విశ్వాత్మ అతని ఆత్మలో నిండిపోవును అతని ఆత్మ విశ్వాత్మలో విలీన మగును. అది వర్ణించుటకు వీలుకానిది ఊహించుటకు శక్యముకానిది. ఇది మహోన్నతము మహోత్తమము అయిన యోగము. కాని నీ వీ మూడు మార్గములను కలిపి నీ ఆత్మలో ఏకము చేసికొనవలెను. నీవు దేవునికొఱకు కర్మ చేయవలెను. దేవుని భక్తితో ప్రేమింపవలెను. దేవుని నీ ఆత్మకేంద్రమున నుండునట్లు చేసికొనవలెను. అట్లు చేసినచో నీ యభివృద్ధి నిక్కముగా జయప్రదమగును. నీ సమస్తాశలతో మానవానీకముయొక్క ఆశలు ముడిపడియున్నవి. నీ వేది వాంఛించినను అది సర్వమానవానీకముయొక్క వాంఛయై యుండునా అని పరీక్షించుకొనుము. 'నేను కోరుచున్న ఈ కోరిక సర్వమానవానీకముచే మంచిదని నిర్ణయింపబడునా లేదా' అని నిన్ను నీవు ప్రశ్నించుకొని పరీక్షింపుము. నీకు సంతృప్తి కలిగెనా నీ వాంఛ సద్వాంఛ అని యెఱుగుము. యోగజీవితము నిత్యజీవితమునుండి

మేలుచేయుటకు వీలుకానిది. నీవేమి చేయుదువో ఏ యాలోచింతువో ప్రతిదిన మేమి యనుభవింతువో నీ యోగకర్మలలో ప్రతిబింబించును. కాబట్టి ఎల్లప్పుడు ఎందుకొరకు నీ జీవనశక్తిని శ్రమింపజేయుచున్నావో జాగ్రత్తగా చూచుకొనుము. ఎల్లప్పుడు దేవునికి నిన్ను నీవు సమర్పించుకొనుము. అట్లొనర్చినచో నీవు చేయు సర్వశుభకర్మలయందును దేవుని ఆశీర్వచనము మానవానీకముయొక్క సానుభూతి ఉండగలవు.

నేను జీవితము తరువాత జీవితములో ఏమి బోధించుచుంటినో అది నీ కిప్పుడు బోధించితిని. నీవు మఱచిపోతివి. కాని నేను మఱచి పోలేదు. ఈ మఱచిపోవుటచేత సత్యజ్ఞానము నీ మనస్సులో మరుగునపడియున్నది. ఇప్పుడు తిరిగి శుభముహూర్త మరుదెంచినది. కాంతి లోకమునుండి నీ ఆత్మలోని కిప్పుడు ప్రవహించుచున్న జ్ఞానమును సద్వినియోగము చేసికొనుము. నీ వెవడవో జీవితములో నీ విధ్యుక్త మేమియో స్మృతికి తెచ్చుకొనుటకు యత్నింపుము. సోమరితనముతో కూడిన విలాసములలో ఒక్క నిమిషమైనను వ్యర్థము చేయకుము. ఆధ్యాత్మికములు గాని తలంపు లూహించుటలో నిరర్థకములయిన పనులలో కాలమును పాడు చేయకుము. జీవితము జరుగుచున్నది. స్వప్నమునకంటె ఎండమావుల కంటె కూడ జీవితము మాయామయ మైనది. సర్వప్రపంచమునందలి నీ సోదరులతో ఏకత్వము ననుభవింపుము. మన జీవితమునకు మన ప్రపంచమునకు ఎవడు ప్రభువో, ఎవడు జనకుడో, ఎవడు రక్షకుడో, అట్టి పరమాత్మతో ఏకత్వము ననుభవింపుము. ఆయన ఇచ్ఛను తెలిసికొనుటకు యత్నింపుము. సంచితభావములనెల్ల పారద్రోలుము. ఈ బోధ గాఢముగా నీ ఆత్మలో నాటుకొనజేయుము. దానిచే యోగవృక్షము పెరిగి పెద్దదై పుష్పించి సమృద్ధముగా ఫలించి ఉన్నతజీవిత క్షుధతో బాధపడు వారలకు సంతృప్తి నీయగలదు.

ఆయుష్మంతుడా! నే నిప్పుడు నీకు సంగ్రహముగా ఆత్మోద్ధరణ శాస్త్రసారమును బోధించితిని. అది దివ్యమైనది పవిత్రమైనది. లోక క్షేమముకొఱకు నీకు చెప్పితిని. దీనివలన వీలయినంతగా బాగుపడుము. నిరంతరము దేవుని ధ్యానింపుము. ఆ ధ్యానమువలన ఈ బోధ జ్ఞానవంతులకు ఉత్తములకు పరిశుద్ధులకు చేరుగాక!"

ఓమ్ తత్ సత్